# అనుసంహిత



సారస్వతమున వెలసిన అనేక ప్రక్రియలలో ప్రహేళిక యొక ప్రక్రియ. ప్రహేళికలను గూర్చి సమగ్రమైన అనుసంహిత కావలసి యున్నది .ఇందు వాని స్వరూప స్వభావములు సంగ్రహముగా పరిచయము చేయబడును. సాహిత్యమున ఒక పరిణతి పరినిష్ఠితియు నేర్పడుటకుపూర్వ మే ప్రహేళికలావిర్భవించినవనవచ్చును. ప్రహేళికానామము ప్రాచీనమగునా! కాదా! యను విషయము చాల పరిశోధింపవలసియున్నది.

**ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే**
**తయో రన్యః పిప్పలం స్వాద్వత్త్యనశ్నన్నన్యోఽభిచాకశీతి( ఋగ్వేదము**
**ఉభతోద్వే ద్రీష్టికే మధ్యేగ్ని స్తతోఽమృతం**
**యోవిందతి తద్వింద త్యమృతమ్ -ఉపనిషత్తు**
**గంగాయమునయో ర్మధ్యేబాలరండా తపస్వినీ**
**బలాత్కారేణ గృహ్ణీయాత్ తద్విష్ణోః పరమం పదమ్( తంత్రశాస్త్రము**

ఇట్లు వేదోపనిషత్తంత్రాదులయందేగాక తిరునామాదులలో కూడా ప్రహేళికాచ్ఛాయ గోచరించును. పరిషత్తులలో, రాజాస్థానములలో, సమ్మేళనములలో ఇవి నెక్కువ ప్రచారమున నున్నట్లు ఆయా కథలను బట్టి తెలియుచున్నది. చమత్కారము మరియు వైచిత్ర్యముసాహిత్యము నకుప్రధానాంగములు. ఆవిచారితరమణీయము, విచార్యమాణరమణీయము, సమస్తసూక్తవ్యాపి, సూక్తైకదేశదృశ్యము, శబ్దగతము, అర్థగతము, శబ్దార్థగతము, అలంకారగతము, రసగతము, ప్రఖ్యాత వృత్తగతమని చమత్కారము పది విధములు. ఇందు ఏదేని చమత్కారము భాసించునప్పుడే సాహిత్యము సాహిత్యము నాపాదించును. ఈక్రింది ఉదాహరణముల గమనింతుమేని చమత్కార స్థితి గోచరించును.

**వేల్లత్పల్లవ సమ్మిలల్లత లసత్పుష్ప స్ఫుటుత్కుట్మల**

స్ఫూర్జద్గుచ్ఛభర క్వణన్మధుకర క్రీడావినోదాకర
రక్తాశోక సఖే దయాం కురు హర ప్రారబ్ధ మాడంబరం
ప్రాణాఃకంఠముపాగతాఃప్రియతమో దూరే త్వ మేవంవిధః
(మాలవరుద్రుడు)

రక్తస్త్వం నవపల్లవై రహమపి శ్లాఘ్యైః ప్రియాయాగుణైః
త్వామా యాంతి శిలీముఖాః స్మరధనుర్ముక్తాః సఖే మామపి
కాంతా పాదతలాహతి స్తవముదే తద్వ న్మమాప్యావయోః
సర్వంతుల్యమశోక కేవలం మహంధాతాః సశోకః కృతః – (యశోవర్మ.

ఇందు మొదటి పద్యమున చమత్కారము లేదు. రెండవపద్యమున ప్రతిపదమునస్ఫురించుచున్నది. ప్రహేళికలుచమత్కారాసహములంగుటవలన చమత్కారపద్యములు చమత్కారశ్లోకములని వానికి నామాంతర మేర్పడినది. ప్రహేళికా నిర్మాణము కవి యొక్క సర్వతోముఖ ప్రతిభావ్యుత్పత్త్యభ్యాస పాటవమును తెల్పును. సాధారణ జ్ఞానము సాధారణ పాండిత్యము ప్రహేళికా నిర్మాణమునకు గాని తదవగమన మునకు గాని సరిపోదు. సామాన్యముగా కవికి ఎంతయో బాధ్యత ఎంతయో పరిజ్ఞాన మపేక్షితము మరియు ఆవశ్యకము. కవికి ఎంత పరిజ్ఞాన ముండ వలమునో క్షేమేంద్రుడు తెల్పెను. పాఠకుల కుపకరించుననను తలంపున నిట ఉట్టంకింపబడుచున్నది.

వశితం సారస్వతోయాగః పూర్వం విఘ్నేశపూజనం
వివేకశక్తిరభ్యాసః సంధానం ప్రౌఢిరశ్రిమః
వృత్తపూరణముద్యోగః పాఠః పరకృతస్యచ
కావ్యాంగ విధ్యాధిగమః సమస్యాపరిపూరణం
సహవాసః కవివరైః మహాకావ్యార్థచర్వణం
ఆర్యత్వం సుజనైర్మైత్రీ సౌమనస్యం సువేషతా
నాటకాభినయ ప్రేక్షా శృంగారాలింగితామతిః
కవీనాం సంభవే దానం గీతేనాత్మాధివాసనం
లోకాచారపరిజ్ఞానం వివిక్తాఖ్యాయికారసః

అవికత్థనతా దైన్యం ఇతరా నిష్టయోజనం
పరాభిప్రాయకథనం పరసాదృశ్యభాషణం
సప్రసాదపదన్యాసః ససంవాదార్థసంగతిః
నిర్విరోధరసవ్యక్తిః యుక్తి ర్వ్యాససమాసయోః
ప్రారబ్ధకావ్యనిర్వాహః ప్రవాహ శ్చతురో గిరాం
శిక్షాణాం శత మిత్యుక్తం యుక్తం ప్రాప్తగిరః కవేః

మన ప్రాచీను లట్టి నియమములు అట్టి పరిజ్ఞానము కలవారు కావున అంత మహకావ్యముల అంతటి చమత్కార పద్యముల నిర్మింపజాలిరి. తత్తద్విషయ పరిజ్ఞానము ప్రహేళికల వలన కలుగును. సాహిత్యము యొక్క ప్రథమదశప్రహేళికయని మనమూహింపవచ్చును.

యత్తు రూఢిచ్యుతత్వేన ప్రోక్త మన్యార్థసంజ్ఞితం
ప్రహేళికాదిషు ప్రాయో గుణత్వం తస్య యుజ్యతే
నేయార్థం యత్స్వసంకేత కప్త వాచ్యం నిరూపితం
ప్రహేళికాదిషు ప్రాజ్ఞైః తద్గుణత్వేన గణ్యతే
గ్రామ్యం ఘృణావదశ్లీలామంగలార్థం యదీరితం
తత్సంవీతేషు గుప్తేషు లక్షితేషు న దుష్యతి

(సరస్వతీ కంఠాభరణము ప్రథమ పరిచ్ఛేదము)

దీనివలన ప్రహేళికయే సుసంస్కృతమై తత్తద్గుణాలంకార రసభావాదిస్థితినందినదని తెలుచున్నది. ప్రహేళికలలో భూషణములుగా నున్న అప్రయుక్త అపుష్టార్థక్లిష్టాన్వయ నేయార్థాదులు కావ్యమున దోషములగును. ఇంత మాత్రమున ప్రహేళికలన్నియు దుష్టములు రసపరిపంథినులని చెప్పరాదు. ఇందు హృద్యప్రహేళికలు కాలాతిసారములు మున్నగునవి కావ్యమున ధ్వన్యలంకారములుగా స్వీకరింపబడినవి. ఆలంకారికులు వీనిని వస్తుధ్వన్యాదుల కుదాహరించిరి.

అనందవర్ధనుడు వాచ్యవ్యంగ్యములకుగల విషయభేదము జూపుచు దీని నుదాహరించెను.

కస్యావా నభవతి రోషో దృష్ట్వా ప్రియాయాః సవ్రణ మధరం
సభ్రమరపద్మాఘ్రాణశీలే వారితవామే సహస్వేదానీమ్

ఇది ఒక హృద్యప్రహేళికయే-ఇందు పలురకముల వ్యంగ్యము స్ఫురించును. ఉపపతి వలన దంతక్షతము లేర్పడిన నాయికను పత్యాదులు శంకింప చతురయగు ఆమె చెలికత్తె యిట్లు పలికెను- ఎన్నిసారులు చెప్పినను వింటివా? తుమ్మెద వ్రాలియున్న తామరనుజూచితివి- వేదననను భవింపుము. తన ప్రేయసి మోవికాటుం జూచి యే ప్రియుడు కోపింపడునది వాచ్యార్థము తుమ్మెదయే దీని మోవికాటు వేసినది, అన్యుడుకాడు. కావున నీమెను శంకింపరాదని పతిని గూర్చి వ్యంగ్యము, ఇప్పటి కెట్లో బొంకి కప్పిపుచ్చితిని, ఇకముందు ఇంతస్పష్టముగా దంత క్షతములు చేయరాదని ఉపపతిని గూర్చి, ప్రియురాలి పెదవికాట్లు పతి కోపకారణములగును కాని అప్రియురాలివి కావు కావున మీరానంద పడరాదని పతి కీమె యందెంత మక్కువయని సవతుల నుద్దేశించి, ఈమె యందు మీరెట్టిశంక చేయరాదని ప్రక్కవారిని గూర్చియు, ఉపపతి వలన చుంబనాదులు పొందవలసినదే గాని బహిరంగముగా చిహ్నములు పొందరాదని నాయికను గూర్చియు పలు రకముల వ్యంగ్య ప్రతీతు లేర్పడును. ఇది హృద్య-ప్రహేళిక. దీనిని ఆలంకారికులు వస్తుధ్వనిగా స్వీకరించిరి. మరియు ధ్వని సిద్ధాంతమును కూకటి వ్రేళ్లతో నూడబెరికిన మహామేధావి మహిమభట్టు సైతము అనుమేయవస్తుకముగా వీని నుదాహరించెను.

శిఖిపిచ్ఛకర్ణపూరా వధూ ర్వ్యాధస్య గర్వీణీ భ్రమతి
ముక్తాఫలరచితప్రసాధనానాం మధ్యే సపత్నీనామ్

ఇందు ఏక వస్తు మాత్రాంతరిత చారుత్వము సూచింపబడినది.

**వస్తుద్వయాంతరిత చారుత :-**

వాణిజక హస్తిదంతా కుతోఽస్మాకం వ్యాఘ్రకృత్తిశ్చ

యావ ల్లులితాంకముఖీ గృహే పరిష్వక్ర్తే స్నుషా
వస్త్రత్రయాంతరితచారుతాః-

విపరీత సురతసమయే బ్రహ్మాణం దృష్ట్వా నాభికమలే
హరేర్దక్షిణనయనం స్థగయతి హ్రియాకులా లక్ష్మీః

వీని వివరణ తరువాతి భాగములలో చేయబడును. కావున నిట నామ మాత్రముగ నిర్దేశింపబడినవి.

ఆలంకారికులు దేనిని వ్యాజోక్తిగా నుదాహరించిరో అదియు హృద్యప్రహేళికయే!

దష్టం బింబధియాఽధరాగ్ర మరుణంపర్యాకులో ధావనాత్
ధమ్మిల్లి స్తిలకం శ్రమాంబుగళితం ఛిన్నాతనుః కంటకైః
ఆః కర్ణజ్వరకారికంకణఝణత్కారం కరౌ ధూన్వతీ
కిం భ్రామ్య స్యటవీశుకాయ కుసుమాన్యేషా ననాందాఽగ్రహీత్
మధ్యం విష్ణుపదం కుచౌ శివపదం వక్త్రం విధాతుః పదం
ధమ్మిల్లి స్సుమనఃపదం ప్రవిలసత్కాంచీ నితంబస్థలీ
వాణీచే న్మధురాఽధరోరుణాధరః శ్రీరంగభూమి ర్వపుః
తస్యాః కిం కథయామి భూరిసుకృతం మాన్యా సదా నిర్జరైః

ముద్రాలంకారముగా-

గ్రామేఽస్మిన్ ప్రస్తరప్రాయే న కించిత్ పాంథ విద్యతే
పయోధరోన్నతిం దృష్ట్వా వస్తు మిచ్ఛసి చేద్వద-(ఉత్తరాలంకారముగా
కం సంజఘాన కృష్ణః కా శీతలవాహి నీగంగా
కే దారపోషణరతాః కంబలవంతం న బాధతే శీతమ్ -

(చిత్రాలంకారముగా

మయి పశ్యతి సా కేశై స్సీమంతమణి మావృణోత్
అసీ న్నేత్రార్పితాకూతం లీలాపద్మం నిమీలితమ్ - ఇవి

కాలాతిసారములుగా

గురుసదసి సరసిజస్రజ మభిస్పృశతి కరేణ దయితతమే
సింధూరబిందుసుందర మలికతలం పాణినా వధూః పిదధే -

(సూక్ష్మాలంకారముగా స్వీకరింపబడినవి.

వక్రప్రహేళిక వక్రోక్తియైనది -

భిక్షార్థీ స క్వయాతః సుతను బలిముఖే తాండవం క్వాద్య భద్రే
మన్యే బృందావనాంతే క్వను స మృగశిశుః నైవజానే వరాహమ్
బాలే కచ్చిన్నదృష్టో జరఠవృషపతి ర్గోప ఏవాస్య వేత్తా
లీలాసల్లాప ఇత్థం జలనిధిహిమవత్కన్యయో స్త్రాయతాం నః

గూఢ ప్రహేళిక గూఢోక్తి-

నాథో మే విపణిం గతో న గణయ త్యేషా సపత్నీచ మాం
త్యక్త్వా మామిహ పుష్పిణీతి గురవః ప్రాప్తా గృహాభ్యంతరమ్
శయ్యామాత్రసహాయినీం పరిజన శ్శ్రాంతో న మాం సేవతే
స్వామిన్నాగములాలనీయరజనీం లక్ష్మీపతే రక్ష మామ్

ఇట్లే వివృతోక్త్యాదు లూహింపవలయును. అతిచమత్కారావహములైన ప్రహేళికలు అలంకారశాస్త్రమున నెట్లు నామాంతరముల జెందినవో బోధపడును పదగూఢత, వర్ణగూఢత, భావగూఢత, వస్తుగూఢత, కర్తృక్రియాది గూఢత, అన్వయ గూఢత మున్నగునవి ప్రహేళికలలో గోచరించును. ఏవియో కొన్ని అన్వయ క్లేశాదుల దృష్టియందుంచుకొని "రసస్య పరిపంథిత్వాత్ నాలంకారః ప్రహేళికా" యని నుడువుట విచారణీయము వాస్తవముగా ప్రహేళికల లంకారములు కావు. అలంకార్యములే. రసపరిపంథిను లన్ని ప్రహేళికలు కావు. అప్రస్తుత ప్రశంస, సమాసోక్తి, వ్యాజోక్తి, ఛేకోక్తి, వ్యాజనింద, వ్యాజస్తుతి మున్నగునవి అలంకారములు కావు - ఇందు వస్తువు స్ఫురించును కావున అలంకార్య- మనక తప్పదు. సాహిత్యమున స్వతంత్ర మార్గము నవలంబించి నూతనోన్మేష మాపాదించిన ఆచార్య కుంతకుని

వక్రోక్తి జీవితమును పరామర్శించిన పై విషయము స్పష్టమగును.

ప్రహేళికవలన కేవలం చమత్కారోదయమేకాక పలు ప్రయోజనములు చేకూరును. ఆయా శాస్త్ర విషయ పరిజ్ఞాను లోకజ్ఞానము చేకూరుటయేకాక చక్కని ఆలోచనాశక్తియు పెంపొందును. మనోవైజ్ఞానికులు సమాజ ద్రోహకర ములైన యుయుత్సాకామనాది చిత్తవృత్తుల నుదాత్తీకరించుటకై క్రీడాదులుపకరించునని పేర్కొందురు. విద్యార్థులకు క్రీడాదులవలన శరీరపుష్టి-అనుశాసనము- ఉదాత్తభావనాదులు నిజముగా లభించునేని ప్రహేళికలవలన మనఃపరిణతి ఆలోచనాశక్తి జిజ్ఞాసధారణ సమన్వయశక్తి మున్నగు ప్రయోజనములు సంభవించును. అందువలన క్రీడాప్రాయములని మనప్రాచీనులు పేర్కొనిరి- ఆస్థానములలో, సభలలో, గోష్ఠీకార్యక్రమములలో ప్రహసనములలో ప్రహేళికకా రూపమున పరీక్ష కుపయోగించు ప్రశ్నలు గంభీరముగా నుండెడివి- పరీక్షకుల ప్రశ్న లర్థము చేసికొని తగు నుత్తరము నిచ్చెడివారు, ప్రశ్నలు పలురకములుగా నుండుటవలననే ప్రహేళిక సంఖ్య పెరిగినది- 'ప్రహేళియతి అభిప్రాయం సూచయతీతి ప్రహేళికా - అని గురుబాల ప్రభోధికాకారుడు వ్యుత్పత్తి నిచ్చెను. ప్రవల్లికను పర్యాయపదముగా అమరసింహు డిచ్చెను- భరతకోశమున- ప్రవల్లిః, ప్రవల్లీ, ప్రవల్లికా ప్రహేలిః ప్రహేలికా' అని ఐదు పర్యాయపదము లొసగబడినవి-'ప్రవల్లికా ప్రశ్నదూతీ'యని శబ్దరత్నావలీ కారుడు, 'ప్రహిలతి అభిప్రాయం సూచయతీతి ప్రహేలికా' యని శబ్దకల్పద్రుమకారుడును నుడివిరి- 64 కళలలో ప్రహేళిక పేర్కొనబడినది-(సాహిత్యదర్పణవాఖ్యానము 3 వ పరిచ్ఛేదము 111 పుటలలో చతుష్షష్టికళ లుట్టంకింపబడినవి-)"కదాచి ద్దక్షరచ్యు తక మాత్రాచ్యుతక బిందుమతీ గూఢ చతుర్థపాద ప్రహేళికా ప్రదానాదిభిః "అని బాణభట్టు కాదంబరిలో పేర్కొనెను- పలువు రాలంకారికులును ప్రహేళికల నుట్టంకించిరి.త

వ్యక్తీకృత్య కమప్యర్థం స్వరూపార్థస్య గోపనాత్

యత్ర బాహ్యాంభ్యంతరా వర్థా కథ్యేతే సా ప్రహేళికా-

అని ప్రాచీనలక్షణము, దీనిని పలువురు వ్యాఖ్యాతలు పేర్కొనుటవలన ఇది ఎవరి నిర్వచనమో స్పష్టముగా తెలియదు-"ప్రహేళికా సా స్యాత్ వచస్సం వృతికారి యత్" అను మరి యొక లక్షణము సాహిత్యదర్పణవ్యాఖ్యాత ఆచార్య కృష్ణమోహనశర్మ, కావ్యాదర్శ వ్యాఖ్యాత విద్యాభూషణ శ్రీ రంగాచార్య శాస్త్రియు పేర్కొనిరి- ఈ లక్షణ మెవరిదో స్పష్టముగా తెలియదు- భావాదినిగూఢతకలది ప్రహేళికయని పై లక్షణముం సారము- ఆచార్యదండియు ఇట్లు పేర్కొనెనుః-

క్రీడాగోష్ఠీ వినోదేషు తజ్ జ్ఞైరాకీర్ణమంత్రణే
పరవ్యామోహనే చాపి సోపయోగాః ప్రహేళికాః

"క్రీడార్థం యా గోష్ఠీసభా, తత్ర యే వినోదాః విచిత్ర వాగ్వ్యవహారైః ప్రమోదాః తేషు, తథాతజ్ జ్ఞైః ప్రహేళికాభిజ్ఞైః ఆకీర్ణే వ్యాప్త సమాజే యన్మంత్రణం గుప్త భాషణం తస్మిన్ తథా పరస్య బోద్ధవ్యపురుషభిన్నస్య వ్యామోహనే అభిప్రేతార్థానవగమనేచ, ప్రహేళికాః సోపయోగాః ఉపయుక్తా స్సంతీతి భావః- యద్యపి శబ్దాలంకారాది రూపణేయం నకావ్యోపయుక్తా తథాపి విదుషాం క్రీడా గోష్ఠీవినోదాదిషు ఉపయుక్తేతి భావః అని వ్యాఖ్యాత విద్యాభూషణ శ్రీ రంగాచార్య శాస్త్రి వివరించెను- (కావ్యాదర్శనము 362 పుట, భండార్కార్ పరిశోధన) ప్రహేళికలన నేమో నాటికాలమున బాగుగా తెలిసి యుండుటవలన లక్షణము జెప్పక వాని యుపయోగము మాత్రమే దండి తెలిపెను- క్రీడాప్రాయములైన వినోద గోష్ఠులలో సమాజమునందు గుప్తముగా సంభాషించుటలలో తెల్పదగిన వ్యక్తికి తప్ప మిగత వ్యక్తులకకు భోధపడనట్లు మాటలాడుటలో వీని యుపయోగముండునని దండి యుట్టంకించుట వలన ప్రహేళికా స్వరూపస్వభావోద్దేశ్యములు ఎట్టివో మనకు వ్యక్త మగును- దండి సూక్తినే సాహిత్యదర్పణవ్యాఖ్యాత్రాదులు ప్రహేళికా సందర్భమున నుట్టంకించిరి- దండి ప్రహేళికల యొక్క ఉపయోగమును తెల్పి 16

భేధముల జూపెను -సమాగత , వంచిత , ప్రముషిత, పరుష, ప్రకల్పిత. నిభృత సమ్మూఢ, పరిహరిక , సమానశబ్ద , నామాంతరిత , ఏకచ్ఛన్న, ఉభయచ్ఛన్న , సంకీర్ణ , వ్యుత్క్రాంత సమానరూప అను ప్రహేళికలు ఇవి అప్పటికే అధిక ప్రచారము నందినవి- కావున అతడు 16ను మాత్రమే పేర్కొనెను - విశ్వనాథుడు చ్యుతదత్తాక్షరాదిక యని ఆదిపదమును చేర్చెను కాని సంఖ్యను చెప్పలేదు- ఆచార్య హేమచంద్రుడును ఇదే విధ మొనరించెను - సాహిత్య దర్పణ కావ్యాను శాసన వ్యాఖ్యాతలు భోజుని సరస్వతీకంఠాభరణమునుండి ఉదాహరించిరి. విదగ్ధముఖ మండన కర్త కవీంద్ర కంఠాభరణ కర్తయు ప్రహేళికకు రెండు విధముల మాత్రమే విభజించిరి- వీనినిబట్టిచూచినచో క్రమేణప్రహేళికవిట్లు హ్రాసము జెందెనో తేలును.

ఏతా షోడశ నిర్దిష్టా పూర్వాచార్యైః ప్రహేళికాః
దుష్టప్రహేళికా శ్చాన్యా స్తై రధీతా శ్చతుర్దశ
దోషా నపరింసంఖ్యేయాన్ మన్యమానా వయం పునః
సాధ్వీ రేవాభిధాస్యామః తాదుష్టాయా స్త్వలక్షణాః

(కావ్యాదర్శనము 365 పేజి

అని దండ్యాచార్యుడు ప్రాచీనులు పేర్కొనిన 14 ప్రహేళికలు దుష్టములని విసర్జించి సలక్షణములైన 16 ప్రహేళికలను మాత్రము నిరూపించి ఉదాహరించెను. భట్టలోల్లటుడు ప్రహేళికలను సాక్షాత్తుగా పేర్కొనక పోయినను తజ్జాతీయములైన యమకానులోమ చక్రాది చిత్రములనేకాక నగరార్ణవవర్ణనాభినివేశము కూడ ఇట్లుతగదనెను.

యస్తు సరిదద్రిసాగరనగతురగపురాదివర్ణనే యత్నః
కవిశక్తిఖ్యాతిఫలో వితతధియాంనో మతః ప్రబంధేషు
యమకానులోమతదితరచక్రాదిభిదోఽతిరసవిరోధిన్యః
అభిమానమాత్ర మేతత్ గడ్డరికాదిప్రవాహోవా

'అపృథగ్యత్న నిర్వర్త్యస్సోలంకారః ప్రకీర్త్యతే' ఇత్యాది కారికారూపమున అప్రయత్న సిద్ధమైన అలంకారమే రసోపస్కారకమగును. యమకాదులు పృథగ్యత్న నివర్త్యములు కావున ధ్వని కుపకరింపవు. అందువలన యమకాదులు నిబంధింపరాదని ఆనందవర్ధనుడు పేర్కొనెను– మరియు ఆనందవర్ధనుడుగాని లోచన కర్తగాని ప్రహేళికను నామతః ఐనను స్పృశింపలేదు.

ప్రహేళికా సకృత్ప్రశ్నః సాపి షోఢా చ్యుతాక్షరా
దత్తాక్షరోభయం ముష్టిః బిందుమత్యర్థవత్యపి–

(సరస్వతీకంఠాభరణము 299 పుట

చ్యుతాక్షర ,దత్తాక్షర ,చ్యుతదత్తాక్షర , ముష్టిక ,బిందుమతి ,అర్థవతి యని ప్రహేళిక లారు విధములని భోజరాజు పేర్కొనెను – మరియు నారు విధములైన క్రియాకారకాది గూఢములను వేరుపరచెను.

క్రియాగూఢము కారకగూఢము సంబంధగూఢము పాదగూఢము అభిప్రాయగూఢము వస్తుగూఢము అని గూఢము నారు విధముల విభజించి వానిని ప్రహేళికలకు పృథగ్భూతముగా పరిగణించెను– భోజరాజు వస్తుగూఢమున ఉదాహరించిన "పానీయం పాతుమిచ్ఛామి" యను శ్లోకమును గురుబాల ప్రభోధికాకర్త ఆర్థీప్రహేళికాపరముగా నుదాహరించెను. దీనివలన గూఢములు చిత్రములు ప్రహేళికాంతర్భూతములని తేలును. అంతఃప్రశ్న, బహిఃప్రశ్న, బహిరంతః ప్రశ్న, జాతి ప్రశ్న, పృష్టప్రశ్న, ఉత్తరప్రశ్నయని ప్రశ్నోత్తరమును ఆరు విధముల విభజించి భోజరాజు ఉదాహరించెను. దండి షడ్విధగూఢము–నుగాని షడ్విధ ప్రశ్నోత్తరమునుగాని పేర్కొనలేదు.

రసస్యపరిపంథిత్వాత్ నాలంకారః ప్రహేళికా
ఉక్తివై చిత్ర్యమాత్రం సా చ్యుతదత్తాక్షరాదికా–

'ఆది శబ్దాత్ క్రియాకారక గుప్తాదయః (సాహిత్యదర్పణము శ్రీ రామచరణ తర్కవాగీశ భట్టాచార్య టీకాసమేతము 471పుట) రసవిరోధిని

మగుటవలన ప్రహేళిక అలంకారముకాదు, ఉక్తివైచిత్ర్య మాత్రము ప్రహేళిక యనబడును, ఇది చ్యుతదత్తాక్షరాది రూపమున నుండును. ఆది పదమువలన క్రియాకారకాదులను గ్రహింపవలయునని క్రియాకారకాదిగూఢములను ప్రహేళికలలో విశ్వనాథుడు చేర్చెను,సాహిత్యదర్పణ వ్యాఖ్యాతలెల్లరు భోజరాజును ప్రామాణికునిగా తీసికొనిరి. వారి వ్యాఖ్యానములలో ప్రహేళికావిషయమున ప్రత్యేకత లేదు. 'స్వరవ్యంజన స్థానగత్యాకార నియమచ్యుత గూఢాది చిత్రం' గూఢాదిత్యాదిపదేన ప్రశ్నోత్తర ప్రహేళికా దుర్వాచకాది పరిగ్రహః (కావ్యానుశాసనము 257 272 పుట నిర్ణయసాగర ప్రకాశితము) ఏకద్వ్యాది స్వరచిత్రము, ఏకద్వ్యాది వ్యంజన చిత్రము, ఏకద్వ్యాది స్థానచిత్రము, గతిచిత్రము, ఆకారనియమ చిత్రము మాత్రాదిచ్యుత చిత్రము, క్రియాదిగూఢము, ప్రశ్నోత్తరము, ప్రహేళిక, దుర్వాచకము మున్నగునవి గ్రహింపవలయునని ఆచార్య హేమచంద్రుడు నుడివెను.

ప్రాహుర్వ్యస్తం సమస్తంచ ద్విర్వ్యస్తం ద్విస్సమస్తకం
తథా వ్యస్త సమస్తంచ ద్విర్వ్యస్తక సమస్తకం
సద్విస్సమస్తక వ్యస్తమేకాలాపం ప్రభిన్నకం
భేద్యభేదక మోజస్వి సాలంకారం సకౌతుకం
ప్రశ్నోత్తర సమం పృష్టప్రశ్నం భగ్నోత్తరం తథా
ఆదిమధ్యోత్తరాఖ్యే ద్వే అంత్యోత్తర మతఃపరం
కథితాపహ్నుతిం చైవ విషయం వృత్తనామకం
నామాఖ్యాతంచ తార్క్యంచ సౌత్రం శాబ్దీయశాస్త్రజే
వర్ణవాక్యోత్తరే తావత్ శ్లోకోత్తర మతః పరం
ఖండపాదోత్తరే చక్రం పద్మం కారకపదం తథా
గోమూత్రం సర్వతోభద్రం గతప్రత్యాగతంబహు
వర్ధమానాక్షరం తద్వత్ హీయమానాక్షరం తథా
శృంఖలాం నాగపాశంచ చిత్రం సంఖుద్ధమేవచ

ప్రహేలికాం తథా హృద్యం కాలసారాది వర్ణితం
ఆజమూరాదికం గూఢం పదపాదార్ధగూఢకం
స్తుతినిందాం తథాహృద్యం సహోపహ్నుతి బిందుమత్
క్రియాకారక సంబంధగుప్తా న్యామంత్రితస్య చ
గుప్తం తథాసమాసస్య లింగస్య వచనస్యచ
మాత్రాబిందువిసర్గాణాం చ్యుతకా న్యక్షరస్యచ
స్థానవ్యంజనయో శ్చాపి చ్యుత్తాదతాంత్యక్షరం తథా

అని విదగ్ధముఖమండనకర్త ధర్మదాససూరి పైవానిని పేర్కొని ప్రహేళికను వానిలో జేర్చెను - కవీంద్రకర్ణాభరణకర్త విశ్వేశ్వర పండితుడును పై వానిని జాతులనెను - అతని మతమున జాతులు 58 - వీరిరువురును ప్రహేళికను రెండు విధముల మాత్రమే విభజించిరి. ఈ జాతులకన్నింటికి లక్షణోదాహరణములను సాకల్యముగా నొసగిరి. (ఈరెండు పుస్తకములు నిర్ణయసాగర ప్రెస్ వారు ముద్రించిరి) సుభాషితరత్నభాండాగారకర్త సమస్యలు, కూటములు, ప్రహేళికలు,అంతరాలాపములు,బహి రాలాపములు, భాషాచిత్రములను వానిని చిత్రప్రకరణమున జేర్చెను-వీనిలో కొన్నిటిని చాటుధారాచమత్కారసారమును పేర అల్లమరాజు సుబ్రహ్మణ్యకవి సంస్కృత టీకా సహితముగా ప్రకటించెను.(రాజమండ్రి 1931 సం||) ఈవిధముగా ప్రాచీన గ్రంథములను పరిశీలింతుమేని తత్తత్కర్తలకు ప్రహేళికాది విషయమున అభిప్రాయభేధము లున్నట్లు కనుపించును. చతుష్షష్టికళలలో ప్రహేళికా పదము మాత్రముండుటవలన ప్రశ్నోత్తరాది వివిధ జాతులయందును ప్రహేళికాఛ్ఛాయ యుండుటవలన ఇవి యన్నియు ప్రహేళికా జాతీయములని ఊహించుట కవకాశము కలుగును.

భావ గూఢతాదులవలన చమత్కార మాపాదించుటయే ప్రహేళిక యొక్క లక్షణము. బహిర్లాపిక అంతర్లాపిక వర్ణవ్యంజనాది చిత్రము కర్తృక్రియాదిగోపనము కాలాతిసారము నిందాస్తుతులు అపహ్నుతి మున్నగునవి ప్రహేళిక యందంతర్భవించును- ప్రహేళికా ముక్తావళియను గ్రంథమున

నిదే విషయము చెప్పబడినది- మా తాతగారు వ్రాసిన వ్రాత ప్రతులలో ప్రహేళికా ముక్తావళి పేరు పలుచోట్ల నుట్టంకింపబడినది- ఇది ఎవరు వ్రాసినదో ఎక్కడ అచ్చైనదో తెలియదు. విడివిడిగానున్న ప్రహేళికలొకచో జేర్చి లేఖకుడే ఈ పేరు పెట్టెనో కాలగర్భమున కలిసి పోయినదో స్పష్టముగా తెలియదు. మాతాతగారు ప్రహేళికా ముక్తావళిలోనివని వ్రాసినవానిని బట్టి చూచినచో దాదాపు 70,80 భేధము లగుపడును, మరియు యమకాది చిత్రకవిత్వమంతయు ప్రహేళికలో యంతర్భవించును, ప్రహేళికా ముక్తావళియేగాక కవిగజాంకుశము, కవి మత్తేభ కంఠీరము, కవిజిహ్వాబంధనము నక్షత్రమాల విదగ్ధముఖమండనము కవీంద్రకర్ణాభరణము మున్నగువాని నామములు నిర్దేశింపబడినవి-ఇందు విదగ్ధముఖమండనము కవీంద్రకర్ణాభరణము నక్షత్రమాల యనునవి నిర్ణయసాగర ప్రెస్వారు ముద్రించిరి. మిగిలినవి అముద్రితములు- పలువురు పండితుల ఎదుట పై వాని విషయము ముచ్చటించియుంటిని, పలువురును వాని పేరే మాకు వినబడలేదని చెప్పిరి, అవి లభింపకపోవుట సంస్కృత లోక దౌర్భాగ్యమనక తప్పదు, మా మాతామహులు నిగమాగమాది విద్యావిశారద శ్రీ కందాళ లక్ష్మణచార్యులుగారు సేకంచినవి దాదాపు మూడు నాలుగు వేలందురు. చెదలు పట్టుటవలననేమి చాలవరకు పోయినవి. మాబావగారు ఉభయ వేదాంత విశారద శ్రీ కాండూరు వేంకటాచార్యులగారు నష్టభ్రష్ట శేషములను వేరేకాగితములపైన వ్రాసి భద్రపరచినారు- అవియే క్రమశః ప్రకటించ బూనితిని. మన ప్రాచీనుల వద్ద ఇట్లు వ్రాసికొనిన శ్లోకములు చాల లభించును. మొత్తము ప్రహేళికలు ఒక లక్షయున్నవందురు. వీనిని కూర్చి భద్రపరచవలసియున్నది. మన యశ్రద్ధవలన అనవధానతవలనను ఇదివరకే అమూల్య గ్రంధములు చాలవరకు ఖిలములై పోయినవి.-అకాడమీలు, విశ్వవిద్యాలయములు మున్నగు సంస్థలు శ్రద్ధ తీసికొని కనీసము వ్రాత ప్రతులనైన సేకరించి భద్రపరచవలసియున్నది- ఒక సంస్కృతముననే లక్ష ప్రహేళిక లున్నప్పుడు ప్రాంతీయ భాషలలో నెన్నియుండునో! ఆయా ప్రాంతీయులు సంస్కృతముతో పాటు తమతమ

ప్రాంతీయ భాషా ప్రహేళికలను ప్రకటించ బూనుకోనవలెను. ప్రహేళికలవలన చాల విషయములు భోధపడును.

సంస్కృతమున ప్రహేళికలు ఒక లక్షవరకు కలవు. నావద్ద భద్రపరచబడిన ప్రహేళికలు దాదాపు రెండు వేలవరకుండును. క్రమేణ ప్రకటించబడును. ప్రస్తుతము సంస్కృతమునుండి కొన్ని,ఇతర భాషలనుండి కొన్ని మచ్చున కుదాహరించి విరమింతును.

ఇందుకొన్ని మాత్రము నిర్దేశింతును. తరువాతి భాగములలోనివి వివరింపబడును. కావున ఇందు వివరణ చేయలేదు.

## ద్వివ్యంజనము:—

భూరిభి ర్భారిభి ర్భీరా భూభారై రభిరేభిరే
భేరీరేభిభి రభ్రాభైరభీరుభి రిభారిభా:

## క్రమస్థసర్వవ్యంజనము:—

క:ఖగౌఘాజచిచ్ఛౌజాఝూఞ్ జ్ఞోటౌఠీడడంఢణా:
తథోదధీన్ పఫర్బాభీర్మయోరిల్వాశిషాంసహ:

## చతుర్వ్యంజనము:—

జజౌజోజాజిజిజ్జాజీతంతతోతితతాతితుత్
భాభోభిభాభిభూభాభూరారారిరరిరీరర:

## ఏకస్థానీయము:—

అగాగాఙ్గాఙ్గకాకాఙ్గగాహకాఘకకాకహా
అహాహాఙ్గ ఖగాఙ్గాగగకఙ్గాగ ఖగాఙ్గగ

షడ్జాదిస్వరవ్యంజనము:-

సామమారిధమనీనిధానినీసామధామధనిధామసాధినీ
మానినీసగరిమాపపాపపాసాపగాసమసమాగమాసమా

షడ్జాదిమృదంగస్వరవ్యంజనము:-

శ్రీ కృష్ణభూపకీర్త్యవసరగిరిగరిసరిసమేతివీణేయమ్
బ్రూతేతత్తాత హితాధికతాకథితేతిమురజోను
ఇవి ఇతరభాషాప్రహేళికలు-ప్రశ్నోత్తర రూపములు

షద్భాషభ్రంశము:-

రసిఅహకేణ ఉచ్ఛాడణకిజ్జఇజుయఇహామాణ సుకేణ ఉవిజ్జఇ
తిసియలో ఉఖణికేణసుహి జ్జఇఎహపహ్హామహభువణేవిజ్జఇ

షద్ప్రాకృతము :-

కోనివసఇసచ్ఛందంసుందరగిరిగహణకుంజమబ్బమ్మి
సహఅజ్జుణేణజోణ్హంశిహి గమణోకేరిసోహ్హాఇ

షద్మాగధికమ్ :-

ధవలుజ్జలే హింకే హింసోఇధరణీమసాణదేనస్స
నరయస్సరఇచ్ఛాఇంనాక హింసమ్పతినిహితకకతాఇపి

షద్పైశాచికము:-

పత్తూనకింపటుచనోనిచతేహతానాఅత్థాసనంపచతిచంపనిసూతనస్స
భోత్తూనఖోరతరత్తుక్ఖసతాఇపావా,మోహాంధకారగహనంలపకింలపంతి

తెలుగు:-కరయుగంబు గలదు చరణంబులా లేవు
కడుపు వీపు నడుము మెడయుగలవు

శిరము లేదుగాని నరులబట్టుక మ్రింగి
సుఖము గూర్చు దీని సొగసు గనుడి (చొక్కా)

ఉర్దూ:- జబ్ మాంగూ తబ్ జల్ భర్ లావే
మేరేమన్‌కీ తపన్ బుఝావే
మన్‌కా భారీ తన్‌కా ఛోటా
ఏ సఖి సాజన్ నానా లోటా

(అమర్ ఖుస్రో)-రాగిబినత్తి నిద్రామ్ వంటిది.)

పార్శీ:- దురేఅబలక్‌కసే కమ్‌దీద్ మౌజూద్
వజూజ్ అశకే బతానే సుర్మా అలూద్

(సంస్కృతానువాదము)

మౌక్తికాని శబలాని కేనచిత్ వీక్షితాని రుచిరే క్వచిద్వద
నాంతరేణ నయనాంజనస్పృశం బాష్పబిందునివహం మృగీదృశః

తన కూతురు జేబున్నిసా నిరంతర సాహిత్య పఠనాసక్తిని మాన్పవలయునని ఔరంగజేబ్ విచారగ్రస్తుడై సభాసదులను ఎట్లో ఒకట్లు ఆమె సాహిత్యాభినివేశమును మాన్పవలయునని కోరెను. అప్పుడు కొందరు మహరాజా! చింతింపకుము-క్లిష్ట సమస్యను ఆమె పూరించునేని ఆమెను నిరోధింపరాదు- పూరింపకున్నచో సాహిత్యసేవ మానవలయునని అభిసంధి నేర్పరతుమని సభాసదులుపాయము చెప్ప నాతడు కూతురిని "దురే లబలక్ కసే కమ్‌దీద్ మౌజూద్ " అని ప్రశ్నించెను. నల్లని ముత్తియములు ఎవడేని ఎచటనైన చూచియుండెనా! అని దీని భావము. అప్పుడామె తండ్రి యెత్తుగడ నూహించి కాటుకకంటి నీరొలుక 'వజూజ్ అశకే బతానే సుర్మా ఆలూద్ 'అని సమాధాన మొసగెను కజ్జల కలుషితములైన యువతి కన్నీటి బిందువులు తప్ప నితరము చూడలేదని తాత్పర్యము.

ఈవిధముగా గూఢార్థకములు చమత్కారావహములైన ప్రహేళికలు ప్రతి భాషలో మనకు లభించును.

సంస్కృతాంధ్ర భాషోత్తరము - రెండు భాషలయందొకపదమే

ఉత్తర వాచకమగును.

కిం వక్తి భిత్తినిర్మాతా చాఞ్చల్యం కుతో వర్తతే
ఆంధ్రగీర్వాణభాషాభ్యా మేకమేవోత్తరంవద ।

(పారదే)

రావణస్య కియ ద్వక్త్రం నూపురః కుత్ర వర్తతే
ఆంధ్రగీర్వాణభాషాభ్యా మేకమేవోత్తరం వద (పది)

మణిప్రవాళము:-

తండులాని గృహమందు నసంతి తిండికైతె బహుమంది వస
కుండలెల్ల పరితోపి లుఠంతి ముండనాకొడుకులెల్ల రుదంతి
హరనయనహుతాశజ్వాలయా జో జలాయా
రతినయనజలౌఘే ఖాక బాకీ భుహోయా
తదపి దహతి చిత్తం మాక క్యా మై కరూంగీ
మదనసరసి భూయః క్యా బలా ఆగ్ లాగీ-
నయాచే రిపారం నవా స్టీలు క్షేముం
న కౌన్సిల్ నతు ప్రీవి కౌన్సిల్ పదం వా
స్వరాజ్యహంతాంగ్లరాజ్యే నియంతా
ఫరంగీ ఫిరంగీ శృగంగీ కరోతు-

కేవల హాస్య ప్రహేళికలు:-

చితాం ప్రజ్వలితాం దృష్ట్వా వైద్యో విస్మయ మాగతః
నాఽహం గతో న మే భ్రాతా కస్యేదం హస్తలాఘువమ్.
కమలే కమలా శేతే హర శ్శేతే హిమాలయే
క్షీరాబ్ధౌచ హరి శ్శేతే మన్యే మత్కుణశంకయా
సదా వక్ర స్సదాకౄ్రరః సదాపూజా మపేక్షతే

కన్యారాశిస్థితో నిత్యం జామాతా దశమో గ్రహః
అపాండురా శ్శిరసిజా స్త్రివలీ కపోలే
దంతావలీ విగలితా నచ మే విషాదః
ఏణీదృశో యువతయః పథి మాం విలోక్య
తాతేతి భాషణపరాః ఖలు వజ్రపాతః
ఏకా భార్యా ప్రకృతిముఖరా చంచలాచ ద్వితీయా
పుత్ర స్త్వేకో భువనవిజయీ మన్మథో దుర్నివారః
శేషశ్శయ్యా శయన ముదధౌ వాహనం పన్నగారిః
స్మారంస్మారం స్వగృహచరితం దారు భూతో మురారిః
అత్తుం వాంఛతి వాహనం గణపతే రాఖుం క్షుధార్తః ఫణీ
తంచ క్రౌంచపతేః శిఖీచ గిరిజాసింహోఽపి నాగాననమ్
గౌరీ జహ్నుసుతా మసూయతి కలానాథంచ ఫాలానలో
నిర్విణ్ణ స్స పపౌ కుటుంబకలహో దీశోపి హాలాహలమ్.
పౌరాణికానాం వ్యభిచార దోషో నాశంకనీయః కృతిభిః కదాచిత్
పురాణకర్తా వ్యభిచారజాతః తస్యాపి పుత్రో వ్యభిచారజాతః.
రామా ద్యాచయ మేదినీం ధనపతే ర్బీజం బలాల్లాంగలం
ప్రేతేశాన్మహిషం తవాస్తి వృషభః ఫాలం త్రిశూలం తవ
శక్తాఽహం తవ చాన్న పానకరణే స్కందోఽస్తి గోరక్షణే
ఖిన్నాఽ హంహర భిక్షయా కురు కృషిం గౌరీవచః పాతు వః.

అశ్లీల ప్రహేళిక :-

విష్ణోశ్చా గమనం నిశమ్య సహసా కృత్వా ఫణీంద్రం గుణం
కౌపీనం పరిధాయ చర్మ కరిణ శ్శంభౌ పురోధావతి
దృష్ట్వా విష్ణురథం సకంపహృదయ స్సర్పోఽపద తద్భూతలే
కృత్తి ర్విస్ఖలితా హి్రియా నతముఖో నగ్నోహరః పాతు వః

మాత స్తాతజటాసు కిం! సురసరిత్ , కిం శేఖరే! చంద్రమాః
కిం భాలే! హుతభుక్, ఉరత్యురసి కిం! నాగాధిపః , కిం కటౌ!
కృత్తిః కిం జఘనద్వయాంతరగతమ్ య ద్దీర్ఘ మాలంబతే!
పృష్ట్వా పుత్ర వచోఽంబికా స్మితముఖీ లజ్జావతీ పాతు వః

శృణు సఖి కౌతుక మేకం గ్రామ్యేణ కుకామినా యదద్య కృతమ్
సురతసుఖమీలితాక్షీ మృతేతి భీతేన ముక్తాఽస్మి.

జగ్ధ్వా మాషమయాన్ అపూపవటకాన్ ఆధ్మాయమానోదరే
ఫట్ ఫట్ స్ఫాడితి పాయవీయపవనం యోగీశ్వరే ముంచతి
ఉడ్డీనం విహగై ర్మఠై ర్విఘటితం దోలాయితం భిత్తిభిః
శిష్యై ర్ధావిత మర్భకై ర్నిపతితం కోలాహలోఽభూన్మఠే

గుప్తముగా పరరాజుల విషయము తమ రాజాదులకు తెలియపరచనాటి సైనికులు. గూఢచారులు ప్రహేళిక నెట్లునుయోగించిరో ఈ ఉదాహరణము వలన మనకు స్పుటమగును.

హరిద్రాయాం రాహుప్రసరపిహితేచ్ఛాపరిషది
ప్రయుక్తాలంకృత్యై వియుత గరుతాం దుర్గకురటీం
వయం సార్కా పేతాః ప్రహర ఇతి సేనాధిపకృతాం
అమాత్యేభ్యో లేఖాం ప్రతిదిశతి సింహక్షితిపతిః

మేమిచటి సేనానాయకుని వశంవదుని చేసికొనినాము- కావున చీకటి బాగుగా నలముకొనిన పిదప దుర్గపట్టణమునప్రవేశించి, శత్రువులను చీల్చవలసినదని తన సేనానాయకు డంపిన నిగూఢ లేఖార్థము,నమాత్యులకు సింహదేశపు రాజు విశదీకరించెను. హరిద్రా, రాహు, ఇచ్ఛా, పరిషత్ ప్రయుక్తాలంకృతి, వియుతగరుత్ దుర్గకురటీ, సార్కా పదముల్వలన క్రమముగా రాత్రి చీకటి ,దిక్కులు, గుంపు, ప్రహారము, విపక్షములు,

దుర్గపురము, నాయక సమేతులను అర్థము స్ఫురించును.

**ఈశ్లోకములు శాస్త్ర విషయకములు:-**

జాయంతే నవ సా తథామిచ నవ భ్యాంభిర్వ్యసాం సంగమే
షట్సంఖ్యాని ష డేవ సువ్యథ శసి త్రీణ్యేవ తద్వ్యజ్ఞసి
చత్వా ర్యన్యవచస్సు యస్య విబుధా శ్శబ్దస్య రూపాణి తత్
జానంతే యది శక్తి రస్తి గదితుం షాణ్మాసికోఽత్రావధిః.
ఉదితవతి పరస్మిన్ ప్రత్యయే శాస్త్రయోనౌ
గతవతి విలయంచ ప్రాకృతేఽత్రిప్రపంచే
సపది పద ముదీతం కేవలః ప్రత్యయోయ
స్తదియ దితిచ వక్తుం కః క్షమః పండితోఽపి
త్వా ముర్వీవరవర్య కావ్య కరణే సేనాగణే భాషణే
తాణే వ్యాకరణే రణే వితరణే విశ్వంభరాధారణే
సత్యం సత్యవతీభయే శరభరయే వాణీశయే విష్ణయే
దాక్షీకుక్షిభయే పృథోదరభయే కల్పద్రయే మేరయే

**అధిక్షేప ప్రహేళికః-**

సంస్థలలో, నాస్థానములలో యోగ్యతను పరిగణింప కేవలం పక్షపాతమున అనర్హులకు అధికృత పదాది ప్రాతినిధ్యము కల్పించెడివారి దురధికారమదమును ఈసడించుచు గాడిద నెపమున నొకకవి వ్రాసిన రాసభ శతకము నుండి ఈశ్లోకము గై కొనబడినది- మాతాతగారు సేకరించిన ప్రహేళికలలోనిది రాసభ శతకమునుండి గ్రహింపబడినదని యున్నది- కవి నామము నిర్దేశింపబడలేదు-దీని కొరకు ఎంతయో ప్రయత్నించిన కాని లభింపలేదు. లభింపనంతవరకు కాలగర్భమున కలిసినవానిలో లెక్కింపవలసినదేః

రేరే రాసభ! వస్త్ర భారవహనాత్ కుగ్రామ మశ్నాసి కిం!

రాజాశ్వావసథం ప్రయాహి చణకాభ్యూషాన్ సుఖం భక్షయ
సర్వాన్ పృచ్ఛవతో హయా ఇతి వదం త్యత్రాధికారే స్థితాః
రాజాత్తై రుపదిష్టమేవ మనుతే సత్యం తటస్థావరే

ఓ గార్దభమా! బట్టల మూటమోయుచు ఈ చెడు యూరిలోనేల బాధననుభవింతువు! రాజు గారి గుర్రపుశాల కేగుము-అచట కావలసినన్ని శనగగుగ్గిళ్లు పెట్టుదురు-వానిని హాయిగా తినుము-ఎవరైన గుర్తుపట్టుదురేమో యని శంకింపవద్దు.తోకయున్న వన్నియు గుర్రము లేయని ఆచటి యధికారులు స్థిరపరతురు. రాజుగారును వారుపదేశించిన దాని నంగీకరింతురు.ఇక మిగిలినవారు తెలిసియు నూరకుందురని దీని భావము.

శ్లిష్ట ప్రహేళికలుః-

రామస్య భగినీ సీతా తస్య పత్నీ సపత్నజా
పార్వతీపతిగోవిందః కాలస్య కుటిలా గతిః
సూకరఃకంకణం ధత్తే కంకణే రమణిస్థితః
తత్రాపి తరవ శ్చిత్రం కిం దీర్ఘసురతై ర్వినా

స్తుతినిందా ప్రహేళికః-

బహుదోషో గుణధ్వంసీ గోహంతా జనపీడకః
కరోతు విరథో లోక మస్త మాప్త మహోదయమ్

విలోమ ప్రహేళికః-

అనులోమముగా రామ పరము, విలోమముగా కృష్ణపరము స్ఫురించును.

కిం ను తోయరసా పంపా న సేవా నియతేన వై
సన తాతాపహా తేనే స్వం శేనావిహితాగసమ్

ఇటు వంటివే పెక్కు పద్యములు కలవు-మరియు ఛాయావాద, రహస్యవాదాది ప్రతీకవాదములు సైతము ప్రహేళికోచ్ఛిష్టములే! గ్రంథ విస్తరభయమున నిట నుదాహరింపకున్నాను. ఇట్టి చమత్కారావహములైన ప్రహేళిలను పాఠకలోకమున కందించవలయునను తలంపు చాలరోజులనుండి కలుగుచున్నది. కాని ప్రకాశించుటకు తగిన ఆర్థిక పరిస్థితి ప్రత్యూహమై నిలిచినది. ఈవిషయమున నన్నెంతయో ప్రోత్సాహపరిచిన మిత్రులకు , ప్రకాశకులకు ధన్యవాదములు.

ఓరుగల్లు — ఇట్లు

కీలక కార్తీక పూర్ణిమ — శ్రీ భాష్యం విజయసారథి

Nov. 1968

# నివేదన

సంస్కృత భాషా సౌందర్యమును తెలుగు వారికి ఇతోఽధికముగా తెలియ జేయుటకు ప్రహేళికలను సంకలనము జేసి 1968 సం॥ లో అంతర్లాపికలు పూర్వ భాగరూపమున, 1969 సం॥లో (బహిర్లాపికలు) ఉత్తర భాగరూపమున సంస్కృత భారతీ పక్షమున ప్రచురించుట జరిగినది. ప్రహేళికలు ప్రాచీనకాలమున సభాగోష్ఠీవినోదములలో ఉల్లాసమునకు ఉపయోగింపబడు చమత్కారహమైనరచనలు. వానిని ఆస్వాదించిన సాహిత్యరసికులనుండి వచ్చిన లేఖలను జూచి వారి అభిలాషమేరకుయీ రెండు గ్రంథములు కలిపి ఒకే గ్రంథముగా ముద్రించడం జరిగినది.

వీనిని సేకరించి క్రమముగా నిబంధించి, వ్యాఖ్యానము విపుల పీఠిక రచించిన గౌరవనీయులు 'మహాకవి' శ్రీ శ్రీ భాష్యం విజయసారథి గారికి మేము కృతజ్ఞులము.

రెండు సంపుటములు కలిపి ఏక రూపంగా ప్రకాశితమైనయీ గ్రంథములోని సాహిత్యము నాస్వాదించి సాహిత్యాభిమానులైన పాఠకులు 'ఆదరాభిమానములు' తమ అభిప్రాయములనందించ గలరని ఆశించుచున్నాము.

యథావకాశము మిగిలిన సంపుటములు ప్రకాశింప జేసి పాఠకులకు అందించగలమని ఆశించుచున్నాము.

ఈ గ్రంథమును అందముగా ముద్రించి త్వరగా అందజేసిన "లక్ష్మి గ్రాఫిక్స్" హనుమకొండ వారికి మా ధన్యవాదములు.

ఇట్లు
సర్వవైదిక సంస్థానము
కరీంనగర్,
ప్రకాశన విభాగము

ది.వి. 14-10-1993

డా॥ జి. స్వామినాథాచార్యులు

# కృతిసమర్పణమ్

మయాంధ్రభాషా వివృతా స్సంస్కృతీయాః ప్రహేళికాః
అర్ప్యంతే తుభ్యముపదా రఘునాథగురూత్తమ।
సమయస్ఫూర్తిదృశా మహాకవినుతప్రజ్ఞాపటిమ్నా తథా
బహుశాస్త్రైకతల స్పృశా ప్రతిభయా సమగ్ర్యమర్త్యేనవా
భవతా శ్రీ రఘునాథదేశికమణే కస్స్పర్ధతే భారతే
ధ్వనిగంభీరపదప్రచార కవితాకాంతారకంఠీరవ!

స్వచ్ఛ ప్రఖ్యావతీర్ణ ప్రతిపదసమయస్ఫూర్తి ధీసప్తకాంచద్
జ్యోతిష్మత్త్యారిరంసుం శితమతినికషోన్మేషితామ్నాయమౌళిమ్
శ్రీ భాష్యోద్బోధభానుప్రతిహతవిబుధచ్ఛాత్రజీర్యత్తమస్కం
శాస్త్రాణాం తీరభూమిం బుధమణి రఘునాథార్యమాచార్య మీడే॥

యోఽయం శ్రీ ప్రతివాదిభీకరమహాసింహాస్యదర్పం హరన్
బెల్లంకొండ విపశ్చిదుద్ధృత మహాహస్తావలేపాన్ లఘు
ఉద్ధున్వన్ ప్రణినాయ యుక్తి శతకైర్ గ్రంథా ననేకానపి
శ్రీ వాత్స్యం రఘునాథ దేశిక మణిం శ్రౌతావతంసం స్తువే॥

ప్రస్థానత్రయతత్త్వబోధనమహాచార్యం ప్రసన్నం పరా
పశ్యంత్యాదిచతుష్టయాంచితమహాలక్ష్మీహయాస్యాశ్రితమ్
న్యాయవ్యాకరణాదిదర్శనమహాదర్శం గురూణాం గురుం
శ్రీ వాత్స్యం రఘునాథదేశికమణిం విద్వత్కవీంద్రం స్తువే॥

కవిశాబ్దికకేసరిప్రథా
మధిరూఢం రఘునాథదేశికం గురుమ్
కుదృశాం దమనార్థమాగతం
భగవల్లక్ష్మణయోగినం బ్రువే॥

ఎముకలు లేవు తల లేదు- చేతులుండును కాని
వ్రేళ్లుండవు.పాదములు కూడ లేవు కాని శరీరము నాశ్లేషించును. (చొక్కా)

ఏకచక్షు ర్నకాకోఽయం బిలమిచ్ఛేన్న పన్నగః
క్షీయతే వర్ధతే చైవ న సముద్రో న చంద్రమాః 5

ఒకే కన్నుండును కాని కాకి కాదు- బిల మభిలషించును కాని సర్పము కాదు- వృద్ధి క్షయము లొందును కాని సముద్రుడు కాదు, చంద్రుడును కాదు
(సూది)

దంతై ర్హీనః శిలాభక్షీ నిర్జీవో బహుభాషకః
గుణస్యూతి సమృద్ధోపి పరపాదేన గచ్ఛతి 6

పండ్లు లేకున్నను ఱాలు తినును- ప్రాణము లేకున్నను అతిగా మాట్లాడును- గుణ సమద్ధమైనను పరుని పాదము నంటి పోవును. (పాదరక్ష) గుణస్యూతి యన దారములతో కుట్టుట, నడుచునపుడు పాదరక్ష కిరకిర ధ్వని జేయును.

నర నారీ సముత్పన్నా సా స్త్రీ దేహవివర్జితా
అముఖీ కురుతే శబ్దం జాతమాత్రా వినశ్యతి 7

స్త్రీ పురుషుల వలన బుట్టును- అది దేహము లేని స్త్రీ అగును- నోరు లేకున్నను ధ్వని జేయును-పుట్టిన వెంటనే నశించును (ఛోటికా=చిటిక) నరనారీ సముత్పన్నా- అంగుష్ఠమధ్యమాంగుళీ ఘర్షణవలన బుట్టును,( బొటనవ్రేలు సంస్కృతమున పుంలింగము. నడిమి వ్రేలు స్త్రీ లింగము)

న తస్యాది ర్నతస్యాంతః మధ్యే యస్తస్య తిష్ఠతి
తవాప్యస్తి మమాప్యస్తి యది జానాసి తద్వద 8

దానికి తుదిమొదలు లేవు కాని మధ్యమాత్రము 'య' ఉండును. అది నీకునాకు అందరకు ఉన్నది. అనగా నీకు నాకు నుండు ఆ వస్తువునకు నకారము తుది మొదలులలో, యకారము మధ్యలో నుండును. (నయనమ్=కన్ను)

ఆపాండు పీనకఠినం వర్తులం సుమనోహరం
కరై రాకృష్యతేఽత్యర్థం కిం వృద్ధై రపి సస్పృహమ్ 9

ఇంచుక తెల్లనిది- బలిసినది- కఠినమైనది- గుండ్రనిది- మనస్సు నాకట్టునది-ముసలివాడును ప్రీతిచే చేపట్టునట్టి వస్తువేది? (మారేడు (నశ్యపు) కాయ లేక కుచయుగళము)

అస్తి గ్రీవా శిరో నాస్తి ద్వౌభుజౌ కరవర్జితౌ
సీతాహరణసామర్థ్యః న రామో న చ రావణః 10

మెడ యున్నది కాని తల లేదు- భుజములున్నవి కాని చేతులు లేవు -సీతా హరణ సమర్థమైనది కాని రాముడు కాదు, రావణుడు కాదు. (నాగలి) మేడి (పాలె), కాడి కలిగి చాలు పెట్టును. సీత యనగా నాగలి చాలు

రవిజా శశికుందాభా తాపహారీ జగత్ప్రియా
వర్ధతే వనసంగేన న తాపీ యమునాపి న 11

రవి వలన పుట్టినది- చంద్రునివలె మొల్లవలె తెల్లగా నుండునది- తాపమును హరించునది- లోక ప్రియ మైనది- వన సాంగత్యమున పెంపొందునది ఇది తపతియు కాదు యమునయు కాదు. అది ఏమి ? (రవి అనగా మహారాష్ట్ర భాషలోకవ్వము. వనమనగా నీరు. మథితము జలవృద్ధము అగునది) (మజ్జిగ)

ఏది మొదలో అదియే తుద, మధ్యలో మధ్యమముండును, ఇది యెఱుగని వాడు గడ్డి పఱకను సైతమెఱుగలేడు. (మొదట యకారము చివర సకారముమధ్యలో వకారము గల పదము ) యవసమ్ =గడ్డి)

శ్యామం చ వర్తులాకారం పుంనామ చతురక్షరం
శకారాది మకారాంతం యది జానాసి తద్వద 13

నల్లగా గుండ్రముగా నుండునది – పురుషుని పేర బరిగి నాల్గక్షరములు కలిగి మెదట శకారము చివర మకారము గల పదము తెలిసినచో తెలుపుము. (శాలిగ్రామః) (ఇదిసంస్కృతమున పులింగము, విష్ణ్వాలయమున పూజింపబడును.)

అర్ధచంద్రసమాకారం పుంనామ చతురక్షరం
కకారాది లకారాన్తం యో జానాతి సపండితః 14

అర్ధచంద్రనివలె నుండునది– పుంనామకమై నాల్గవక్షరములు కంది-అందు కకారము మెదట, లకారము చివర నుండుసది. దీని నెరగినవాడే పండితుడుసుమా! కరవాలః = కత్తి (కరవాల పదము సంస్కృతమున పులింగము)

వృక్షాగ్రవాసీ న చ పక్షిరాజః
త్రిణేత్రధారీ న చ శూలపాణి
త్వగ్వస్త్రధారీ న చ సిద్ధయోగీ
జలంచ బిభ్రత్ న ఘటో న మేఘః 15

చెట్టు చివర నుండును కాని పక్షి రాజు కాదు– మూడు కనులుండును కాని శివుడు కాదు–చర్మాంబరధారి కాని పిద్ధయోగి కాదు– నీటిని ధరించును కాని కుండ కాదు, మేఘము కాదు, (కొబ్బరికాయ)

చతుర్ముఖో న చ బ్రహ్మో వృషారూఢో న శంకరః
నిర్జీవ శ్చ నిరాహారీ అజస్రం ధాన్యభక్షకః 16

నాలుగు ముఖము లుండును కాని బ్రహ్మ కాదు- ఎద్దు నెక్కినుగాని శివుడు కాదు- ప్రాణము లేదు మరియు తినదు కాని ఎల్లప్పుడూ ధాన్య భక్షణ జేయును. (ఎద్దు మోయు గోనె)

సదారిమధ్యాపి న వైరియుక్తా
నితాన్త రక్తాపి సితైవ నిత్యమ్
యథోక్త వాదిన్యపి నైవ దూతీ
కా నామ కాంతేతి నివేదయాశు 17

ఎల్లప్పుడు శత్రువుల నడుమనున్నను వైరులు లేనిది- మిక్కిలి ఎఱ్ఱని దైననూ తెల్లగానే యుండును- చెప్పిన మాటలే చెప్పునదైననూ దూతి మాత్రము కాదు- ఐనచో ఈ కాంత యెవరో తెలుపుము?
(సారికా)

సదారి మధ్యా = 'రి' కారము మధ్య నుండునది- సితా= సకారముతో కూడునది- కాంతా='క' కారము చివర కలది.

కేశవం పతితం దృష్ట్వా ద్రోణో హర్ష ముపాగత ః
రుదంతి కౌరవా స్సర్వేహా కేశవ!కథం గతః 18

నేలగూలిన కేశవుని జూచి ద్రోణుడు సంతసించెను కౌరవులెల్లరు 'అయ్యో' కేశవా! ఎటు పోయితివని ఏడ్చిరి

ద్రోణః = మాలకాకి, కే = నీటిలో, పతితమ్ = పడిపోయిన, శవమ్=పీనుగును, దృష్ట్వా=చూచి, హర్షముపాగత ః=మిక్కిలి సంతసించెను, కౌరవా ఃనక్కలు, సర్వే=అన్నియు, శవ=ఓ పీనుగా, కే=నీటిలోనికి, కథం=ఎట్లు, గతః =పోయితివని, రుదంతి=ఏడ్చును.

శంకరం పతితం దృష్ట్వా పార్వతీ హర్ష నిర్భరా
రుదంతి పన్నగా స్సర్వే హా హా శంకర శంకర ః 19

పడిపోయిన శంకరుని జూచి పార్వతి సంతసించును. సర్పములన్నియు అయ్యో! శంకరాయని విలపించును.

పార్వతీ=కొండ జాతిది, శంకర=చందనవృక్షము.(నేల గూలిన చందన వృక్షమును జూచి భిల్లస్త్రీ సంతసించెను. తమ కాశ్రయమైన గంధపు చెట్టు పడిపోవుటచే పాములు విలపించెను.)

గంగాయాం స్నాతు ముద్యుక్తా ః ఏకోనావింశతి స్త్రియ ః
తత్రైకా మకరగ్రస్తా పునర్వింశతి రాగతా 20

గంగా స్నాన మొనరింప ఒకటి తక్కువ ఇరువది మంది స్త్రీలు వెళ్లిరి.అందు ఒకతెను మొసలి మ్రింగెను తిరిగి ఇరువది మంది వచ్చిరి.

'ఏకోనా' అనుచోట చమత్కార మున్నది. ఏక+ఊనా ఏకోనా=పందొమ్మిది, ఏక ః+నా=ఏకోనా=ఒక పురుషుడు.

(ఒక పురుషుడు ఇరువది మంది స్త్రీలు స్నానమునకు వెళ్లిరి, అందొకతె మకరగ్రస్త కాగా, తిరిగి ఇరువది మంది వచ్చిరి.)

అనేక సుషిరం వాద్యం కాంతంచ ఋషి సంజ్ఞితమ్
చక్రిణా చ సదారాధ్యమ్ యది జానాసి తద్వద 21

పలు రంధ్రములు గలది- వాద్యము- సుందరమైనది- ఋషి పేరు గలది- చక్రి కి ఎప్పుడూ సేవనీయ మైనది తెలుపుము.

అనేక సుషిరం= పలు వివరములు గలది, వాద్యం=వకారము మొదట నుండునది, కాంతం చ= కకారముచివర నుండునదియు- ఋషి సంజ్ఞితమ్=ఋషి పేరనొప్పునది- చక్రిణా=పాముచే- సదారాధ్యమ్=ఎప్పుడూ సేవింప తగినది. (వల్మీకమ్=పుట్ట)

సమరే హేమరేఖాంకమ్ బాణం ముంచతి రాఘవే
స రావణోపి ముముచే మధ్యే రీతి ధరం శరమ్ 22

యుద్ధ రంగమున శ్రీ రాముడు సువర్ణ రేఖాంకితమగు బాణము విడువగా (ప్రయోగించగా) ఆ రావణుడును మధ్యలో ఇత్తడి బాణమును విడిచెను.

మధ్యే రీతి ధరం శరమ్=రీ కారము మధ్య యందుగల శరమును అనగా శరీరమును రావణుడు విడిచెను అని భావము.

అపూర్వోऽయం మయా దృష్టః కాంతః కమలలోచనే !
శోంతరం యో విజానాతి స విద్వాన్ నాత్ర సంశయః 23

ఓ కమలలోచనా! అపూర్వము, కాన్తమగు దానిని చూచితిని. ఇందు శోంతర మెఱిగిన వాడే విద్వాంసుడు

అకారము ముందు, కకారము చివర, మధ్య 'శో' కలది. అనగా (అశోకః=అశోకము) చూడబడినదని తాత్పర్యము.

శిలార్పిత పదద్వంద్వా నాసార్పిత కరద్వయా
అభూత్ వ్యక్త స్తనీ నారీ కథమేతత్ భవిష్యతి? 24

పాదద్వంద్వము శిల యందు మోపి, రెండు చేతులు ముక్కుపై నిడు కొనిన స్త్రీ స్తనములను వ్యక్తపరచెను. ఇది యెట్లు సంభవించును ? సమన్వయము- అధస్తాత్ దారుణిశిలా నాసా దారూపరిస్థితా అను కోశ ప్రకారము శిలయనగా కడప, నాస యనగా ద్వారముపై దారువు. ఆ యువతి కడపపై నిలిచి పై భాగమును ,చేతులతో పట్టుకొన్నది. కావున వ్యక్తస్తని ఆయెను.

విరాజరాజ పుత్రారేః యన్నామ చతురక్షరమ్
పూర్వార్థం తవశత్రూణాం పరార్థం తవ సంగరే 25

విరాజ రాజపుత్రారికి సంబంధించిన నాల్గక్షరాల పేరులోని పూర్వార్ధము శత్రువులకు, పరార్ధము నీకు, రణములో సంభవించు గాత !

విరాజరాజపుత్రారేః వి=పక్షులకు, రాజ=ప్రభువగు గరుత్మంతునకు, రాజ=నాయకుడైన విష్ణువు యొక్క. పుత్ర=కుమారుడగు మన్మథునకు అరేః=వైరియగు శివునకు సంబంధించిన యత్ నామ=ఏ పేరు, చతురక్షరం=నాల్గక్షరములు కలిగి యున్నదో, పూర్వార్ధం=ఆ పేరులోని మొదటి సగము, సంగరే=యుద్ధమున, తవ శత్రూణాం=నీ శత్రువులకు, పరార్ధం=రెండవ సగము, తవ=నీకు సంభవించుగాక ! మృత్యుంజయః అనునది శివుని పేరు, యుద్ధములో నీ శత్రువులకు మృత్యువు నీకు జయము చేకూరునని తాత్పర్యము.

**శస్త్రం నఖలు కర్తవ్యమ్ ఇతి పిత్రా నియోజితః**
**తదేవ శస్త్రం కృతవాన్ పితు రాజ్ఞా నలంఘితా 26**

ఏ శస్త్రమును నిర్మింప వద్దని తండ్రి కుమారుని శాసించెనో, ఆ శస్త్రమునే అతడు నిర్మించి తండ్రి యానతియు నుల్లంఘింపని వాడాయెనని సాధారణముగా తోచు అర్థము . నఖలు అను పదమున చమత్కార మున్నది. చేయ కూడదను అర్థమున న ఖలు అనునవి అవ్యయములు. గోళ్లను కత్తిరించు (నఖాన్ లునాతి) అనునర్థమున శబ్దమగును, గోళ్ల కత్తిరించు శస్త్రమును చేయుమని తండ్రి యాదేశింప, నాతడు అట్టి శస్త్రమునే నిర్మించి తండ్రి యాజ్ఞ పాలించెనని సమన్వితార్థము.

**దేవరాజో మయా దృష్టః వారివారణ మస్తకే**
**భక్షయిత్వార్క పర్ణాని విషం పీత్వా క్షయం గతః 27**

నీటి యేనుగుపై నా కగుపడిన దేవేంద్రుడు అర్కపర్ణముల భక్షించి విషము త్రాగి క్షయము నందెనని సామాన్యముగా విరుద్ధార్థము స్ఫురించును. ఆలోచించినచో - ఈ క్రింది రీతి తోచును.

దేవర= ఓ మరదీ , వారి వారణమస్తకే=నీటి నడ్డగించు కట్టపైన,

మయా=నాచే, దృష్ట :=చూడబడిన, ఆజ :=మేక, అర్క పర్ణాని=జిల్లేడు ఆకులను, భక్షయిత్వా=తిని, విషం పీత్వా=నీటిని త్రాగియు, క్షయంగత : =తన నివాస స్థానమున కేగెను.

**వినాయకపతే శ్శత్రు : తస్యనామ షడక్షరమ్**
**పూర్వార్ధం తవ రాజేంద్ర ఉత్తరార్ధంతు వైరిణామ్ 28**

వినాయక పతికి శత్రువగు వాని యొక్క ఆరక్షరములు గల పేరులోని మొదటి సగము నీకు, రెండవ సగము నీ శత్రువులకు కలుగు గాకయని కవి ఒక రాజేంద్రుని దీవించెను.

వినాయక పతే : =పక్షి రాజగు గరుత్మంతుని యొక్క ప్రభువగు విష్ణువునకు, శత్రు : =శత్రువెవడో, తస్య=వానివి సంబంధించిన, షడక్షరం నామ= ఆరక్షరముల పేరు ఏది కలదో అందు - పూర్వార్ధం=మొదటి సగము, తవ=నీకు, ఉత్తరార్ధమ్=రెండవ సగము, వైరిణమ్=నీ శత్రువులకు కలుగు గాక(యని కవి ఒక రాజేంద్రుని దీవించెను.)

నృసింహమూర్తికి శత్రువు హిరణ్యకశిపువు, హిరణ్యమన బంగారము అది నీకు కల్గుగాక, కశిపువన తల్పము. నీ శత్రువులు దీర్ఘ నిద్ర నందుదురని కవి ఆశయము.

**కుందకుంజ మముం పశ్య సరసీరుహలోచనే**
**అమునా కుందకుంజేన సఖి ! మే కిం ప్రయోజనమ్ 29**

**సఖీ రాధల సంభాషణ : -**

సఖి :- ఓ సరసీరుహలోచనా ! రాధా! ఈ మొల్ల పొదను చూడుము

రాధా :- చెలీ ! మొల్ల పొదను చూచినందు వలన నేమి లాభము

అమునా అను పదమున చమత్కారము కలదు. అమునా కుందకుంజేన = ముకారము లేని కుందకుంజముతో అనగా ముకుందుడు (కృష్ణుడు) లేని పొదరింటితో నేమి ప్రయోజనమని తాత్పర్యము.

చతుర్ధజ : పంచమగ : దృష్ట్వా ప్రథమ సంభవామ్
తృతీయం తత్ర నిక్షిప్య ద్వితీయ మతరత్ పున : 30

ఇందు పంచ భూత సంఖ్యాక్రమమున సుందర కాండార్థము సూచింపబడినది. పృథివి-అప్పు తేజస్సు - వాయువు - ఆకాశమనునవి పంచ భూతములు -

చతుర్థజ : =నాల్గవ భూతము వాయువు - అతని వలన బుట్టినవాడు హనుమంతుడు, పంచమగ : =ఐదవ భూతమాకాశము, ఆకాశ మార్గమున వెళ్లినవాడై. ప్రథమ సంభవామ్=మొదటి భూతము పృధివి - ఆపృధివి యందు పుట్టిన సీతాదేవిని, దృష్ట్వా=చూచి, తత్ర=ఆమె యున్న చోట అనగా లంక యందు తృతీయం=మూడవది తేజో భూతము - అనగాఅగ్నిని నిక్షిప్య=ఉంచి (లంకను కాల్చి) ద్వితీయం = అప్పును=సముద్రమును, పున :=తిరిగి (మరల) అతరత్=దాటెను. పై శ్లోకము వంటిదే తెలుగులో నొక పద్యమున్నది.

ప్రథముని పట్టికై చలముపట్టి చతుర్థుని పట్టి చెట్ట బ
ట్టి ధృతిదలిర్ప నేర్పున ద్వితీయుని గట్టిగ గట్టి పెట్టి యా
ప్రథనమునన్ తృతీయుబలు బానటచే నరి గొట్టినట్టి యా
యధిపుడు పంచమున్ గడచు నచ్చవు గీర్తిని మీ కొసంగుతన్

హనుమంతుని సాహాయ్యము వలన సీత జాడ నరసి శ్రీరాముడు సాగరమును బంధించి విభీషణుని వలన రావణుని గర్భమున నున్న అమృత కలశము తెలిసికొని ఆగ్నేయాస్త్రముచే దానిని భేదించి రావణ సంహారము జేసెను. అట్టి రాముడు మీకు ఆకాశమును మించు మంచి కీర్తి నొసంగు గాక యని దీని తాత్పర్యము.

కృష్ణ ముఖీ న మార్జారీ ద్విజిహ్వా న చ సర్పిణీ
పంచ భర్త్రీ న పాంచాలీ యో జానాతి స పండిత : 31

మోము నల్లగా నుండును కాని పిల్లి కాదు - రెండు నాలుకలుండును

కాని పాము కాదు - పంచ భర్త్రియే కాని ద్రౌపది కాదు - దీని నెఱిగిన వాడే పండితుడు( లేఖిని=కలము)

వనే వసతి కో వీర ః యోఽ స్థిమాంసవివర్జిత ః
అసివత్ కురుతే కార్యం కార్యం కృత్వా వనం గత ః 32

ఎముకలు మాంసము లేనిది- కత్తి వలె పని చేయునది - కార్యానంతరము వనము జేరునది - వనములోనే ఉండునది - అట్టి మేటియెవరు ?(కుమ్మరివాడు కుండను గోయు దారము) ఇది యెప్పుడు నీటి బాణలిలో నుండును (వనము=నీరు)

నాద్యా దన్నం పిబే త్తైలం శీఘ్రం గచ్ఛేత్ చతుష్పదై ః
న మృగో న నరశ్చాపి యో జానాతి స పండిత ః 33

అన్నము తినదు కాని నూనెను త్రాగును - నాల్గు కాళ్లతో త్వరగా వెళ్లును కాని మృగము కాదు, మనుష్యుడును కాదు - దీని నెఱిగినవాడే పండితుడు. (బాష్పయానము - మోటారు)

న పక్షీ విహగ శ్చైవ ద్రుతగామీ న మారుత ః
న ఘనో ఘనవాహీ చ న ముఖీ ముఖర స్స కః 34

రెక్కలుండును మరియు ఆకాశమున చరించును కాని పక్షి కాదు - త్వరగా వెళ్లును కాని గాలి కాదు - గొప్పగా నుండును కాని మేఘము కాదు మేఘ వాహుడును కాదు - నోరు లేకున్నను మిక్కిలి శబ్దము జేయును ఇది యేమి ? (విమానము)

అయోముఖీ దీర్ఘకాయా బహుపాదా జనాశనా
అస్పృష్ట్వా భూతలం యాతి యక్షిణీ దేవతా చ న 35

ఇనుప మోము, దీర్ఘాకృతి, పలు పాదములు కలది, మనుష్యాదుల తినునది, భూమిని స్పృశింపకయే వెళ్లునట్టిది. ఇది మాత్రము యక్షిణి

కాదు దేవతయు కాదు.(ధూమ శకటము)

దివాంధో నాప్యులూకస్స్యాత్ అధశ్శీర్ష ః న తాపస ః
ఫలభక్షీ న దీక్షావాన్ యో జానాతి స పండిత ః 36
గ్రుడ్డియగును పగలు గుడ్లగూబయుగాదు
తలను వ్రేలవేయు తపసికాదు
ఫలములారగించు పరమ వ్రతుడు కాడు
దీని భావమేమి ? తిరుమలేశ !

పగలు గ్రుడ్డిగా నుండును కాని గుడ్లగూబ కాదు- తల క్రిందుగా నుండునుకాని తపసికాదు - ఫల భక్షణ జేయును కాని వ్రతధారి కాదు.ఇది యెరిగినవాడే పండితుడు. (ఋషిపక్షి)

అధునా మధుకరపతినా గిలితోప్యపకారదంపతీ యేన
త్రాత స్స పాలయే త్త్వాం విగతవికారో వినాయకో లక్ష్మ్యాః37

అదునా=ధుకారము లేని,మధుకరవ తినా=మధు కరవ తిచే గిలితోఽపి=గ్రహింపబడుచున్నను. అపకార దంపతీ,= పకారము లేని దంపతి యేన=ఏ విష్ణుమూర్తిచే త్రాత ః=రక్షింపబడెనో స ః=అట్టి లక్ష్మ్యా ః =లక్ష్మీ దేవి యొక్క= విగతవికారః =వికారములేని. వినాయక ః=వినాయకుడు, త్వాం =నిన్ను పాలయేత్ =రక్షించుగాక.

మధుకరవతి పదమున ధుకారము తొలగించినచో మకరపతి(మొసలిఱేడు) అగును. దంపతీ పదమున పకారము తొలగించిన దంతీ (ఏనుగు) అగును. వినాయక పదమున వి అను వర్ణము తొలగించిన నాయక అని అగును. గజత్రాతయగు విష్ణువు నిన్ను బ్రోచు గాక యని తాత్పర్యము.

ఉపరిగతం హి సవర్ణం హృత్వా కరమో దదాసి రంతుం మే
ధన్య ః సరోజయుగలం త్యక్త్వాస్తనయుగ మధాస్స్ప్రశత్ 38

ఓ రాధా ! పైన వేసికొనిన సవర్ణమగు సరోజ యుగలమును దీసి నేను రమించ నొసగుచున్నానని ధన్యుడైన కృష్ణుడు ఆ సరోజ యుగలమును విడిచి ఆమె వక్షోజస్పర్శ జేసెను.

ఇట ఉపరిగతం సవర్ణం హృత్వా అను తావున చమత్కారము కలదు. సరోజయుగలమగును. అప్పుడు ఉపరిగతమ్=అ రోజయుగము ఉకారముతో కూడుకొనినచో ఉరోజయుగల మగును.

**విషం భుంక్ష్వ మహారాజ ! స్వజనై : పరివారిత :**
**వినాకేన వినానాభ్యాం కృష్ణాజిన మకంటకమ్ 39**

మహారాజ=మహారాజా, స్వజనై : పరివారిత :=స్వజనపరివారము గల వాడవై. కేనవినా=కకారము లేని, నాభ్యాం వినా=నకారములు లేని, విషం= షకారములేని, కృష్ణాజినం=కృష్ణాజినమును అకంటకమ్=శత్రు రహితముగా భుంక్ష్వ=అనుభవించుము.

కృష్ణాజినమను పదమున=కకారము షకారము ణ కారమున న కారము తొలగించినచో (క్ ష్ ణ్ న్ తొలగించిన) ఋ ఆ జి అ మ్ అనునవి మిగులును ఋ+ఆ=రాజి+అమ్=జ్యమ్ -రాజ్యమ్ అను రూప మేర్పడును మహారాజా నిష్కంటకముగా రాజ్యము ననుభవింపుమని తాత్పర్యము.

**విజితాత్మభవద్వేషి గురుపాదహతో జన :**
**హిమాపహామిత్రధరై : వ్యాప్తం వ్యోమాభినందతి 40**

విజితాత్మభవద్వేషిగురుపాదహత : =వి= పక్షియగు గరుత్మంతునిచే జిత=అమృతహరణ సమయమున జయించబడిన ఇంద్రుని యొక్క ఆత్మభవ= పుత్రుడైన అర్జునుని ద్వేషించు కర్ణుని యొక్క గురు=తండ్రి యగు సూర్యుని, పాద=కిరణములచేహత:=సంతప్తమైన, జన :=జనము, హిమాపహామిత్రధరై : హిమాపహ=మంచు నివారించు అగ్నికి, అమిత్ర= శత్రువగు జలమును, ధరై := ధరించిన మేఘములచే, వ్యాప్తమ్=ఆవృతమైన,

వ్యోమ= ఆకాశమును అభినందతి=అభినందించును.

విహంగా వాహనం యేషాం త్రికంచధరపాణయః
పాసాలసహితా దేవా స్సదా తిష్ఠంతు తే గృహే 41

యేషామ్=ఏ త్రిమూర్తులకు, వాహనమ్ =వాహనములు, విహంగాః వి=గరుత్మంతుడు, హం=హంస,గాః =నందియో,( అట్టి,త్రికంచధరపాణయః =త్రి=త్రిశూలమును, కం=కంబువును (శంఖమును) చ=చక్రమును, ధర=ధరించునట్టి, పాణయః=హస్తములుగలవారు, పాసాల సహితాః,పా=పార్వతితో, సా=సావిత్రితో, ల =లక్ష్మితో, సహితాః కూడుకొనిన, దేవా ః=త్రిమూర్తులు, తే గృహే తిష్ఠంతు=నీయింట నిలుతురు గాక,. "నామైక దేశే నామగ్రహణ" మను న్యాయ మనుసరింపబడినది.

మోమారామమమాదంద్వే హయాగదలనంభష ః
యస్యైతాని నవిద్యంతే స యాతి పరమాంగతిమ్ 42

మోమారామమమాదంద్వే, హయాగదల నంభషలు ఎవనికి లేవో వాడే పుణ్యలోకము నొందును - ఇట పూర్వార్థమున అక్షర క్రమికత ప్రదర్శింపబడినది

మో మా రా మ మ మా దం ద్వే

హ యా గ ద ల నం భ షః అని ఊహించుకొన వలెను. మోహము మాయ రాగము, మదము, మలము, మానము దంభము, ద్వేషము లేనివాడు పుణ్యలోకము నొందునని భావము.

కతి తే కబరీభారః సుమనస్సంగా దతీవ నీలత్వాత్
భవతి చ కలాపవత్త్వాత్ నిర్జరసేవ్యః కథం ను న స్యాత్ 43

ఓ ప్రేయసీ ! తే=నీయుక్క, కబరీభారః=వేనలి.సుమనస్సంగాత్ =పూలు తురుముకొనుట వలన, (దేవతా సంబంధము వలనను) అతీవ = మిక్కిలి, నీలత్వాత్ = నల్లగా నుండుటవలనను, కతి=(క ఇవ ఆచరతి)

విష్ణువువలె నున్నది, కలాపవత్త్వాత్ చ = నెమిలిపురి కలదగుటవలనను (చంద్రుడు కలవాడగుటవలన భవతి = (భవ ఇవచరతి) శివునివలె నున్నది. శివకేశవతుల్యమగుటవలన అది నిరజ్జరసేవ్యః=ముసలివారు కాని యువకులచే (దేవతలచే) కథం ను= ఎట్లు నసేవ్యః స్యాత్=సేవింపరాని దగును?

నీలత్వసుమనస్సంగ ధర్మములు విష్ణువునకువలె నీకును ఉన్నవి. కలాప వత్త్వము శివునకువలె నీకును ఉన్నది. వారు నిర్జర సేవ్యులైనట్లు నీవు నిర్జర సేవ్యురాలవే సుమా ! యని తాత్పర్యము.

**విలాసినీం కాంచ నపట్టి కాయాం**
**పాటీరపంకై ర్విరహీ విలిఖ్య**
**తస్యాః కపోలే వ్యలిఖత్ పవర్గం**
**తవర్గమోష్ఠే చరణే టవర్గమ్ 44**

ఒక కాముకుడు ఒకానొక విలాసవతిని బంగారు పట్టికపై శ్రీ గంధ ద్రవముతో చిత్రించి ఆమె చెంపయందు 'ప' వర్గను పెదవి యందు 'త' వర్గను, పాదమునందు 'ట' వర్గను వ్రాసెను. ఓష్ఠస్థానీయమగు 'ప' వర్గ వ్రాయుట వలన – నా పెదవులతో నీ చెంపను ముద్దిడుకొందునని, దంత స్థానీయమైన 'ట' వర్గ వ్రాయుటచే – నీ పెదవిపై దంతక్షతము జేయుదునని, మూర్ధ స్థానీయమైన 'ట' వర్గ నుపమోగించుటవలన – నీవు కోపించినచో నీపాదముపై నాతలను మోపుదునని అతని ఆశయము.

**సర్వ స్వాప హరో న తస్కరగణో రక్షో న రక్తాశనః**
**సర్పో నైవ బిలేశయో ఽ ఖిలనిశాచారీ న భూతోపి చ**
**అంతర్ధానపటు ర్న సిద్ధపురుషో, నాప్యాశుగో మారుతః**
**తీక్ష్ణాస్యో నతు సాయక స్తమిహయే జానంతి తే పండితాః 45**

సర్వస్వము నపహరించును కాని, దొంగకాదు –రక్తము త్రాగును

కాని, రాక్షసుడు కాడు బిలములో శయనించును కాని, సర్పము కాదు - రాత్రి చరించును గాని భూతముకాదు - అంతర్ధానము జెందునుకాని సిద్ధుడు కాదు - త్వరగా చరించునుగాని, వాయువు కాదు, -మోమువాడిగా నుండునుకాని, బాణముకాదు - దీనినెరిగినవారే పండితులు. (నల్లి)

వాయు మిత్ర సుత బంధు వాహనా
రాతి భూషణ శిరోవలంబినీ
తజ్జవైరిభగినీపతే స్సఖా
పాతు మాం కమలలోచనో హరిః 46

వాయు మిత్ర= గాలి చెలికాడైన అగ్ని యొక్క, సుత =పుత్రుడైన షడాననునకు బంధు= సోదరుడైన వినాయకుని, వాహన=వాహనమగు ఎలుకకు అరాతి=శత్రువగుసర్పము, భూషణ=భూషణముగాగల శివుని యొక్క, శిరః=మౌళిని అవలంబినీ =అవలంబించిన ఏ గంగకలదో, తత్= ఆ గంగయందు, జ=పుట్టిన భీష్మని, వైరి=శత్రువగు శిఖండియొక్క, భగినీపతే =చెల్లెలి (ద్రౌపది) భర్తయగు అర్జుననకు, సఖా=మిత్రుడైన, కమలలోచన ః హరి ః=తమ్మి కంటియగు కృష్ణుడు, మాంపాతు=నన్ను రక్షించుగాత.

సంతప్తా దశమధ్వజాదిగతినా సమ్మూర్చితా నిర్జలే
తుర్యద్వాదశవత్ ద్వితీయగతిమ త్యేకాదశాభస్తనీ
సాషష్ఠీ నృపపంచమస్య నవమభ్రూ స్సప్తమీవర్జితా
ప్రాప్తాహ్యష్టమ వేదనాంత్యమధునా తూర్ణం తృతీయో భవ 47

ఇట రాశి సంఖ్యాక్రమమున విరహిణి విషయము సూచింపబడినది.

దశమ ధ్వజాదిగతినా=దశమ=(పదవరాశియైన) మకరము, ధ్వజ=టెక్కెములుగా మదనుడనే, ఆది=(మొదటి రాశియైన, మేషము గతినా=వాహనముగాగల అగ్నిచే మదనాగ్నిచేనని భావము), సంతప్తా=సంజ్వరితురాలు, నిర్జలే=నీరులేని తావున.,

తుర్యద్వాదశవత్ =(నాల్గవరాశిమైన) కర్కాటమువలె(పంద్రెండవ రాశియైన) మీనము వలెను, నవమ్మార్చితా=సొమ్మసిల్లినట్టిది, ద్వితీయ గతిమతీ=(రెండవరాశి) వృషభము వలె నడచునది, ఏకాదశాభస్తనీ=(పదకొండవరాశి) కుంభోపమస్త నురాలు, నవమభ్రూః= (తొమ్మిదవరాశి) ధనుస్సువంటి బొమ్మలుకలది, సప్తమీవర్జితా=(ఏడవరాశి) తుల (సాటి) లేనట్టిది, నృపపంచమస్య=రాజ సింహునియొక్క (పంచమ రాశి సింహము)సాషష్ఠీ=(ఆరవరాశి) ఆకన్యక (రాకుమారియని భావము) అష్టమ వేదనామ్=(ఎనిమిదవరాశి) వృశ్చిక బాధవంటి బాధను ప్రాప్తా=పొందినది, త్వమ్=నీవు అధునా=ఇప్పుడు, తూర్ణమ్=త్వరగా, తృతీయః భవ=(మూడవరాశి) మిథునీభవింపుము, రాజకుమారిని త్వరగా పొందుమని తాత్పర్యము.

కోలాకృతి రపారేవో మోరోహంసో జలోదరీ
కంసారి రాత్తలీలో వో వాఘలో భూకలోఽవతు 48

కోలాకృతిః= ఆది వరాహ రూపమునెత్తినవాడు, అపారేవః=(అపారే క్షీరపారావారే,వసతి) పాలకడలి నుండువాడు, మోరోహంసః =మా=లక్ష్మీదేవియొక్క ఉరః =వక్షస్థలమున (మానససరోవరమున నని భావము.), హంసః =రాయంచయైనవాడు, జలోదరీ=జల =నీరే=ఉదరీ నివాసముగలవాడు(నారాయణుడు, ఆత్తలీలః=వివిధ లీలలుగలవాడు, వాఘలః =వా=నిశ్చయముగా, అఘ=పాపములను లః=నశింపజేయువాడు, (అఘంలునాతి ఇతి అఘలః అని వ్యుత్పత్తి) భూకలః=(భువం కలయతి ఇతి భూకలః) భూభారము తొలగించేవాడు, కంసారిః =కంసద్వేషియైన శ్రీ కృష్ణుడు, వః మిమ్ము, అవతు=పాలించుగాక (ఈశ్లోకము మహారాష్ట్రభాషాభాసము)

త్వద్విరహ మసహమానా
నిందతి బాలా దివానిశం శంభుమ్

రాహు మపి రామచంద్రం
రామానుజ మపి చ పన్నాగారాతిమ్ 49

ఓ రాజా ! నీ వియోగమును సహింపలేని ఆ యువతి శివుని, రాహువును, రామచంద్రుని, శ్రీ కృష్ణుని, గరుత్మంతుని, రేయింబవళ్లు నిందించుచు న్నది. మిక్కిలి వేదన గూర్చువారిని వారు మిగిలించినందున ఆమె నిందకు గురియైరి, ఎట్లనగా – మదనుని ప్రాణములతో మిగిలించినవాడు కావున శివుని, చంద్రుని మింగి వేయక క్రక్కుటవలన రాహువును, సేతుబంధనమున మలయ పర్వతమును గైకొనక పోవుటవలన శ్రీ రాముని, విరహి జన బాధాకరుడగు మన్మథుని కనుటవలన శ్రీ కృష్ణుని, మలయమారుత భక్షణ జేసెడి సర్పములను తినుట వలస గరుత్మంతుని నిందించినదని భావము.

సజయతి చిత్రచరిత్రో
యస్య హి వరచరణ పుష్కరకరేణుః
మహిషీం ఋషిసింహస్య
ప్రాజీజనదపి వృషోదయే హేతుః 50

ఎవని యొక్క మంచికాళ్లు తొండముగల కరేణువు వృషోదయ హేతువై ఋషిసింహమునకు సంబంధించిన గేదెను కనెనను విపరీతార్థము తోచుటయే ఇందలి చమత్కారము.

సమన్వయము – యస్య=ఏ శ్రీ రామచంద్రుని యొక్క వర=శ్రేష్ఠమైన చరణ పుష్కరక= చరణసరోజము యొక్క, రేణుః =ధూళి, వృషోదయే హేతుః =పుణ్యాభివృద్ధియందు హేతువై, ఋషి సింహస్య=ఋషి శ్రేష్ఠుడైన గౌతమునియొక్క మహిషీం=భార్యయైన అహల్యను, ప్రాజీజనత్=యథా రూపముకల దానిగా ఒనగూర్చెనో, చిత్రచరిత్రః సః =విచిత్ర చరిత్రగల ఆ శ్రీ రాముడు, జయతి=సర్వోత్కృష్టుడగుచున్నాడు.

శ్లో॥ రామం సీతాం లక్ష్మణం జీవికార్థే
విక్రీణీతే యో నరస్తంచ ధిగ్ధిక్
అస్మిన్ పద్యే యో ఽ పశబ్దాన్ న వేత్తి
వ్యర్థప్రజ్ఞం పండితం తం చ ధిగ్ ధిక్ 51

రాముని,సీతను, లక్ష్మణుని ఎవడు బ్రదుకుదెరువు నిమిత్తము అమ్ముకొనునో ఆ మనుజుని ధిక్కరింతును. ఈపద్యమునందలి అపశబ్దముల నెవడెరుగలేడో, వ్యాకరణము ,చదివియు నిరర్థక ప్రజ్ఞగల ఆ పండితుని సైతము ధిక్కరింతును.

"జీవికార్థేచాపణ్యే" అను పాణిని సూత్ర ప్రకారము అపణ్యార్థమున (పణ్యవస్తువులు కానట్టివానికి) క ప్రత్యయము వచ్చును. అప్పుడు రామకం సీతకాం లక్షణకమ్ అని అగును ఇవియే సాధురూపములు-రామం సీతాం లక్షణమ్ అనునవిపై పద్యమున దుష్టములు.

అకుబేరపురీవిలోకనం నధరాసూనుకరం కదాచ న
అథ తత్ప్రతికారహేతవేఽ దమయంతీపతిలోచనం స్మర 52

అకుబేరపురీవిలోకనమ్=కుబేరుని పట్టణము అలకానామకము, అలక పదమునకు ముంగురులని అర్థము వెంట్రుకలులేని స్త్రీ (ముండిత) యొక్క దర్శనము న ధరానసూనుకరమ్, ధరా సూను వు (భూపుత్రుడు)=అంగారకుడు, అంగారకునకు మంగళయను నామముకలదు కావున అమంగళమును కల్గించును అధతత్ప్రతికారహేతవే=అట్టి అమంగళము తొలగిపో నిమిత్తమై ,అదమయన్తీ పతిలోచనమ్=దమయంతీ పతియనగా నలుడు- నలుడుకాని వాడు అనలుడు, ఆనలుడు(అగ్నియే) నేత్రము గలవాడు శివుడు, అట్టి శివుని, స్మర=ధ్యానించుము.

గోకర్ణ రాడాభరణం యదీయం
యద్గవ్యహవ్యా దజమా దదాహ
కుంభేనచూడామణి రాదిగంతాత్

పాయా దపాయా దురగాత్మజార్ధః 53

గోకర్ణరాట్ - గోకర్ణ=సర్పములకు, రాట్=ప్రభువైనవాసుకి, యదీయమ్=ఏ శివునకు సంబంధించిన, ఆభరణమ్= భూషణమో, యత్=ఏ శివుని యొక్క (ఫాలమునందలి) గవ్య=ఘృతరూపమైన, హవ్య=హవిస్సును, అత్=తినెడి, అగ్ని గవ్యరూపంహవ్యం అత్తీతి గవ్యహవ్యాత్ అని వ్యుత్పత్తి అజమ్=మన్మథుని, ఆదదాహ=భస్మము జేసెనో (అట్టి), భేనచూడామణి : భ=నక్షత్రములకు, ఇన=రాజైన చంద్రుడు, చూడామణి :=శిరోభూషణముగాగలవాడు, అగాత్మజార్ద : ఆత్మజా=పార్వతీదేవి, అర్థ := తనశరీరార్థమందుగల, ఉ :=శివుడు ఆదిగంతాత్=దిగంతములవరకున్న కుం=భూమిని, అపాయాత్=ఉపద్రవము నుండి, పాయాత్=రక్షించుగాక! అపాయాత్+ఉః+అగాత్మజార్థః=అపాయాదురగాత్యజార్థః అని పదవి భాగము

గవీశపత్త్రో నగజార్తిహారీ
కుమారతాత : శశిఖండమౌళి :
లంకేశసంపూజితపాదపద్మ :
పాయా దపాయాత్ పరమేశ్వరో వ : 54

గవీశపత్ర : = నందికేశ్వరుడు వాహనముగాగలవాడు, నగజార్తిహారీ=పార్వతీదేవి, సంతాపమును దొలగించినవాడు, కుమారతాత: =కుమారస్వామి తండ్రి శశిఖండమౌళి := చంద్రమౌళి, లంకేశ సంపూజితపాద పద్మ :=రావణాసురునిచే పూజింపబడిన పాదారవిందములుగల, పరమేశ్వర :=శివుడు, వ :=మిమ్ములను, అపాయాత్=ఆపత్తునుండి, పాయాత్=రక్షించుగాక.

ఇందు విశేషణ విశేష్యపదములలో మొదటి అక్షరమును తొలగింతుమేని విష్ణు పరముగా అర్థము వచ్చును,గకారము తొంగించిన వీశపత్త్ర :=గరుడవాహనుడు, (వి+ఈశ :) ('న' కారము దొలగించిన) గజార్తిహారీ=గజేంద్రుని బాధను దొలగించినవాడు,(కుకారము తొంగించినచో)

మారతాత :=మన్మథుని తండ్రి, (శకారము దొలగించిన)శిఖండమౌళిః = నెమిలి పురి శిరోభూషణముగలవాడు,('లం' తొలగించినచో) కేశసంపూజిత పాదపద్మః =(బ్రహ్మరుద్రులచే పూజింపబడిన చరణ సరోజములుగలవాడు (కః+ఈశః)=కేశౌ) ప్రకారము దొలగించినచో) రమేశః=రమాపతియగు విష్ణువు, వః అపాయాత్ పాయాత్ =మిమ్ము నపాయమునుండి పాలించుగాత (ఈ శ్లోక మక్షరచ్యుతకము)

క ఇతి బ్రహ్మణో నామ,
ఈ శోహం సర్వదేహి నాం
ఆవాం తవాంగే సంభూతౌ 55
తస్మాత్ కేశవనామవాన్ (హరివంశము)

కః = అన బ్రహ్మ పేరు అట్టి బ్రహ్మ, సర్వ ప్రాణుల కీశ్వరుడనైన నేను నీ శరీరము నను దయించితిమి. కావున నీవు కేశవుడను పేరుగాంచితిని అని శివుడు విష్ణుమూర్తిని స్తుతించును

కాచి న్మృగాక్షీప్రియ విప్రయోగే
నిశీథినీపార సుపారయన్తీ
ఆగాతు మాదాయ కరేణ వీణామ్
ఉద్గీవ మాలోక్యశనై రహాసీత్ 56

ప్రియునియెడ బాటు పొందిన ఒక మృగాక్షి రాత్రిని గడుపలేనిదై వీణా గానము జేయ, చేత వీణ దీసికొని కంఠము నెత్తి నెమ్మదిగా ఆ వీణను విడిచి పెట్టెను.

మెడ పైకెత్తి చూడ చంద్రగతహరిణ మామెకగుపడెను. నా వీణా గానము నాలకింప చంద్రమండలమున నున్న జింక అచటినుండి దిగివచ్చును. అప్పుడు చంద్రుడు నిష్కళంకుడగును. బాధాకరుడైన ఆ చంద్రుడు నా ముఖముతో తులతూగవలసివచ్చును. నా శత్రువునకు నా ముఖ

సామ్యావకాశము నీయరాదని, వీణను విడిచిపెట్టినదని భావము.)

**ఉచ్ఛిష్టం శివనిర్మాల్యం వమనం శవకర్పటమ్**
**కాకవిష్ఠాసముత్పన్నాః పంచైతేఽతిప విత్రకాః** 57

ఎంగిలి శివుని నిర్మాల్యము, వాంతి పీనుగుబట్ట, కాకిరెట్టలో పుట్టినట్టిది. ఈ ఐదు అతి పవిత్రములు అని విరుద్ధార్థము.

సమన్వయముః- ఉచ్ఛిష్టమ్=(లేగ ఎంగిలిగలిగిన పాలు) శివ నిర్మాల్యమ్= శివుని జడలనునుండి ప్రవహించిన గంగ, వమనమ్=తేనె=(తేనెటీగల వాంతి రూపమైనది), శవకర్పటమ్=పట్టుబట్ట=(ఒక రకమైన పురుగుల నుండి సిద్ధమగునది.) కాక నిష్ఠాసముత్పన్నాః= రావిచెట్టు ఇవి పవిత్రములని భావము.

**సువర్ణస్య సువర్ణస్య సువర్ణస్య చ జానకి !**
**ప్రేషితా తవ రామేణ సువర్ణస్య చ ముద్రికా** 58

హనుమంతుడు సీతతో ఇట్లనెను - హే జానకి! = ఓ సీతాదేవీ! సువర్ణస్య= చక్కని నామాక్షరములుగలది. సువర్ణస్య = ఎనుబది రక్తికల పరిమాణము గలది, సువర్ణస్య= మంచి వన్నెగలది, సువర్ణస్య ముద్రికా = బంగారు ఉంగరము=తవ=నీకు, రామేణ=రామునిచే, ప్రేషితా=సంపబడెను.

**త్రైలోక్యే నోపమైతస్యాః సఖే కిమితి భాషసే**
**అనంతరా సానాది ర్వా న తృతీయేతి మే మతిః** 59

ఒక కాముకుడు తన మిత్రుని దగ్గర తన ప్రేయసిని గూర్చి తెగ బొగడుచుండ మిత్రుడు కాముకునితో నిట్లనుచున్నాడు.

హేసఖే!= ఓ మిత్రమాః ఏతస్యాః = ఈ నీ ప్రేయసికి, ఉపమా= ఉపమానము, త్రైలోక్యే=ముల్లోకములందును, న ఇతి= లేదని కిమ్=ఏల, భాషసే=భాషింతువు? సా=ఆ యువతి, అనంతరావా=అనంతరురాలైన కావచ్చును, (లేక) అనాదిర్వా=అనాదియైన కావచ్చును. తృతీయాన

ఇతి=మూడవది లేదని, మేమతిః = నా తలంపు సుమా!

ఇటః- అనంతరా అనాదిర్వా ఉపమా అనుచోట చమత్కారము కలదు. నీ వుపయోగించిన 'ఉపమా' పదముననే ఇద్దరి పోలికలు కలవని అతడు నిరూపించుచున్నాడు.

అనంతరా= నడిమి వర్ణములేనిది, ఉపమా పదము మధ్యనున్న పకారము తొలగించినచో ఉమాయగును. నీ ప్రేయసి ఉమాదేవికి (పార్వతికి) సాటి వచ్చును. - ఇట్లు కాదందువేని అనంతరా అనాదిః=నడిమి వర్ణము మొదటి వర్ణము లేనిది - ఉపమాపదము నుండి ఉరార పకారములు తొలగించినచో 'మా' యగును. నీ ప్రేయసి మాదేవికి (లక్ష్మి కి)సాటి కావచ్చును. ఇక పోలికకు దగిన మూడవ వ్యక్తి ముల్లోకములలో లేదు. నీ ప్రేయసి ఉమాతుల్యురాలు, మాతుల్యురాలని భావము.

**రాజన్ కమలపత్రాక్ష తత్ తే భవతు చాక్షయమ్**
**ఆసాదయతి యద్ రూపం కరేణుః కరణై ర్వినా 60**

నలినదలాక్ష!= ఓ నరపతీః కరేణువు= (ఆడ యేనుగు) కరచరణా ద్యవయములు లేని యే రూపమును పొందించునో అట్టి అక్షయ రూపమును పొందుమని . సామాన్యార్థము.

ఇట 'కరణైః వినా కరేణుః అను తావున వ్యాకరణ నియమము కలదు. కరణైః వినా కరేణుః=అర్ధ కకారము అర్ధరేఫ అర్ధణకారము (క్, ర్, ణ్) కరేణు పదమునుండి తొలగించున యెడల, అ.ఏ.ఉః అను అక్షరములు మిగులును. అప్పుడు - అ+ఏ=(వృద్ధిరాదైచ్' అను సూత్రప్రకారము వృద్ధి రాగా) ఐ అగును, ఐ+ఉః= ఏచోయవాయావః అను సూత్రప్రకారము ఆయ్ అనునది అదిష్టముకాగా) ఆయుః అను రూప మేర్పడును మహారాజా! నీకు దీర్ఘాయువు కలుగుగాతయని కవి తాత్పర్యము.

**అట్టశూలా జనపదాః శివశూలా శ్చతుష్పథాః**
**ప్రమదాః కేశశూలిన్యః భవిష్యంతి కలౌయుగే 61**

అట్టమన్నం శివో వేదః బ్రాహ్మణశ్చ చతుష్పథః, కేశో భగ ఇతి ప్రోక్తః శూలో విక్రయ ఉచ్యతే అని నిఘంటువు.

కలౌ యుగే=కలియుగమునందు

జనవదాః అట్టశూలాః భవిష్యంతి=గ్రామాదులు అన్న మమ్ముకొనునని అగును.

చతుష్పథాః శివశూలాః భవిష్యంతి=బ్రాహ్మణులు వేదముల నమ్ముకొను వారయ్యెదరు.

ప్రమదాః కేశశూలిన్యః భవిష్యంతి=యువతులు మానము నమ్ముకొందురు

అట్టము=అన్నము, శూలము= అమ్ముట, శివము=వేదము, చతుష్పథులు=బ్రాహ్మణులు, కేశము=భగము.

**అహి రిపుపతికాంతాతాతసంబద్ధకాంతా-**
**హరతనయనిహంతృప్రాణదాతృధ్వజస్య**
**సఖిసుతసుతకాంతాతాతసంపూజ్యకాంతా-**
**పితృశిరసిపతంతీ జాహ్నవీ నః పునాతు.** **62**

అహి రిపు =నాగారియైన గరత్మంతుని యొక్క, ప్రభు=స్వామియైన విష్ణువు యొక్క, కాంత=భార్యయైన లక్ష్మీ దేవికి, తాత=తండ్రియగు సముద్రుడు, బద్ధ=సేతువుచే కట్టబడినవాడుగాగల శ్రీ రాముని యొక్క, కాంతా=భార్యయైన సీతను, హర=అపహరించిన రావణుని యొక్క,తనయ కుమారుడగు ఇంద్రజిత్తును, నిహంతృ =చంపిన లక్ష్మణుని యొక్క, ప్రాణదాతృ=మూర్ఛనొందగా సంజీవినిచే ప్రాణములుగాపాడిన హనమంతుడు, ధ్వజస్య=టెక్కముగాగల అర్జునుని యొక్క, సఖి=మిత్రుడైన శ్రీ కృష్ణుర్జుని యొక్క సుత=పుత్రుడైన మన్మథుని యొక్క, ఎసుత=కుమారుడగు కాంతా=భార్య యైన ఉషాసుందరి యొక్క,తాత=తండ్రియైన బాణాసురునకు సంపూజ్య=పూజనీయుడైన శివుని, కాంతా పత్నియగు పార్వతికి, పితృ=తండ్రియగు హిమవంతుని యొక్క శిరసి=మౌళియందు

పతంతీ=పడుచున్న, జాహ్నవీ= గంగానది, నః=మనను. పునాతు=పావనము జేయుగాత.

సువర్ణాలంకృతా నారీ హేమాలంకృతివర్జితా
సా నారీ విధవా జాతా గృహే రోదితి తత్పతిః 63

సువర్ణాలంకృతురాలైనను బంగారు నగలు లేనిది మరియు ఆ స్త్రీ విధవ కాని ఇంటిలో ఆమె భర్త, ఏడ్చెడివాడు.

సువర్ణాలంకృతా- హేమాలంకృతవర్జితా=బంగారు అలంకారములు లేకున్నను తన శరీర తళతళాత్కారముచే ప్రకాశించుచున్నది, సా నారీ విధవా జాతా=కాని ఆమె అనేక విటులుగలది. కావున, గృహే తత్పతిః రోదితి= ఆమె భార్త తన భర్య చెడునడత జూచి బజారులో తలయెత్తుకొనలేక ఇంటిలోనే పడి ఏడ్చుచున్నాడని భావము.

వాతాచ్ఛీతి రరిధ్రోరం వో హరతా న్మహానురీదయితః
వ్రీడవ్రాజ్యా నౌకా వార్వాహాభోఽసమస్తానః 64

**పదవి భాగముః**- వాతాచ్ఛీతిః, అరిధ్రః, అరం, వః, హరతాత్, మహానుః, ఈదయితః, వ్రీడవ్రాజ్యాః, నౌకాః, వార్వాహాభః, అసమస్తానాః
(వాతం అత్తీతి వాతాత్, శీతిః యస్య సః వాతాచ్ఛీతిః అని విగ్రహము) వాత=వాయువును. అత్=తినెడి ఆదేశము నియందు, శీతిః=పవ్వళింపుగలవాడు, అరిధ్రః=అంచులుగల చక్రమును ధరించినవాడు, మహా అనుః=గొప్ప ప్రాణశక్తిగలవాడు,నౌకా, న=నవార్యుడే, ఓకాః=నివాసస్థానముగలవాడు, వార్వాహాభః=వార్వాహ=జలమును వహించు మేఘము యొక్క, ఆభః కాంతివంటి కాంతిగలవాడు, అసమస్తానాః, అసమస్త=ఖండిపబడిన, అనాః=శకటాసురుడుగల, ఈదయితః ఈ=లక్ష్మి యొక్క, దయితః=భర్తయైన నారాయణుడు, వః=మీ యొక్క, వ్రీడవ్రాజ్యాః, వ్రీడ= అజ్జావహములైన (వ్రీడయంతీవ్రీడాః), వ్రాజ్యాః=అజ్ఞానమువలన

కలిగిన సంసార పరిభ్రమణములను అరమ్=అవిలంబముగా, హరతాత్=తొలగించుగాత.

**అంబరమంబునిపత్త్రమరాతిః**
**పీత మహీనగణస్య దదాహ**
**యస్య వధూ స్తనయం గృహ మబ్జా**
**పాతు స వో హరలోచన వహ్నిః** 65

ఇందు అన్వయక్లేశముగలదు. ఆలోచించి సమన్వయము చేసికొనవలయును.

అన్వయముః- యస్య అంబరం పీతమ్, యస్య గృహం అంబుని, యస్య పత్త్రమ్ అహీనగణస్య అరాతిః, యస్య వధూః అబ్జా, యస్య తనయం హరలోచనవహ్నిః దదాహ, సః వః పాతు.

యస్య అంబరం పీతం=ఎవనియొక్క వస్త్రము పచ్చగానున్నదో, యస్య గృహమ్ అంబుని= ఎవని నివాసము నీటి యందే విలసిల్లునో, యస్య పత్త్రమ్ అహీన గణస్య అరాతిః= ఎవని వాహనము సర్పసందోహమునకు శత్రువో, యస్య వధూః అబ్జా= ఎవని భార్య క్షీర సాగర కన్యకయో, యస్య తనయం హరిలోచన వహ్నిః దదాహ=ఎవని కుమారుని (మదనుని) శివుని ఫాలలోచనా నలము భస్మముజేసెనో, సః వః పాతు=అట్టి విష్ణువు మిమ్ము బ్రోచుగాత.

**లంబోదర తవ చరణౌ ఆదరతో యో న పూజయతి**
**న భవతి విశ్వామిత్రో దుర్వాసా గోతమ శ్చేతి** 66

లంబోధర!=వినాయకా, యః=ఎవడు తవ చరణౌ=నీ పాదములను ఆదరతః=ఆదరమున న పూజయతిః=పూజించడో, సః=వాడు, విశ్వామిత్రః భవతి=విశ్వామిత్రతడగును, దుర్వాసాః భవతి=దుర్వాసుడగును, గోతమశ్చ భవతి=గౌతముడగును ఇతి (వదామి) యని యందును.

నీ పూజ నాదారమున జేయనివాడు విశ్వామిత్రుడో, దుర్వాసమునియో- గౌతమమునియో యగునని మొదట విపరీతార్థము స్ఫురించును, విశ్వ+అమిత్రః అని సంధి చేసికొనవలయును. నీ పూజ జేయనివాడు జగద్ద్రోహియే సుమా అనగా జగద్ద్రోహపరునకు నీ పూజ గిట్టదు. నీ పూజ జేయమి కుచేలత్వమబ్బును. నీ పూజ .జేయనివాడు అత్యంత పశువు.

దుష్టం వాసః యస్యసః దుర్వాసాః=చింపిరి లేక మాసిన బట్టలు గల వాడు. గౌః గోతమః =పూర్తిగా పశువు.

గోగజవాహన భోజనభక్ష్యో-
ద్వాతసమిత్రసపత్నజశత్రోః
వాహనవైరికృతాసనతుష్టా
మామిహ పాతు జగత్త్రయజుష్టా 67

గోగజ ............ శత్రోః (గవాగచ్ఛతీతి గోగః గోగాత్ జాయత ఇది గోగజః) గోగ=నందిపై పయనించెడి శివునివలన జ=పుట్టిన కుమారస్వామి యొక్క-వాహన= వాహనమైన నెమలికి, భోజన=ఆహారమైన సర్పమునకు, భక్ష్య=తిండియైన వాయువు వలన, ఉద్వాత=పుట్టిన హనుమంతుని, స=పాలించు (హనుమంతుడు సుగ్రీవసేవకుడు) సుగ్రీవునకు, మిత్ర=ఆప్తుడైన శ్రీరాముని యొక్క, సపత్న=శత్రువగు రావణునివలన జ=పుట్టిన ఇంద్రజిత్తుయొక్క, శత్రోః =విరోధియైన ఇంద్రునియొక్క, వాహన ........ దుష్టా -వాహన ఏనుగునకు వైరి= రిపువైన సింహమునందు, కృత=ఏర్పరచుకొనబడిన, ఆసన=ఆసనమున కూర్చొని, తుష్టా=అందరికంటె మిన్నది కావున సంతోషించునట్టిది, (కావున) జగత్త్రయ జుష్టా=ముల్లోకములంచే సేవింపబడునట్టి దుర్గాదేవి, ఇహ=ఈ లోకమున, మాం =నన్ను, పాతు=పాలించుగాత!

ద్రాగర్థ ప్రతీతి లేక పోవుటయే ఇందు చిత్రము.

**నృసింహదేవే చలితే భరేణ ప్రత్యర్థిభూతై : క్రియతే భరేణ**
**కంఠే కుఠార : కమఠే ఠకార : శేషే ఢకార : తపనే చకార : 68**

నరసింహరాజు శత్రువులపై మహా సైన్యముతో దండెత్తి వెళ్లగా - శత్రు రాజులు తమ తమ సైన్యముతో పలాయనము జెప్పుచు కంఠమున కుఠారమును కమఠమున (కూర్మమునందు) ఠకారమును, శేషునియందు ఢకారమును, సూర్యునియందు చకారమును మోపిరి.

కంఠేకుఠాకుఠార : అనుటవలన=ఒకరినొకరు పట్టక వారు పారిపోవునప్పుడు కుఠారఘూత బాధ ననుభవించిరని, కమఠే ఠకార : లనుట వలన భూభారము మోయు ఆది కూర్మము ఆ సైన్య భార గురుత్వము వలన తన యంగ సమ్మర్దమగు నేమో యను భీతితో తన పాణి పాదమును సంస్కృత లిపియందలి 'ఠ' కారము వలె మండలాకారముగ ముడుచు కొనెనని శేషే ఢకార : అనుటవలన, అది శేషుడును ఒకే ప్రదేశమున అంత సైన్య భారమేర్పడుట వలన మెడను వంకర జేసి కుండలకారముగ సంస్కృత లిపియందలి 'ఢ' కారమువలె నుండెనని, తపనే చకార : అనుటవలన, చకారమునకు సముచ్చయ మర్థమున్నందున, సముచ్చయమన సముదాయము కావున అతని శత్రువులకు ఆకాశము శత సూర్యముగా నగుపడెనని సమన్వితార్థము.

**గతాసా కిం స్థానం పథి సహ తయా కా స్థితవతీ**
**నృపేణేత్థం పృష్టా సఖి చతురదూతీ స్థితవతీ**
**విలోక్యాలంకారం నిజ మథ చ శాకం నరపతిం**
**నిరాకాంక్షం చక్రే కథయ కథ మేతత్ ప్రభవతి 69**

ఒకరాజు ఒకనాయికను ఇంటికి తెప్పించుకొనెను. ఇంతలో ఆమె భర్త రాక నెరిగి ఒక పరిచారిక ద్వారా ఆ నాయికను ఆమె ఇంటికి పంపించెను. ఆ పరిచారికయు ఆమె నింటజేర్చి తిరిగి తన దగ్గరకు రాగా,

ఆ రాజు ఆ పరిచారిక నిట్లు ప్రశ్నించెను.

సఖి= ఓ ఆప్తురాలా ! సా స్థానం కిం గతా=ఆ యువతి నివాసము జేరి కొనినదా? పథి, తయా సహ కా స్థితవతీ=త్రోవలో ఆమెతో ఎవతె యుండెను (ఆమెకు తోడుగా దారి నెవరు జూపిరి) ఇత్థం నృపేణ పృష్టా=ఇట్లు రాజుచే ప్రశ్నింపబడిన, స్థితవతీ చతురదూతీ = అతని ముందు నిలిచిన నేర్పరియైన దూతిక, నిజం అలంకారం అథచ శాకం విలోక్య=తనయలంకారమును మరియు శాకమును చూచి (చూపి) నరపతిం నిరాకాంక్షం చక్రే = రాజును తిరిగి ప్రశ్న వేయని వానిగా నొనరించెను, ఏతత్ కథం ప్రభవతి కథయ=అలంకార శాకావలోకనము నరపతిని ఆకాంక్షారహితు నెట్లు జేయ జాలును ? విశదీకరింపుము

ఆభరణ. విశేషమునకు 'పోహెూంచి' యని, శాక విశేషమునకు 'మేథీ' యని మహారాష్ట్ర భాషలో పేరు పోహెూంచీయనగా 'చేరినదని' మేథీయన 'నేనుంటి' నని అర్థము అమె ఇల్లు జేరెనా యను అతనిప్రశ్నకు ఆభరణము (పాహెూంచీ) ద్వారా చేరినదని, ఆమెవెంట ఎవరుండిరను రెండవ ప్రశ్నకు శాక విశేషము (మేథీ) ద్వారా నేనుంటినని ఆ చతురదూతిసమాధానమొసగెను. కావున రాజు ఆకాంక్షరహితుడాయెనని భావము

ఇందీవరాక్ష్యా స్స్ఫుటవిద్రుమోష్ఠ్యాః
సంకేత ముద్దిశ్య వనే చరంత్యాః
చోరై స్సమస్తాభరణాని హృత్వా
నాసామణి ర్నోఽ పహృత : కిమేతత్ 70

కలువలవలె నల్లనైన కనులతో, పగడమువలె నెఱ్ఱగానున్న క్రిందిబెదవితో నొక సొగసులాడి ప్రియుని సంకేత స్థలము నుద్దేశించి అడవిలో తిరుగుచుండ దొంగలు డాసి ఆమె యాభరణము లెల్ల నెల్చుకొని నాసామణిని (ముత్తెపు ముక్కుపోగు) మాత్రము నపహరింపక విడిచి

పోయిరి,దొంగలు నాసామణి నపహరింపమి కతం బేమి ?

ఇందీవరాక్షీ స్ఫుటవిద్రుమోష్ఠీ అను పదములు సాభిప్రాయములు ఆమె ముక్కుపోగుపై మంచిముత్తెము పొదగబడి యుండెను. అమె కలువకంటి కావున, ఆ కనులలోని నల్లని డాలు ముత్తెముపై సంక్రమించి యుండెను . అందువలన ముత్తెమయొక్క పై భాగము నల్లగాను, ఆమె విద్రుమోష్ఠియగుటచే పెదవియొక్క ఎఱ్ఱని డాలు ముత్తెము క్రింది భాగమున సోక, ఆ క్రింది భాగము ఎఱ్ఱగాని చూపరుల కగుపడు చుండెను. అందువలన దొంగలు దానిని గురి గింజ యనుకొని విడిచి పోయిరి. ఇదియే కారణమని తాత్పర్యము.

**రామం వానరవాహినీం పురరిపుం రాహుం రవే స్సారథిం**
**కుంభీగర్భసముద్భవం మురరిపుం మారస్య మౌర్వీరవమ్**
**తన్వీ నూతనపల్లవై ర్విరచితే శయ్యాతలే శాయినీ**
**సఖ్యా వీజితతాలవృంతపవనా బాలా ముహుర్నిందతి 71**

నూతనపల్లవై ః విరచితే శయ్యాతలే శాయినీ=క్రొంజిగురుటాకులతో గూర్చబడిన సెజ్జపై మేను వ్రాల్చినట్టిది, సఖ్యా వీజితతాలవృంత పవనా=చెలి కత్తెచే విసనకఱ్ఱతో చల్లగా వీచబడునట్టిది, తన్వీ=ప్రియుని విరహమున కృశించి పోయిన, బాలా=లేబ్రాయమున నున్న నాయిక, రామం వానరవాహినీం పురరిపుం రాహుం రవేస్సారథిం కుంభీగర్భసముద్భవం మురరిపుం మారస్యమౌర్వీరవమ్=రాముని, వానరసైన్యమును, శంకరుని, రాహువును, సూర్యసారథిని, అగస్త్యుని, విష్ణువును మరియు మన్మథుని శింజారవమును, ముహుః నిందతి=మాటిమాటికి నిందించుచున్నది.

శీతలోపచారములవలన ద్విగుణీత వ్యథయైన విరహిణి కోకిల జాతిని బెంచుకాకమును (అసురుని) చంపక విడిచిపెట్టుటచే శ్రీ రామచంద్రుని, సేతువుకట్టునప్పుడు మలయ పర్వతమును పెకలించి గొంపోనందున వానరసైన్యమును, మదనుని ప్రాణావశిష్టుని జేయుటచే శివుని, చంద్రుని పూర్తిగా మ్రింగనందున రాహువును, సూర్యుని పశ్చిమ

పర్వతము జేర్చి రాత్రి రాక కవకాశమిచ్చిన సూర్యసారథిని, చంద్రో త్పత్తి కారణుడైన సాగరమును త్రాగి విడుచుటచే అగస్త్యుని, విరహి వ్యథాకరుడైన మన్మథుని గనుటచే విష్ణువును - గర్హించినదని భావము.( కోకిలాదులు కామోద్దీపకములను విషయము అలంకారశాస్త్రప్రసిద్ధము.

చంచద్ద్వాదశ నీలనీరజయుతం సప్తాంబుజోద్భాసితం
నిత్యం షోడశశోణపద్మరుచిరం ధాత్రాఽనిశం సేవితమ్
క్షీరాంభోధిగృహం సహస్రదలసత్పర్యంకవిశ్రాంతి యత్
పాయాద్వః కమలాంగసంగిశయనం తన్నీలరోచిర్మహః 72

యత్=ఏవిష్ణురూప తేజస్సు, కమలాంగ సంగిశయనమ్=లక్ష్మీ శరీర సంసక్తమైన శయనముకలదో, క్షీరాంభోధి గృహమ్=క్షీరసాగరము నిలయమైనదో, సహస్రదలసత్పర్యంకవిశ్రాంతి=వేయి పడగలుగల శేషరూపమైన తల్పమున విశ్రమించునదో, అనిశం ధాత్రా సేవితం=ఎల్లప్పుడు బ్రహ్మచే సేవింపబడునదో, షోడశశోణపద్మరుచిరమ్=పదునారు ఎఱ్ఱ తామరలతో మనోజ్ఞమైనదో (షోడశశోణ పద్మములన- విష్ణుమూర్తి 4 భుజములు, 2 పాదములు, బ్రహ్మదేవుని 2 పాదములు; 4 చేతులు; లక్ష్మీదేవి 2 పాదములు, 2 చేతులు, మొత్తము 16 సామ్యము వలన పద్మములని చెప్పబడినవి) సప్తాంబుజోద్భాసితమ్=ఏడు తామరలతో విలసిల్లునట్టిదో (ఏడు తామరలు - 1 విష్ణు ముఖము; 1 అతని నాభికమలము, 1 లక్ష్మి ముఖము, 4 బ్రహ్మముఖములు-మొత్తము 7) చంచత్ ద్వాదశ నీలనీరజ యుతమ్=వింసిల్లెడి పండ్రెండు నల్లగల్వలతో కూడుకొనినదో, (8 బ్రహ్మకనులు, 2 విష్ణుమూర్తి కనులు, 2లక్ష్మీదేవి కనులు, మొత్తము 12) నిత్యమ్=స్థిరమైనదో, తత్=అట్టి నీలరోచిః=నల్లని కాంతిగల మహః=విష్ణురూప తేజస్సు, వః=మిమ్ము పాయాత్=పాలించుగాత!

గౌరీక్షణం భూధరజాహి నాథః

**పత్త్రం తృతీయం దయితోపవీతమ్**
**యస్యాంబరం ద్వాదశలోచనాఖ్యః**
**కాష్ఠాసుత ః పాతు సదాశివో వ ః** 73

'అంబరమంబుని పత్త్రమరాతిః' అను శ్లోకమునందు వలె ఇందును అన్వయ క్లేశమున్నది. ఇందిదియే చిత్రము

అన్వయముః- యస్య గౌః పత్త్రమ్, యస్య ఈక్షణం తృతీయమ్, యస్య భూధరజా దయితా, యస్య అహి నాథ ః ఉపవీతమ్, యస్య అంబరం కాష్ఠాః యస్య సుత ః ద్వాదశలోచనాఖ్యః స ః సదాశివ ః వ ః పాతు.

యస్య గౌ ః పత్త్రమ్=ఎవనికి నందియే వాహనమో, యస్య ఈక్షణం తృతీయమ్=ఎవనికి కన్ను మూడవదో అనగా ఎవని మూడవకన్ను పంచభూతములో జేరిన తేజో భూతమగు అగ్నియో, యస్య భూధరజా దయితా=ఎవని భార్య పార్వతి యో యస్య అహి నాథః ఉపనీతమ్, ఎవని యజ్ఞోపవీతంనాగరాజో, యస్య అంబరం కాష్ఠా ః =ఎవనికి దిక్కులే వస్త్రమో, యస్యపుతః ద్వాదశలోచనాఖ్యః = ఎవని పుత్రుడు షణ్ముఖుడో (కుమారస్వామి) స ః సదాశివ ః వ ః పాతు=అట్టి సదాశివుడు మిమ్ము రక్షించుగాత! (పత్త్ర పదమునకు ఆకు, ఱెక్క, వాహనమను అర్థములున్నవి).

**నేతు ః ప్రయాణోన్ముఖతాం సమీక్ష్య**
**నక్షత్రముక్తావలి మస్య కంఠే**
**అధారయ త్సా, సతు వాసరాణాం**
**సంఖ్యాపరోఽభూత్ సఖి కోఽత్ర భావ ః** 74

సా=ఆ నాయిక, నేతు ః ప్రయాణోన్ముఖతాం సమీక్ష్య=తన నాయకుడు ప్రయాణాభిముఖుడగుట చూచి, అస్య కంఠే=ఇతని (అతని) కంఠమునందు, నక్షత్రముక్తావలిం=చుక్కల (ముత్తెముల) పేరును ఆతడును వాసర సంఖ్యాసంసక్తుడగుటకు సంబంధ మేమి ? వారి యుద్దేశమేమై యుండునని ఆ విషయము జూచిన ఒక పరిచారిక తన చెలిని ప్రశ్నించెను.

నీవు చుక్కలు పొడము చుండగా రావలయును సుమా యని

నక్షత్రమాల మెడలో వేసిన నాయిక అభిప్రాయము, అత్యవసర కార్యమున్నందున వెళ్లవలసి వచ్చినది, త్వరగా ఈ వారములోపలనే వచ్చెదను అని వాసర సంఖ్యజేయు అతని అభిప్రాయము. వారమునకు 7 దినము లుండుటవలన ఈ మధ్యలో తప్పనిసరి వచ్చెదనని సారము.

**కుధ్రేనసుప్రీనయ నాశ్రయాశదగ్ధోన్మదాః దర్దురహర్షకాలే**
**స్వజన్మభక్షప్రియభోజనాశా నృత్యంతి భీమానుజగోజభాజః 75**

కుధ్ర=భూమిని ధరించు పర్వతములకు, ఇన=రాజైన హిమవంతుని సూ=కూతురైన పార్వతిని ,ప్రీ=రమింపజేయు శివునియొక్క, నయన = నేత్ర రూపమైన, ఆశ్రయాశ=అగ్నిచే, దగ్ధ=కాల్చబడిన మదనునిచే ఉన్మదాః =ఉన్మత్తములై, స్వజన్మభక్ష=తమనుండి పుట్టిన పిల్లలను భక్షించుపాములను, ప్రియముగా తినుటయందు కోరికగల నెమళ్లు, భీమానుజ=భీముని తమ్ముడు అర్జునుడు, ఇట్టి పేరుగల (ఏరుమద్ది)గోజ=భూమియందు పుట్టిన వృక్షములను భాజః =అధిష్టించినవై, దర్దురహర్షకాలే= కప్పలకు సంతోషదాయకమగు కాలమున (వర్షాకాలమున) నృత్యంతి=నృత్యము చేయుచున్నవి.

**శరధి శ్శరధిర్ యస్య సరథః కురర శ్శరః**
**బభూవ సశ్శం భవతాం కుర్యాత్ భరతలక్ష్మణః 76**

('సశ్శం భరతలక్ష్మణః అనునవి అపశబ్దములవలె స్ఫురించుచున్నవి కావున ఇది అపశబ్దాభాసము.)

యస్య=ఏ శివునకు, శరధిః =సముద్రము, శధిః =అమ్ములపొది, బభూవ =ఆయెనో, (ఇది అంతటను అన్వయించును. ) కుః =భూమి, రథః=అరదమాయెనో, సః=విష్ణువు, శరః=బాణమాయెనో,భరతలక్ష్మణః=భ-రత= తారకాప్రియుడగు చంద్రుడు (భేషురత ః భరత ః తారాప్రియః) లక్ష్మణః =లాంఛనముగల, సః =అట్టి అరః=శివుడు, భవతాం=మీకు, శం=శుభమును, కుర్యాత్ =చేయుగాక !

(శరపదమునకు బాణము, నీరు, రెల్లుగడ్డియను అర్థములు కలవు)

**చక్రే తచ్ఛత్రుమిత్రే పురజయసమయే స్యందన స్తత్పదాంక -**
**ద్వైతీయాకాంబుజాక్షీ శరధిరపి స గౌః తత్ప్రజాతాధినాథః**
**కాండా స్త జ్జాత జాతా ననకుహరచరాః జ్యాచ తన్మస్తచక్రీ**
**యస్యాభూత్ సోవతాన్న శ్శిశిరకరకలోల్లాసమౌళి ర్మ హేశః77**

యస్య=ఎవనికి, పురజయసమయే=త్రిపురాసురుల జయించు సమయమున, చక్రే=రథ చక్రములు, తచ్ఛత్రుమిత్రే=చంద్ర సూర్యులైరో, స్యందనః=రథము, తత్పదాంక .....అంబుజాక్షీ, తత్పద=ఆ చక్రము= (చక్రపద వాచ్యమగు సుదర్శనము) అంక= లాంఛనముగల విష్ణువు యొక్క ద్వైతీయాకా అంబుజాక్షీ =రెండవ భార్యయైన భూమి (శ్రీ భూనీలాదేవులు విష్ణుమూర్తి భార్యలు కావున భూమి అతనికి రెండవ భార్య) ఆయెనో, శరధిః అపి = అమ్ములపొదియు ,సః =ఆశరధియే (శరధి యన సముద్రము) ఆయెనో, తత్ప్రజాతాధినాథః తత్= ఆ శరధి యందు, ప్రజాతా = పుట్టిన లక్ష్మికి అధినాథః =పతియైన విష్ణువు, గౌః =బాణమాయెనో, కాండాః=గుఱ్ఱములు తజ్జాత జాతాననకుహరచరాః తత్= ఆకాండమునందు (నీటియందు) (కాండ పదమునకు నీరను అర్థముకూడ నున్నది) జాత =పుట్టిన కమలమందు, జాత =పుట్టిన బ్రహ్మయొక్క, ఆననకుహర= గుహలవంటి మోములందు, చరాః= సంచరించు వేదములాయెనో, జ్యాచ=వింటినారియు, తన్మస్తచక్రీ=తత్ =ఆ శివునియొక్క, మస్త=తలయందున్న, చక్రీ=సర్పమైన వాసుకి, అభూత్ =ఆయెనో, సః=అట్టి, శివుడు, నః =మనను, అవతాత్ =రక్షించుగాక! ఇందుపదవైచిత్రియే గాక విష్ణువు మరియు అతనికి సంబంధించినవి శివుని యుపకరణములగుటయు చమత్కారము.)

**పానీయం పాతు మిచ్ఛామి త్వత్తః కమలలోచనే !**
**యది దాస్యసి నేచ్ఛామి నోచేత్ దాస్యసి దేహి మే 78**

ఒక నాయకుడు ఒక నాయికను ఇట్లడుగుచున్నాడు -

ఓ కమల లోచనా ! నీనుండి పానీయము త్రాగదలచు చున్నాను, నీ విచ్చినచో నేను త్రాగనొల్లను, నీవీయనిచో త్రాగెదను.

ఇట పూర్వాపరవాక్యార్థములకు వైరుధ్యమున్నది మొదట ఇవ్వుమని అడిగినీ విచ్చినచో నే నొల్లను, ఇవ్వకున్నచో త్రాగెదననుట అయుక్తముకదా -కావున క్రింది రీతి సమన్వయించవలసి యున్నది, దాసీ+అసి= దాస్యసి యని సంధి, త్వం దాసీ అసియది అహంపాతుం న ఇచ్ఛామి=నీవు దాసి (నీచ) వైనచో నేను త్రాగ నొల్లను త్వం దాసీ న అసిచేత్ అహం త్వత్తః పానీయం పాతుం ఇచ్ఛామి=నీవు దాసివి కాకుందువేని నీ నుండి త్రాగదలంతును. ఇది ఒక రకముగా సమన్వితమగును, కాని ఇట కూడ చిక్కున్నది. మొదట పానీయమివ్వుమని అడిగినవానికి పిదప ఆమె నీచురాలను ధర్మ సందేహ మేల కలిగెను ? మరియు కమలలోచనా యను సంబోధన తాత్పర్యమేమి ? ఆమె కనులు ఎట్లున్న అతనికేమి ప్రయోజనము? ఇందువలన అతని అభిప్రాయ మేమన - దేయం పానీయం అహం పాతుం నేచ్ఛామి=నీ చేతినుండి ఇచ్చెడి క్షీరాది పానీయము నేను త్రాగదలచ లేదు. అదేయం పానీయం పాతుం ఇచ్ఛామి= చేతితో నీయ రాని పానీయమునే అనగా నీ యధరామృతమునే నే గ్రోలదలతును. దాని నీయుమని అతని భావము.

**దాసాయ భువననాథే బదరీ మపనేతు మాదిశతి**
**హేమన్తే హరిణాక్షీ పయసి కుఠారం వినిక్షిపతి 79**

భవననాథే=ఇంటి యజమానుడు, బదరీం=గుబురుగా పెరిగిన ..జిట్టరేగును.,  అపనేతుమ్=తొలగించుటకై (కొట్టివేయ ) దాసాయ=సేవకునకు, ఆదిశతి-సతి=ఆనతీయగా, హరిణాక్షీ=లేడికంటియగు మత్తకాశిని, హేమంతే=హేమన్త ఋతువునందు, కుఠారమ్=గొడ్డలిని, పయసి=లోతైన నూతి నీటిలో, వినిక్షిపతి =పడవేయుచున్నది.

గృహపతి రేగుగొట్టి వేయుమని సేవకునాజ్ఞాపించుటకునాయిక

నూతిలో గొడ్డలి పారవేయుటకు సంబంధము విచారింపవలెను. హేమంతమున చలి బాగుగా విసరును. గొడ్డలి నూతిలో పారవేసినచో చలి భయమున నూతిలో మునిగి గొడ్డలి తీయ నెవరును పూనుకొనరు. గృహపతి రేగు చెట్టును గొట్టివేయుమనిన వెంటనే ఆమెబెదరి గొడ్డలి నూతిలో బడవేసినది రేగుచెట్టుక్రింద విటుని పొందున దేలుచు అతనివలన కలిగిన నఖక్షతాదులను రేగు కంపవలన కలిగినవని బొంకుచుండెను. తన రహస్యముకాపాడెడి రేగుచెట్టు కొట్టివేయబడినచో-తన గుట్టు బట్టబయలగునని భయపడిగొడ్డలి పారవేసి-తనను, తన సంకేతస్థలమును కాపాడుకొనెనని తాత్పర్యము.

(ఇందు నాయిక యొక్క క్రియావిదగ్ధత సూచింపబడినది).

**శేతే శీతకరోఽంబుజే కువలయద్వంద్వాత్ వినిర్గచ్ఛతి**
**స్వచ్ఛా మౌక్తికసంహతిర్, ధవలిమా హైమీం లతా మంచతి.**
**స్పర్శాత్ పంకజకోశయో రభినవా యాంతి స్రజః క్లాంతతామ్**
**ఏషోత్పాతపరంపరా మమ సఖే ! యాత్రాస్పృహాం కృంతతి 80**

ఒక నాయకుడు తన ప్రయాణమేలనాపికొనవలసి వచ్చినదో-ప్రశ్నించిన తన మిత్రునకు క్రిందిరీతి తెల్పుచున్నాడు.

శీతకరః అంబుజే శేతే= చంద్రుడు తామరయందు పవ్వళించి యున్నాడు. స్వచ్ఛామౌక్తిక సంహతిః కువలయద్వంద్వాత్ వినిర్గచ్ఛతి= తెల్లని ముత్యముల పంక్తి నల్లకలువలజంటనుండి జాలు వారుచున్నది; ధవలిమా హైమీం లతామ్ అంచతి=తెల్లదనము బంగారుతీగెను పొందుచున్నది, అభినవాః స్రజః పంకజకోశయోః స్పర్శాత్ క్లాంతతాం యాంతి=అప్పుడే వికసించిన పూలు కూర్చి కట్టినదండలు తామర మొగ్గల స్పర్శవలన వాడిపోవుచున్నవి, హేసఖే ! =ఓ మిత్రమా, ఏషా ఉత్పాతపరంపరా మమ యాత్రా స్పృహాం కృంతతి= పైన పేర్కొనబడిన ఉత్పాత పరంపర నా ప్రయాణపు తలంపును తొలగ జేయుచున్నది.

ఆకాశమున నుండు చంద్రుడు నేలమీది తామరపై నిదురించుట,

ముత్యములు కలువల యందు బుట్టుట బంగారుతీగ పుట్టుకతో వచ్చిన పసుపు వన్నె వీడి తెల్ల బారుట, తామర మొగ్గల స్పర్శ మాత్రమున పూలదండలు వాడి పోవుట యనునవి దుర్నిమిత్తములు, కావున దుర్నిమిత్తములు బొడమినప్పుడు ప్రయాణము జేయుట మేలుకూర్చదు. కావున పెక్కు ఉత్పాతములు ఏక కాలమున సంభవించుటచే నా ప్రయాణము నాపుకొంటినని సామాన్యముగా తోచుభావము.

ఇందు ఉపమానములే చెప్పబడినవి, కావున వానికి దగిన ఉపమేయములు గ్రహించినచో రమణీయార్థము స్ఫురించును.

చంద్రుడు కమలమందు నిదురించుచున్నాడనుటచే - నా ప్రయాణవార్త వినిన నా ప్రేయసి అతి దీనయై తన అఱచేతిలో ముఖమునుంచుకొనినదని, నల్ల కలువల నుండి తెల్లని ముత్యములు రాలుచున్న వనుటచే కాటుకచే నలంకరింపని ఆమె కనులనుండి కన్నీరు జాలు వారినదని, తామరమొగ్గల స్పర్శవలన పూల దండలు వాడిన వనుటచే- భావి విరహమునూహించుకొని పరితపించు ఆమె వక్షోజాలంకృతములైన పుష్పమాలలు వేడి నిట్టూర్పులచే వాడిపోయినవని, అట్లు విషాదదేవతగానున్న నా ప్రేయసిని చూచి ప్రయాణ మాపుకొంటినని నాయకుడు తన మిత్రునితో జెప్పెను.

శ్వశ్రూః క్రుధ్యతు, విద్విషన్తు సుహృదో
నిందంతు వా యాతరః
తస్మిన్ కింతు న మందిరే సఖి పునస్
స్వాపో విధేయో మయా
ఆఖోరాక్రమణాయ కోణకుహరాత్
ఉత్ఫాల మాతన్వతీ
మార్జారీ నఖరైః ఖరైః కృతవతీ
కాంకాం న మే వేదనామ్ 81

సఖి= ఓ చెలీ ! శ్వశ్రూః క్రుధ్యతు=అత్తగారు కోపింపనిమ్ము, సుహృదః విద్విషంతు=తోటి చెలికత్తెలు పగబూననిమ్ము యాతరం

నిందుంతువా=తోటికొండం(డు తిట్టిన తిట్టినిమ్ము, కింతు = ఏమైనకానిమ్ము కాని, పున ః= ఇకమీద, తస్మిన్ =మందిరే స్వాప ః మయాన విధేయ ః =ఆయింటిలో నిదురింప నాచేతకాదు, (ఏలయన) ఆఖోః= ఆ(క్రమణాయ =ఎలుకనుబట్టుటకై, కోణకుహరాత్=మూల బిలమునుండి, ఉత్ఫాలమ్ ఆతన్వతీ=దాటు వేయునదై, మార్జారా=ఆడుపిల్లి,ఖరై ః నఖరై ః = వాడిరేగోళ్లతో, మే కాం కాం దుర్దశాం న కృతవతీ =నాకే యే దురవస్థను కల్పింపనేదు ?

ఇందు ఒక షో(పిషిత భర్తృక తనకై ఏర్పరచిన ఇంటిలో జారుని వలన నఖక్షతాదులను పొంది, ఆ గోరంటులను పిల్లి గోళ్లవలన కలిగినవను సాకున అత్త, తోడి కోడం(డు మున్నగు వారికి విన వచ్చునట్లు చెలితో చెప్పి, వారనుమానపడకుండ చేసుకున్నది. ఆఇంటిలో ఇక మీద పరుండనన్నచో-అత్తగారు తోటికోడం(డు పట్టుబట్టి అదే యింట పరుండనేయుదురు. ఇక ముందును రహః (క్రీడకు లోటుండదని ఆమె భావము.

(ఇందు వృత్తవర్తిష్యమాణ సురతగోపనము చేయబడినది. ఆవులించిన (పేవుల లెక్కిడు అత్త మున్నగువారి కావంతయేని సందియము కలుగకుండుటకై 'మార్జారీ' పద ముపయోగించినది

**కాంతే కనకజంబీరం కరే కామపి కుర్వతి**
**ఆగారలిఖితే భానౌ బిందు మిందుముఖీ దదౌ** 82

కాంతే=(ప్రియుడు, కనకజంబీరమ్=బంగారురంగుగల నిమ్మకాయను, కరే=హస్తమునందు కిమపి కుర్వతి=ఏదోచేయుచుండగా, (పట్టినలుపుచుండగా) ఇందుముఖీ=చం(ద్రవదనయైన నాయిక, ఆగారలిఖితే=ఇంట (ద్వారదేశమున) చి(త్రింపబడిన, భానౌ=సూర్య (ప్రతిమయందు, బిందుందదౌ=సున్నజుట్టెను.

నీ యురోజ పరీరంభణ మెప్పుడు చేకూరునని నాయకుడు కనకజంబీర మర్దన చేష్టారూపమున వెల్లడింప, నాయిక సూర్య(ప్రతిమయందు

నున్నజుట్టు చేష్టతో మన సమాగమము సూర్యాస్తమనానన్తరము సిద్ధించునని సూచించెను. (ఇది హృద్యప్రహేళిక).

**వియతి విలోలతి జలదస్ స్ఖలతి విధు శ్చలతి కూజతి కపోత ః**
**నిష్పతతి తారకాతతి రాందోలతి వీచి రమరవాహిన్యా ః 83**

వియతి=ఆకసము, విలోలతిసతి=అసియాడుచుండగా, జలద ః =మేఘము, స్ఖలతి=జారిపడుచున్నది, విధు ః చలతి=చంద్రుడు కదలుచున్నాడు, కపోతః కూజతి=పావురము కూయుచున్నది, తారకాతతి ః నిష్పతతి = నక్షత్ర పుంజము రాలుచున్నది, అమరవాహిన్యా ః వీచి ః ఆందోలతి=చదలేటి కెరటములు ఊగులాడుచున్నవి.

ఆకాశముకంపించునప్పుడు మేఘము జారుట, చంద్రుడు కదలుట, చుక్కలూడిపడుట, ఆకాశగంగాతరంగాళి ఊగులాడుట మున్నగునవి సంభవించును. ఇట విషయ (ఉపమేయ) నిగరణము చేయబడినది. ఉపయుక్తోపమానములచే నిగీర్ణోపమేయములు గ్రహించవలయును.

నడుము అసియాడుచున్నది- కొప్పుజారి పడుచున్నది. మోము చలించుచున్నది -రతికూజిత మేర్పడుచున్నది- ముత్తెములు (పెరిగి) రాలుచున్నవి- వళులూగుచున్నవి అను నాయికా రహ ః క్రీడ ఇందు సూచింపబడినది.

**అపహ్నుతి ప్రహేళికలుః-**

తుల్య విశేషణము ద్వారా శ్రోతకు అన్యవస్తు భ్రాంతికల్పించి పిదప యథార్థము తెల్పబడును ఇట్టి ప్రహేళికలను అపహ్నుతి గర్భితలందురు.

**సీత్కారం శిక్షయతి వ్రణయ త్యధరం తనోతి రోమాంచమ్**
**నాగరిక ః కిం మిలిత ః -'నహి నహి సఖి ! హైమన ః పవన ః 84**

ఒక నాయిక తన సఖితో నిట్లనుచున్నది.

**నాయిక ః-** సీత్కారం శిక్షయతి=సీత్కారమును కలుపును, అధరం

వ్రణయతి=క్రింది పెదవిని గాయపఱచును.

భ్రమపడిన సఖి ప్రశ్నించుచున్నది

**సఖిః–** కిం నాగరిక ః మిలిత ః =ఎవడైన విలాస పురుషుడు లభించెనా ?

**నాయిక ః–** నహి నహి హైమన ం పవన ః = కాదుకాదు చలిగాలి సుమా !

తనకు సీత్కారము, అధర వ్రణము నాయకుని వలన కలిగినదని తన మాటలవలన భ్రమపడిన సఖికి యథార్థము జెప్పి భ్రమను నివారించినది సీత్కారము మరియు అధరవ్రణము నాయకునివలన కలిగినట్లు చలిగాలి వలనను కల్గును చలికి పెదవులు పలుగుట జనులు సీత్కారము చేయుట సహజమే కదా !

రాగీ భినత్తి నిద్రాం తల్పం న జహాతి నిష్ఠురం దశతి

చతురే ! కిం ప్రాణేశ ః –'నహి నహి సఖి ! మత్కుణవ్రాత ః

రాగీ నిద్రాం భిన్తతి=రాగియై నిద్రాభంగము జేయును, తల్పం నజహాతి= సెజ్జను విడనాడకుండును, నిష్ఠురం దశతి=గట్టిగా కరచును (అను నాయిక మాట వినిన చెలి ఇట్లడుగుచున్నది. )

చతురే ! కిం ప్రాణేశ ః = ఓ చతురురాలా ! నీ ప్రాణేశుడా అటు లొనరించినది?

తల్పము విడువక నిద్రాభంగము జేసి దంతక్షతము జేసెనా ? అని ప్రశ్నింపగా నాయిక సఖితో యథార్థము నుడువుచున్నది.

నహి నహి సఖి ! మత్కుణవ్రాత ః =కాదు చెలియా ! ప్రాణేశుడు కాడు, ఇంతపని చేసినది నల్లుల బారు సుమా !

**ఆదౌ గృహీత పాణి ః**
**పశ్చా దారూఢకటి జఘనభాగా**
**నఖముఖలాలనసుఖదా**
**సా కిం రామాస్తి ? – 'నైవ భో ఃపామా '** 86

ఆదౌ గృహీతపాణి ః =మొదట పాణి గ్రహణ మొనరించినదై, పశ్చాత్ ఆరూఢ కటి జఘన భాగా= పిదప కటిజఘనభాగముల నాక్రమించినది, నఖ

ముఖలాలన సుఖదా=గోళ్లకొనల. గీరతో సౌఖ్యము కల్గించయునది.(అని చెప్పుచున్న యువకుని మాటవలన అతని చెలికాడు భ్రమపడి ప్రశ్నించుచున్నాడు) -

సా రామా అపి కిమ్ =అటు ఒనరించినది నీ ప్రేయసియా ? (అని తన మిత్రుడుభ్రమపడ నా యువకుడు కాదని చెప్పుచున్నాడు) - నూపభో : పామా ప్రేయసి కాదయ్యా - మహానుభావా ! గజ్జి సుమా -

పత్ని పాణిగ్రహణ మొనరించును - కటి జఘన భాగమును అలముకొనును - నఖక్షతములచే సుఖపరచును - గజ్జియు మొదట చేతుల కంటుకొని పిదప నడుము మరియు గజ్జలను ఆవరించును. గోళ్లతో గోకుకొనినప్పుడు హాయి హాయి యనిపించును.

**తన్వీ చారుపయోధరా సువదనా శ్యామా మనోహారిణీ**
**నీతా నిష్కరుణేన కేనచి దహో దేశాంతరా, దాగతా**
**ఉత్సంగోచితయా తయా రహితయా కిం జీవనం ప్రేక్షసే**
**భిక్షో తే దయితాస్తి కిం ? 'నహినహి ప్రాణప్రియాతుంబికా' 87**

కృశించినది సుందరపయోధర సుముఖి, శ్యామ, హృదయహారిణి ఇట్టి గుణవతిని ఎవడో దయమాలినవాడొకడు, వచ్చి ఎత్తుకొని పోయెను - అంకోచితురాలగు నా గుణవతి లేనిచో నా బ్రదుకే వ్యర్థమని వాపోవుబిచ్చగానిని జూచి యొకడు ఏమట్లు వాపోవుచున్నావు ? నీ ప్రాణేశ్వరి అపహరింపబడెనా అని ప్రశ్నింప, "కాదు - ప్రాణ సమముగా జూచుకొను తుంబికను (నీటి బుర్ర కాయను) ఎవడో అపహరించినాడు, అందువలన పరితాప పడుచున్నా" నని నుడివెను.

ప్రేయసికి సరిపోవు విశేషణములు తుంబికకు సరిపోవుటచే శ్రోతకు ప్రేయసీ భ్రాంతి కలిగినది

తన్వీ=కృశాంగి,ప్రేయసి,(చిన్నగానున్నదితుంబిక)చారుపయోధరా=మనోజ్ఞ కుచములు గలది ప్రేయసి (మంచి నీరు ధరించినది తుంబిక) సువదనా = చక్కని మోము కలది ప్రేయసి శ్యామా=యౌవనమధ్యస్థురాలు

ప్రేయసి, (దప్పిగొను వారి నాకర్షించునది తుంబిక) యని ప్రేయసీ తుంబికల పరముగా విశేషణపదముల కర్థము గ్రహించవలెను.

**యా పాణిగ్రహలాలితా సుసరలా తన్వీ సువంశోద్భవా**
**గౌరీ స్పర్శసుఖావహా గుణవతీ నిత్యం మనోహారిణీ**
**సా కేనాపి హృతా తయా విరహితో గంతుం న శక్తోఽస్మ్యహం**
**రే భిక్షో ! తవ కామినీ 'నహి నహి ప్రాణప్రియా - యష్టికా' 88**

పాణిగ్రహణలాలిత, సరల, కృశాంగి సద్వంశ సంజాత, గౌరాంగి, స్పర్శ సౌఖ్యావహ, మనోహారిణి యగు నా గుణవతిని ఎవడో ఎత్తుకొని పోయినాడు. ఈ గుణవతి నెడబాసిన నేను కదలలేక పడియున్నానని ఒక బిచ్చగాడు విలపించుచుండ దారిబోవు నొకడు అతని విలాపమువిని "ఏమి నీ కామిని నెవడైన ఎత్తుకొని పోయెనా"యని ప్రశ్నించెను. అపుడు బిచ్చగాడు "కాదయ్యా ! నాప్రాణ ప్రియమైన చేతి కఱ్ఱను ఎవడో దొంగిలించినాడు. ఆ కఱ్ఱ లేక నేను అడుగుపెట్టలేను, ఇదియే నా విలాపకారణ" మని ఆ వ్యక్తితో ననెను.

ఇచటి విశేషణములు కామినీయష్టికలకు తుల్యములు అందువలన భ్రాంతి ఏర్పడును.

పాణిగ్రహలాలితా =వివాహలాలితురాలు ప్రేయసి (చేత బట్టుకొనుటచే లాలింపబడునది యష్టిక ) సుసరలా=మంచి స్వభావముగలది ప్రేయసి, (వంకరలేనట్టిది యష్టిక), తన్వీ=లతాంగి ప్రేయసి, (సన్నగా - దొడ్డు సన్నము గాక మధ్యమముగా నుండునది యష్టిక), సువంశోద్భవా=మంచి కులమునబుట్టినది ప్రేయసి, (మంచి వెదురుజాతి కి చెందినది యష్టిక) స్పర్శ సుఖావహా=స్పృశించిన మాత్రమున సౌఖ్యము నిచ్చునది ప్రేయసి,( యష్టికయు నట్టిదే) గుణవతీ=సౌకుమార్యాది గుణములుగలది ప్రేయసి, (పట్టుకొనుచోట త్రాడు కట్టబడినది యష్టిక)

ప్రేయసివలెనే ముష్టికయు మనోహారిణియని ఇరు పక్షముల నర్థము గ్రహింపవలెను.

శాస్త్రగూఢ ప్రహేళిక :-

గంధసమవాయివహతద్విలక్షణస్పర్శశబ్దగుణపూజ్యాః
సాజాత్యేఽన్యస్పర్శౌ యత్తనవః సోఽవతాత్ భవతః 89

గంధసమవాయి=గంధము సమవాయ సంబంధముతో నుండునది పృథివి, వహ=ఆగంధమును వీచునది వాయువు, తద్విలక్షణస్పర్శ= ఆపృథివీగంధవాహులయందు లేని స్పర్శ గుణముగలవి తేజస్సు మరియు జలము(ఉష్ణస్పర్శగలది తేజస్సు, శీతస్పర్శగలది జలముపృథివీ వాయువులు అనుష్ణ శీతస్పర్శములు) శబ్దగుణ=శబ్దము ప్రధానగుణముగలది ఆకాశము (శబ్దగుణక మాకాశమ్ అని ఆకాశ లక్షణము) శబ్దగుణ పూజ్యాః = శబ్దమును పూజించువాడు యజమానుడు (మీమాంసకులు శబ్దమును దేవతగా భావింతురు . వీరి మతమున దేవతలకు శరీరముండదు) సాజాత్యే=ఏకజాతీయములైనను, అన్యస్పర్శౌ=విభిన్న స్పర్శగలవారు సూర్యుడు మరియు చంద్రుడు చంద్ర సూర్యులుతేజః పదార్థములైనను సూర్యునకు ఉష్ణస్పర్శ, చంద్రునకు శీత స్పర్శ అను భవ సిద్ధము. తేజస్వియగు చంద్రునకు వాస్తవముగా ఉష్ణ స్పర్శయున్నను దానినిజలావయవములు అణచివేయుటచే ననియో, లోకానుభవమును బట్టియో అతని యందు శీత స్పర్శ చెప్పబడినది. ఇట్టి పృథివ్యప్తేజోవాయ్వాకాశములు సూర్యాచంద్రమసులు, యజమాదనును నీ యెనిమిది యత్ తనవః =ఏ శివుని శరీరములుగా విలసిల్లుచున్నవో, సః =అష్టమూర్తియగు ఆ పరమేశ్వరుడు, భవతః = మిమ్ము, అవ్యాత్ = రక్షించుగాక !

ఇందలి భావము శాస్త్రీయ పరిభాషాగూఢము

గోధుక్స్రద్యంగ్గుక్షుద్వంద్వధ్రుగ్గతి చ్ఛిదఘ్న్యానామ్
యోఽజర్షద్విడ్దక్షం షష్ఠిద్వే న తం కస్మాత్ 90

యః =ఎవడు, గోధుక్సధ్ర్యంగ్ గోధుక్=పాలుపితుకువారే (గోపాలురు) సధ్ర్యజ్=మిత్రులుగాగలవాడో, ఉక్ష=వృషభాసురుని, దృద్వంద్వ=యమళార్జున వృక్షములను, ధ్రుక్ =కూల్చినవాడో (ద్రోహముచేసినవాడని శబ్దార్థము,) అఘ్న్యానాం=గోవులయొక్క, హతిచ్ఛిత్ =అపాయమును తొలగించినవాడో (కార్చిచ్చునుండి గోవుల రక్షించినవాడు లేక గోరక్షాపరాయణుడు) ద్విడ్ధక్ష్వమ్- ద్విట్=శత్రువుల యొక్క, ధక్ష్వమ్=దాహమును (వినాశమును) అజర్షత్=కాంక్షించెనో (ఇదిఅభికాంక్షార్థకముయజ్ లుగంతముగుగృధు ధాతువుయొక్క, లజ్ ప్రథమపురుషైకవచనము) తమ్=అట్టి శ్రీ కృష్ణుని, కస్మాత్=ఎందువలన, నవవృష్కిఢ్వే=ఆశ్రయింపవకుంటిరి (ఇది గత్యర్థకముగు వృష్క-ధాతువుయొక్క లిట్ మధ్యమ పురుష బహువచన రూపము) ఇందు వ్యాకరణపద ప్రయోగ వైచిత్రియుండుటవలన నిది వ్యాకరణ గూఢప్రహేళిక.

**స్వజనక జన్యాభావోపజనకజననీయపుర నిహంతృసఖః**
**యం తనయం సమజనయత్ తద్బలితనయైర్ జగద్ విజితమ్91**

స్వజనక=తన నిమిత్తముయొక్క (ఇంధనముయొక్క) జన్యాభావ = ప్రధ్వంసాభావమును, (భస్మీకరణమును) జనక=కలిగించు అగ్నికి సంబంధించిన, జననీయ =హిరణ్మయమైన, పుర=నివాతకవచులను రాక్షసుల పట్టణమును, (హిరణ్యపురమును) నిహంతృ=నాశన మొనరించిన అర్జునునకు సఖః =మిత్రుడగు కృష్ణుడు, యమ్=ఏ మన్మథుని, తనయం=కుమారునిగా, సమజనయత్=సృజించెనో, తత్=అట్టి మదనునియొక్క, బలి తనయైః= బాణములచే (బలిపుత్రుడు బాణుడు బాణ పదమునకు అమ్ములనియు అర్థము) జగత్=సమస్త ప్రపంచము, విజితమ్=జయింపబడుచున్నది.

ఇందు న్యాయ పరిభాషావిశేషమున్నది. కావున నిది శాస్త్రగూఢ

ప్రహేళిక (ప్రాగభావ ప్రతియోగియై, ధ్వంసాప్రతియోగి యగు అభావము ప్రధ్వంసాభావము)కారణమునందు ఉత్పత్స్యమాన కార్యాభావము ప్రాగ భావము కారణమునందు ఉత్పన్నకార్యాభావము ప్రధ్వంసాభావము .

క్రియా గుప్తము :-

కుమారసంభవం శ్రుత్వా రఘువంశే మనోరమే
రాక్షసానాం కులశ్రేష్ఠః రామో రా జీవలోచనః 92

రాక్షసకుల శ్రేష్ఠుడు రాజీవాక్షుడగు రాముడు కుమార సంభవమునువిని, మనోజ్ఞమగు రఘువంశమునందు- అని విపరీతార్ధ ప్రతీతియేగాక క్రియాపదాభావాభాసతను స్ఫురింపజేయును, కాని ఇందు క్రియా పదము నిగూఢముగా నున్నది.

రాజీవలోచనః= కమలాక్షుడగు నారాయణుడు, మనోరమే=సర్వలోక హారియైన రఘువంశే=రఘుకులమునందు, కులశ్రేష్ఠః = క్షత్రియకులతిలకుడైన రామః = శ్రీ రామచంద్రుడుగా కుమ్=భూమిని, అర =పొందెను, (అరమనునది గత్యర్థక ఋ ధాతువు లిట్ ప్రథమ పురుషైక వచన రూపము ఇది గుప్తముగా నున్నది.)

మందారకుసుమాక్రాంత భృంగమాలా విరాజితమ్
ఏకేన రామబాణేన రావణస్య రణే శిరః 93

మందార కుసుమాక్రాంతభృంగమాలా విరాజితమైన రావణుని శిరస్సు ఒకే ఒక రామబాణముచే అని అర్ధము. ఇందు ఏమి చేయబడినదో ని గూఢముగా నున్నది.

మందార కుసుమాక్రాంత భృంగమ్=మందారపుష్పముల నావరించిన తుమ్మెదలు గలది, రాజితం =ప్రకాశించు, రావణస్య శిరః =రావణునితల, రణే = యుద్ధమునందు, ఏకేన రామ బాణేన = ఒకే యొక రామబాణముచే

అలావి=ఛేదింపబడెను. ఇట ఛేదనార్థక లూ ధాతువుముక్క (కర్మవాచ్య) ఆజ్ ఉపసర్గ) మందార కుసుమాక్రాంత భృంగమ్ ఆలావి రాజితమ్ అని పదవిభాగము

కాంతం వినా నదీతీరమ్మదమాలోక్య కేకినీ
అత్ర క్రియాపదం వక్తుః హైమం దాస్యామి కంకణమ్ 94

పూర్వార్థమున క్రియాపదము జెప్పినవానికి బంగారు కంకణ మిచ్చెద. సుందరమైన నదీతీరము లేక మదమును జూచి ఆడు నెమిలి అని పూర్వార్థము నకు అర్థము ఇందు క్రియాపరము గుప్తముగానున్నది, ఎట్లన కేకినీ= ఆడునెమిలి, కాంతమ్=మనోజ్ఞమైన, ఇరమ్మదమ్ = మేఘజ్యోతిని, అలోక్య=చూచి వినానదీతి=మిక్కిలి కేక (కూత) పెట్టుచున్నది.

వినానదీతి యనునది వదధాతువుయొక్క యఙ్లుగంత రూపము.వియనునది ఉపసర్గ ఇది సామాన్యముగా స్ఫురింపదు.

ఆగతః పాండవా స్సర్వే దుర్యోధనసమీహయా
తస్మై గాంచ సువర్ణంచరత్నాని వివిధాని చ 95

వచ్చినవాడు పాండవులెల్లరు దుర్యోధనుని తలంపుతో నతనికి గోవును బంగారమును పలుమణుల ననునది స్థూలముగా ఉపలబ్ధమగును ఇందు క్రియాపదముగుప్తము.

యః = ఎవడు, దనసమీహయా=ధనాభిలాషతో, ఆగతః=తమదగ్గరకు యాచింపవచ్చెనో, తస్మై=అతనికి, సర్వే పాండవాః =పాండవులెల్లరు, గాంచ సువర్ణంచ వివిధాని రత్నానిచ=గో సువర్ణములే గాక పలు రత్నములను సైతము అదుః =దానము జేసిరి, సర్వే+అదుః +యంః+ధనసమీహయా=సర్వేదుర్యోధన సమీహయా అని పదవిభాగము - అదుః అను క్రియా పదము ఇందు గుప్తముగా నున్నది.

నిరుద్యమానవద్యాంగ యాచకాన్ దు : ఖసంచయాన్
అత్రక్రియాపదం గుప్తంయో జానాతి స పండిత : 96

నిరుద్యములు అనవద్యాంగులునైన యాచకులను దుఃఖ సంచయములను అని సామాన్యముగా అర్థోపస్థితి కలుగును- ఇచ్చట గుప్తముగా నున్న క్రియాపదమును తెల్పువాడే పండితుడు.

అంగ=అయ్యా(ప్రభూ), నిరుద్యమాన్=చదువుకొనియు ఉద్యోగము లేనట్టి, యాచకాన్= భిక్షావృత్తి నవలంబించిన వారిని, అవ=ఉద్యోగము నేర్పరచి రక్షించుము, దుఃఖ సంచయాన్=గుమి గూడి యున్నవారి దుఃఖములను, ద్య=ఖండించుము.

నిదుద్యమాన్, అవ, ద్య, అంగ, యని పదవిభాగము, ద్య యనునది అవఖండనార్థక ద్యోధాతువు- లోటః ప్రథమైక వచనము.

ప్రాత : ప్రాత స్సముత్థాయ ద్వౌ మునీ చ కమండలూ
అత్ర క్రియాపదం వక్తుమ్ అవధిర్ బ్రహ్మణో వయ : 97

ప్రతి ప్రాత : కాలమున లేచి మును లిరువురు కమండలములను అని పూర్వార్థము నందర్థము పాఠకునకు గోచరించును. ఇందు క్రియాపదము చెప్పుటకు బ్రహ్మదేవుని ఆయు : కాలపు వ్యవధి ఈయబడినది. ఎంత కష్టపడినను క్రియాపదమునరయ లేరని భావము.

ద్వౌ మునీ=మునులిరువురు, ప్రాతః సముత్థాయ = వేకువలేచి, కమండలూచ=రెండు కమండలములను, ప్రాత : =నీటితో నింపుకొనుచున్నారు. (పూరణార్థక 'ప్రా' ధాతువు వర్తమానకాలిక ప్రథమ పురుష ద్వివచనరూపము)

లలాటతిలకోపూాత : కృష్ణ : కమలలోచన :
గోకులేఽత్ర క్రియాం వక్తుం మర్యాదా దశవార్షికీ 98

గోకులమున లలాట తిలకోపేతుడు కమలాక్షుడైన కృష్ణుడు-

అని స్థూలముగా వచ్చు అర్థము. ఇందు క్రియాపదము జెప్పుట, పదేండ్లవ్యవధి యేర్పరచబడినది,

గోకులే=గోకులమునందు కమలలోచన : కృష్ణ : =నళినయనుడైన కృష్ణుడు, తిలకోపేత : నొసట కస్తూరీతిలకముకలవాడై లలాట=బాల్యక్రీడనొనరించెను

(బాల్యార్థకమగు లట ధాతువుయొక్క పరోక్షభూత ప్రథమ పురుషైకవచన రూపము )

**దామోదరాయ పుణ్యాత్మన్ ! పుష్పమూల ఫలాన్యపి**
**అత్ర క్రియాపదం గుప్తం యో జానాతి స పండిత : 99**

అత్ర=ఈ పూర్వార్థమున గుప్తం=గూఢముగాసున్న. క్రియాపదం =క్రియాపదమును,య : =ఎవడు, జానాతి=ఎఱుగునో, సః =అతడే, పండిత : =పండితుడు

క్రియ దామోదరాయ అనుచోటగుప్త మైనది. దామోదర+ఆయ, యని విడదీసికొనవలెను.

పుణ్యాత్మన్=పుణ్యాత్ముడవైన.దామోదర ! =ఓ కృష్ణా ! పుష్పమూలఫలాని అపి=పూలు -దుంపలు పండ్లను, ఆయ = తీసికొని, రమ్ము, (ఆజ్ పూర్వక ఇధాతువు లోట్ మధ్యమ పురుషైకవచనము) దామోదరాయ యను నది చతుర్థివలె తోచును కాని దామోదర ఆయ అని స్ఫురింపదు.

**విరాటనగరే రాజన్! కీచకా దుపకీచకమ్**
**అత్ర క్రియాపదం గుప్తం యో జానాతి స పండిత : 100**

ఇట విరాట యను చోట క్రియ గుప్తమైనది.

రాజన్ ! =రాజా !, కీచకాత్=వెదురునుండి, ఉపకీచకమ్=దగ్గరి వెదురుపై,విః =పక్షి, ఆట=తిరిగెను(అటధాతువు లిట్ లకార ప్రథమైక

వచనము) కీచకునినుండి కీచకుని దగ్గరకు విరాట నగరములో అని సామాన్యముగా వచ్చు అర్థము

అమ్లాన పంకజా మాలా కంఠే రామస్య సీతయా
ముధా బుధా భ్రమం త్యత్ర ప్రత్యక్షేపి క్రియాపదే 101

అత్ర= ఈ శ్లోకమునందు, క్రియాపదే =క్రియ, ప్రత్యక్షేపి=కనుల దగ్గరనున్నను, బుధా : =పండితులు, ముధా=వ్యర్థముగా, భ్రమంతి= పరిభ్రమించుచున్నారు.

సీతయా =జానకిచే అమ్లాన పంకజా మాలా =వాడిపోని తామరపూల దండ, రామస్యకంఠే =రాముని మెడలో, ప్రత్యక్షేపి = వేయబడెను.

ప్రత్యక్షేపి అను పదమునకు ప్రత్యక్షముగానున్నను అను అర్థము స్ఫురించినట్లు వేయబడినదను అర్థము స్ఫురింపదు. (ప్రతి క్షిపధాతువు యొక్క కర్మణ్యర్థక లుఙ్ ప్రథమైక వచన రూపము, ప్రత్యక్షేపి)

నారసింహాకృతిం వీక్ష్య వనే మత్తమతంగజ :
అత్ర క్రియాపదం గుప్తం యో జానాతి స పండిత : 102

ఇట నారసింహాకృతిమ్ అను తావున క్రియ గుప్తముగా నున్నది.

మత్తమతంగజ : =మదపుటేనుగు, వనే=అరణ్యమునందు, సింహాకృతిమ్=సింహరూపమును, వీక్ష్య=చూచి, న ఆర=కదలక పోయెను.

నారసింహాకృతిమ్ అను చోటనరసింహాకారము ననునది స్ఫురించినట్లు సింహాకృతిం నారయని స్ఫురింపదు.ఆరయనునది ఋధాతువు, లిట్ ప్రథమైక వచనము

రాఘవస్య శరై ర్ఘోరై: ఘోరరావణ మాహవే
అత్ర క్రియాపదం గుప్తం మర్యాదా దశవార్షికీ 103

పండితులారా ! ఈ శ్లోకమున గుప్తముగా నున్న క్రియాపదము పదేండ్ల వ్యవధిలోనైన నెఱిగి చూపుడు

రాఘువస్య అనుచోట క్రియాపదమున్నది.

రాఘువ !=ఓ శ్రీరామా! ఆహవే=యుద్ధమునందు, ఘోరరావణమ్=క్రూరుడైన రావణుని, ఘోరైః శరైః = క్రూరములైన బాణములచే, స్య = ఖండించుము.

స్య అనునది మారణార్థక ధాతువు, లోట్ మధ్యమ పురుషైక వచనము రాఘువస్య అనునది షష్ఠీవిభక్తిగా స్ఫురించును కాని,రాఘువ ! స్య అని స్ఫురింపదు

ఇది షష్ఠీ విభక్త్యాభాసము.

**బింబాకారం సుధాధారం కాంతావదనపంకజమ్**
**అత్ర క్రియాపదం గుప్తం మర్యాదా దశవార్షికీ 104**

ఇట గుప్తముగానున్న క్రియనెఱుగ పదేండ్లు వ్యవధి

దశవార్షికీ స్థానమున క్రియ గుప్తమైనది.

బింబాకారమ్=బింబమువలెనున్న సుధాధారమ్=అమృత స్థానమైన. కాంతావదన పంకజమ్=సుందరీ వదనారవిందమును, దశ =ముద్దిడుకొనుము. (దొండపండువలె నుండు ఆమెపెదవి దేనియను గ్రోలుమని భావము.)

**పుంస్కోకిలకులస్యైతే వినితాంత మధురారవైః**
**సహకారద్రుమా రమ్య వసంతే కామపి శ్రియమ్ 105**

నితాంత మధురారవైః అను చోట క్రియగుప్తముగానున్నది.

వసంతే=మధుమాసమునందు, రమ్యాః =పల్లవాదులచే మనోజ్ఞములైన, ఏతే సహకారద్రుమాః =ఈ తియ్యమావులు, పుంస్కోకిల కులస్య=గండు కోయిలల గుంపునకు, ఆరవైః =కూతలతో గూడ, కామపి శ్రియమ్ =ఒకానొకశోభను, నితాంతమ్=మిక్కిలి, అధుః = కల్పించినవి, (దాఞ్ ధాతువు లుఙ్ బహువచనము.)

కర్తృగుప్తములుః-

**గౌరీనఖరసాదృశ్య శ్రద్ధయా శశినం దధౌ**
**ఇహైవ గోప్యతే కర్తా వర్షేణాపి న లభ్యతే** 106

ఈశ్లోకముననే కర్తృపదము గుప్తమైనది. ఒక సంవత్సరకాలము వెదకినను లభింపదు.

ఇహైవ = ఇక్కడనే కర్తృపదము గుప్తము.

ఇహ-ఇ = మన్మధుని, హ = సంహరించిన శివుడు, గౌరీ నఖర సాదృశ్యశ్రద్ధయా ఏవ = పార్వతి గోటి పోలికయున్నదను ఆదర విశేషముననే, శశినం దధౌ = చంద్రుని తలపై ధరించెను.

ఇహైవ అనుచోట ఇక్కడనే యని స్ఫురించినట్లు శివుడను అర్థము స్ఫురింపదు.

**అన్నవస్త్ర సువర్ణాని రత్నాని వివిధా నిచ**
**బ్రాహ్మణేభ్యో నదీతీరే దదాతి వ్రజ సత్వరమ్** 107

తిండి, బట్టలు, బంగారము,పలురతనములు, బ్రాహ్మణుల కేటియొడ్డున ఇచ్చుచున్నాడు. త్వరగా వెళ్లుము. ఇట యిచ్చువాడు (కర్త) గుప్తముగా నున్నాడు.

బ్రాహ్మణ+ఇభ్యః అని సంధి విడదీయవలయును.

బ్రాహ్మణ = ఓ బ్రాహ్మణా! ఇభ్యః = శ్రీమంతుడు, పై వస్తువులు దానము జేయు చున్నాడు త్వరగా వెళ్లుమని తాత్పర్యము.

బ్రాహ్మణేభ్యః అనునది చతుర్థీ విభక్తి వలె తోచును కాని బ్రాహ్మణ+ఇభ్యః అని స్ఫురింపదు

**రాక్షసేభ్య స్సుతాం హృత్వా జనకస్య పురీం యయౌ**
**అత్ర కర్తృపదం గుప్తం మర్యాదా దశవార్షికీ** 108

జనకస్య సుతాంరాక్షసేభ్యః హృత్వా పురీం యయౌ= జానకిని రాక్షసుల కొరకుహరించి లంకాపురము తీసికొనిపోయెనని సామాన్యముగా తోచు అర్థము,

రాక్షసేభ్యః యనునది చతుర్థి కాదు. ప్రథమా విభక్తిః రాక్షస ఇభ్యః రాక్షస పతియైన రావణుడు అని అర్థము.

**శ్యామౌ తవ స్తనా వేతౌ పిబంతి సతతం ముదా**
**అత్ర కర్తృపదం గుప్తం మర్యాదా దశవార్షికీ 109**

నల్లగానున్న ఈ నీచనులను సంతసమున నెపుడు త్రాగుచున్నవి. ఇట కర్తృపదము (త్రాగువారు)గుప్తముగా నున్నది. తెలియుటకై ఒక ఏడు వ్యవధి ఈయబడినది.

శ్యామౌ తవ స్తనౌ అనుచోట కర్త యున్నది,

శ్యామౌ తవ స్తనౌ అని సర్వులు భావింతురు.కానిశ్యామౌ తవః స్తనౌ అని విడదీసినచో కర్త బయట పడును. శ్యామ ఓతవః=నల్లపిల్లులు చనుబ్రాలు గ్రోలుచున్నవి అని తాత్పర్యము. శ్లేషాదులలోని విసర్గానుస్వారాదులు లోపించును

**ఉపైతి సురభి స్స్మేర సహకారాదిశోభితః**
**ప్రేయోవిరహదూనానా మమూనాం తన్వతే రుజమ్110**

స్మేర సహకారాది శోభితః = వికసించెడి తియ్యమావులు మున్నగు తరువులచే శోభిల్లు, సురభిః = మధుమాసము, ఉపైతి = డాయుచున్నది, ప్రేయోవిరహ దూనామ్ = ప్రియవిరహ సంతప్తలైన, అమూనామ్ = ఈ యువతులకు, రుజం తన్వతే = రోగము గల్గించుచున్నవి.

విరహిణీ రోగకారకములైనవి పేర్కొనబడలేదు. వసంతుడే రోగకారకుడన్నచో తనుతే యని ఉండవలసివచ్చును. తన్వతే యని బహువచనమున తను ధాతు వుండుటవలన వసంతేతరములున్నవని

తెలుచున్నది. కావున స్మేరసహకారాదిశోభితః అనుచోట కర్తృపదము గుప్తమైనది. స్మేరసహకారాః దిశః అభితః అని పదముల విడదీయవలయును.

అభితః = అంతట, దిశః=దిక్కులు, స్మేరసహకారాః =వికసించిన మావులు గలవై విరహిణీవ్యథ కలిగించుచున్నవని అర్థము,

ఈ క్రింది రీతి అన్వయము గ్రహింపవలెను.

సురభిః ఉపైతి,అభితః స్మేరసహకారా దిశః ప్రేయోవిరహదూనానామ్ అమూనాం రుజం తన్వతే = వసంతము వచ్చుచున్నది, అంతట వికసించిన మావులుగల దిక్కులు ప్రియవిరహ విషణ్ణలైన యువతులకు మనో వ్యథాకరము లగుచున్నవి.

న కరోతి నామ రోషం
నవదతి పరుషం న హంత్యయం శత్రూన్
రంజయతి మహీ మఖిలాం
తథాపి ధీరస్య వీరస్య 111

అయమ్=ఈరాజు, రోషం న కరోతినామ = కోపము జేయడు, పరుషం న వదతి = కఱకు మాటలాడడు, శత్రూన్ న హన్తి = పగతుర జంపడు, తథాఽపి=అటులైనను, అస్యవీరస్య=ఈవీరుని యొక్క, ధీః ప్రజ్ఞ, అఖిలాంమహీమ్ = సమస్త భూమిని, రంజయతి = రంజింప జేయుచున్నది.

ధీరస్య అనునది షష్ఠీవిభక్తిగా దోచును కాని ధీః అస్య అని స్ఫురింపదు కావున ధీరస్య అనుచోట ధీః అనుకర్తదాగియున్నది.

ఆ రాజు కోపించకయే, కఱకుగా మాటాడకయే శత్రువుల జీల్చి చెండాడకయే, తన బుద్ధిబలముతో సమస్త ప్రకృతిరంజన జేయుచున్నాడని

తాత్పర్యము.

**కర్మగుప్తము:-**

**శీకరాసారసంవాహి సరోజవనమారుతః**
**ప్రక్షోభయతి పాంథస్త్రీనిశ్వాసైరివ మాంసలః 112**

బలసినది, శీకర సార సంవాహి యైనది, తామరకొలకునుండి వీచువాయువు పథిక స్త్రీల నిట్టూర్పుల చేతనా యనునట్టు మిక్కిలి క్షోభపరుచుచున్నది. అని సామాన్యముగా తోచు అర్థము.

గాలి దేనిని క్షోభపరచుచున్నదో ఆ కర్మ గుప్తముగా నున్నది శీకరాసారసంవాహి సరోజ వనమారుతః అనుచోట "సరః" యను కర్మ గుప్తముగానున్నది.

పాంథస్త్రీనిశ్వాసైః = పథిక స్త్రీల నిట్టూర్పులచే, మాంసలః ఇవ = బలసినదా యనునట్లున్నది కనుకనే, జవనమారుతః = వేగముగా వీచునట్టిగాలి, శీకరాసారసంవాహి = తుంపురువాన గలిగిన, సరః = సరోవరమును, ప్రక్షోభయతి = వ్యాకులపరచుచున్నది.

**వనితాసూనసమయే సుభగ త్వద్వినాకృతా**
**జహతి హన్యమానేయ మనన్యజ శిలీముఖైః 113**

సుభగ = ఓ సుందరా!, త్వద్వినాకృతా =నీయెడబాటునొందిన, ఇయంవనితా = ఈయువతి, అనన్యజ శిలీముఖైః=మన్మథబాణములచే, హన్యమానా = పీడింపబడుచున్నదై, అసూన్ = ప్రాణములను, అసమయే = అకాలముననే, జహతి = విడుచును.

ఇట వనితాసూనసమయేఅను తావున సూనసమయమున (వసంత ఋతువునందు) యువతి అని అర్థము స్ఫురించినట్లు వనితా అసూన్ అసమయే అని స్ఫురింపదు, అసూన్ అను కర్మపదము గుప్తమని గ్రహింపవలెను.

కరణగుప్తముః-

పూతిపంకమయేత్యర్థం కాసారే దుఃఖితా అమీ
దుర్వారా మానసం హంసా గమిష్యంతి ఘనాగమే 114

ఇట కరణము గుప్తముగా నున్నది కరణమనగా ప్రకృష్ట సాధనము. ఇది తృతీయా విభక్తిలో నుండును. దుర్వారా యనునది హంస విశేషణముగా నగుపడును కాని తృతీయా పదము.

ఘనాగమే = వర్షాగమమందు,అమీ హంసాః = ఈయంచలు, దుర్వారా = మురికి నీటిచే, ఆత్యర్థమ్ = మిక్కిలి, పూతి గంధిమయే = చెడు వాసన గొట్టు బురద నిండియున్న, కాసారే = సరోవర మందు, దుఃఖితాః = నివసింప లేక దుఃఖపడుచున్నవై, మానసమ్ = మానస సరస్సును, యాంతి = చేరుచున్నవి.

సంప్రదాన గుప్తముః-

ముగ్ధాపి వారవనితా మదనోదన్వ త్యనంతరాయే
లావణ్య శాలినమపి స్వాత్మాన మశంక మర్పయతి 115

అనంతరాయే యనునది మదనోదన్వతిపదమునకు విశేషణ పదముగా స్ఫురించును కాని సప్తమీ విభక్తి కాదు విశేషణమూ కాదు చతుర్థీ విభక్తి. దానయోగ్య వ్యక్తే చతుర్థీ విభక్తి యందుండును, దీనిని సంప్రదాన మందురు. ఇది గుప్తముగా నున్నది.

మదనోదన్వతి మగ్నాపి = అనురాగ సాగరమున మునిగినదై నను, అసావారవనితా = ఈ వేశ్య, లావణ్యాశాలిన మపి = సౌందర్య సంపన్నమైనను, స్వాత్మానమ్ =తనశరీరమునను(తనఆత్మను) అనంతరాయే, అనంత = అంతు లేని,రాయే = ధనము గలవాని కొరకు, అశంకమ్ = నిస్సంశయముగా, అర్పయతి = సమర్పించును.

**అంభోరుహమయే స్నాత్వా వాపీపయసి కామినీ**
**దదాతి భక్తి సంపన్నా పుత్రసౌభాగ్యకామ్యయా 116**

అంభోరుహమయే అనుచోట సంప్రదానము గుప్తమైనది.ఇది వాపీ పయస్సునకు విశేషణ భ్రాంతికల్గించును.కానిఇందుఅంభోరుహమ్ అయే అనుపదములు రెండున్నవి. అయే అనునది చతుర్థీ విభక్తి.

కామినీ = కామవతియైన స్త్రీ, భక్తి సంపన్నా = భక్తి సంపత్తి కలదై, పుత్ర సౌభాగ్య కామ్యయా= సుందరుడగు కుమారుడు కలుగవలయును గాఢాభిలాషతో, వాపీపయసి = దిగుడు బావినీట, స్నాత్వా = స్నానము జేసి, అయే = మన్మథుని కొరకు, అంభోరుహమ్ = తామరను, దదాతి = ఒసగుచున్నది(ఇః యన మన్మథుడు,ఈశబ్దము హరి శబ్దమువలె నుండును)

**అపాదాన గుప్తముః-**

**శిలీముఖైస్త్వయా వీర దుర్వారైః నిర్జితో రిపుః**
**బిభే త్యత్యంతమలినో వనేపి కుసుమాకులే 117**

పంచమీ విభక్తి గుప్తముగా నుండునది అపాదాన గుప్తము, అత్యంత మలినః అనునది విశేషణమును కొందుము. కాని ఇందు పంచమీ విభక్తి గూఢముగా నున్నది.

వీర! = ఓవీరుడా!, త్వయా = నీచే ప్రయుక్తములైన, దుర్వారైః

= వారింపనలవికాని, శిలీముఖైః = బాణములచే, నిర్జితః = ఓడింపబడిన
రిపుః = శత్రువు,కుసుమాకులే =పూలుక్రిక్కిరిసియున్న, వనేపి
అడవియందును, అలినః = తుమ్మెదనుండి, అత్యంతమ్ = మిక్కిలి, బిభే
= భీతిజెందుచున్నాడు(తుమ్మెదకు శిలీముఖమను పేరు కలదు)

నీశత్రువు నీ వలన గ్రామాదులయందు, తుమ్మెదల వలన వనమునందును నివసింపలేక పోవుచున్నాడు, అలుల జూచినపుడ నీశిలీముఖస్మరణ కల్గి బెదరిపోవుచున్నాడని, విరహ పరితప్తుడగ చున్నాడనియు భావము,

అత్యంత మలినః అనుచోట మిక్కిలి మలినుడని తోచినట్ల అత్యంతమ్ అలినః అని స్ఫురింపదు అలినః అనునది నకారాంతము పంచమ్యంతము.

**సరసీతోయ ముద్ధృత్య జనః కందర్పకారకమ్**
**పిబ త్యంభోజసురభి స్వచ్ఛ మేకాంతశీతలమ్ 118**

సరసీతోయమ్ అనుచోట పంచమీ విభక్తి గుప్తముగా నున్నది.

అయంజనః = ఈజనము, అంభోజసురభి = తామర తావిగలద స్వచ్ఛమ్ = నిర్మలమైనది, ఏకాంత శీతలమ్= ఒకచో చల్లగా నున్నది దర్పకారకమ్(దర్పక+అరకమ్) = కామ వికారము కలిగించునట్టి, కమ్ జలమును, సరసీతః = సరోవరమునుండి, ఉద్ధృత్య = ఎత్తి(తీసికొని) పిబతి = త్రాగుచున్నది.

సరసీతోయమ్ అనునపుడు సరోజలమని స్ఫురించినట్లు సరసీత అయమ్ అని స్ఫురింపదు. సరసీతః యనునది తసిల్ ప్రత్యయాంతము

**తూణేవ మధుమాసేఽస్మిన్ సహకారద్రుమం.జరీ**
**ఇయ మున్నిద్రముకులైః భాతి న్యస్త శిలీముఖా 119**

ఇందు షష్ఠీ విభక్తి గుప్తముగా నుండును.

ఉన్నిద్రశిలీముఖైః అనునది తృతీయా విభక్తి భ్రాంతి నాపాదించును కాని - ఇందు షష్ఠీవిభక్త్యంతము గుప్తముగానున్నది.

అస్మిన్ మధుమాసే=ఈవసంతమాసమునందు,ఉన్నిద్రశిలీముఖా= ఉప్పొంగెడి తుమ్మెదలుగల, ఇయం సహకారద్రుమంజరీ = ఈ తీయమావి పూల గుత్తి మన్మధునియొక్క, న్యస్తశిలీముఖా = నింపబడిన బాణములుగల, తూణేవ = పొదివలె, భాతి = ప్రకాశించుచున్నది.

మన్మథునకు మామిడికూడ ఒక శిలీముఖమే.ఉన్నిద్రశిలీముఖైః, సంతసించు తుమ్మెదలతో అని స్ఫురించినట్లు ఉన్నిద్రశిలీముఖా ఏః అని స్ఫురింపదు.ఏః అనునది ఇ శబ్దముయొక్క షష్ఠీవిభక్తి ఏకవచన రూపము.

భాను ర్వై జాయతేలక్ష్మ్యా సరస్వత్యాఽథవా మతా
అత్ర షష్ఠీపదం గుప్తం మర్యాదా దశవార్షికీ 120

ఇట గుప్తముగా నున్న షష్ఠీ విభక్త్యంతపదము తెలిసికొన పదేండ్ల వ్యవధి కల్పింపబడినది.

సూర్యుడు లక్ష్మితోగాని, సరస్వతితోగాని ఉదయించునని సామాన్యముగా వచ్చు అర్థము.

భానుః అనుచోట షష్టి విభక్త్యంతము గుప్తమైనది.

లక్ష్మ్యావా = సంపదతోగాని, అథవా = లేక సరస్వత్యా వా = విద్యతోగాని మతా = సమ్మతమైన, భాః = కాంతి, నుః = పురుషునకు, జాయతే=ఉదయించును,వై =నిశ్చయము.

భానుఃఅనునపుడు సూర్యుడను అర్థము స్ఫురించునటు భా+నుః (కాంతి,పురుషునకు) అనిస్ఫురింపదు నుః అనునది నృశబ్దము యొక్క షష్ఠీ విభక్తి - ఏకవచనరూపము.నుః

**అధికరణ గుప్తముః-**

యా కటాక్షచ్ఛటాపాతైః పవిత్రయతి మానవాన్
ఏకాంతే రోపిత ప్రీతిః అస్తి సా కమలాలయా 121

ఏ కమలాలయ తన క్రీగంటి చూపుల ప్రసరింపజేసి మానవకోటిని పావనము జేయుచున్నదో, ఆకమలాలయ రహస్యముగా మరులుగొని యుండునని విపరీతముగా అర్థముపస్థితమగును. ఇందు ఎవరియందు మరులు గొనునో ఆవ్యక్తియు గుప్తపరచబడెను.యా = ఏలోకమాత, కటాక్షచ్ఛటాపాతైః =క్రీగంటి చూపుల ప్రసారములచే, మానవాన్ = మానవులను, పవిత్రయతి = పవిత్రుల జేయుచున్నదో, సా అట్టి కమలాలయా = పద్మవివాసినియైన లక్ష్మీదేవి (లోకమాత) కటాక్షచ్ఛటా - పాతైః = రసతరంగితాపాంగ భంగీ ప్రసారములచే,కాంతే = మనోహరుడైన, ఏ = విష్ణువు యందు, రోపిత ప్రీతిః = అంకురింపజేయబడిన ప్రేమ గలదై, (భవతి) అగుచున్నది.

ఏకాంతే అనునపుడు ఏకాంతమున అను అర్థము స్ఫురించునట్లు +కాంతే అని స్ఫురింపదు.అః విష్ణువు, 'అ' యొక్క సప్తమీ విభక్తి ఏకవచనము ఏ అనునది , ఏఅను సప్తమీ విభక్త్యంతము గుప్తముగా నున్నది.

## సంబోధన గుప్తము :-

కమలే కమలే నిత్యంమధూని పిబత స్తవ
భవిష్యంతి సందేహః కష్టం దోషాకరోదయే 122

ఇట కమలే యను చోట సంభోధన పదము గుప్తముగా నున్నది.

అలే! = ఓతుమ్మెద !కమలే = తామర యందలి,మధూని =తేనియను, నిత్యమ్ = అవిచ్ఛిన్నముగా, కమ్ = సుఖమున, పిబతః= త్రాగెడి, తవ = నీకు, దోషాకరోదయే (పతి) = చంద్రోదయమగున- పుడు, కష్టం భవిష్యతి = కష్టము కలుగును. సందేహః న = సందియము లేదు.

కమలే అనునపుడు కమలమందనియో లేక ఓ కమలా యనియో స్ఫురించునట్లు కమ్+ అలే అని స్ఫురింపదు.

**పిబత స్తే శరావేణ వారి కల్హారశీతలమ్**
**కేనేమౌ దుర్విదగ్ధేన హృదయే సంనిరోపితౌ 123**

శరావేణ అనుచోట సంబోధనాంతము గుప్తముగా నున్నది.

ఏణ = ఓ హరిణమా !, కల్హార శీతలమ్ = ఎఱ్ఱ దామరలచే చల్లనైన, వారి = నీటిని, పిబతఃతే = త్రాగు చున్న నీ యొక్క, హృదయే = రొమ్మునందు, కేన దుర్విదగ్ధేన = ఏదుర్మార్గునిచే, ఇమౌ శరౌ = ఈ రెండు బాణములు, సంని రోపితౌ = నాటబడినవి.

శరావేణ యనునది తృతీయాన్త మనుకొందురు కాని 'శరౌ+ఏణ' యను విభాగ బుద్ధి తోచదు.

**వటవృక్షోమహా నేష మార్గ మాకృత్యతిష్ఠతి**
**తావత్ త్వయా నగంతవ్యం యావ న్నాన్యత్ర గచ్ఛతి 124**

ఇదిగో పెద్ద మఱ్ఱి చెట్టు త్రోవ నావరించియున్నది. ఇది మరియొక చోటునకు వెళ్లుదాక నీవు వెళ్లరాదు అని సామాన్యముగా వచ్చు అర్థము ఇది అసంబద్ధముగా నున్నది.

వట వృక్షఃఅనుచోట సంబోధనాంతము కలదు.దీనిని పండితుడును గ్రహిం పలేడు.

వటో+ఋక్షః = (అవాదేశము వలన) వటవృక్షః, అనురూప మేర్పడును.

వటో = ఓ బ్రహ్మచారీః(బాలకా) ఏషఃమహాన్ ఋక్షః = ఇదిగో గొప్ప ఎలుగు,మార్గమ్ అవృత్యతిష్ఠతి = త్రోవనాక్రమించి నిల్చియున్నది, యావత్ అన్యత్రో న గచ్ఛతి = ఇది ఎంత వరకు వేరు చోటున కేగదో, తావత్ త్వయా న గంతవ్యమ్ = అందాక నీ వా దారిని వెళ్లరాదు.

## కర్తృ కర్మ క్రియా గుప్తముః-

**భవానిశంకరోమేశం ప్రతిపూజాపరాయణః**
**కర్తృ కర్మక్రియా గుప్తం యో జానాతి స పండితః 125**

ఇట గుప్తముగా నున్న కర్తృ కర్మ క్రియల నెరిగినవాడు పండితుడగును. భవాని శంకరోమేశమ్‌అనుచోట కర్తృ కర్మ క్రియలు కలవు. భవ+అనిశమ్+ కర+ ఉమేశమ్, అని పదముల విడదీయవలయును.

కర = ఓ హస్తమా!, అనిశమ్ = ఎల్లప్పుడు, ఉమేశంప్రతి = పరమేశ్వరు నుద్దేశించి, పూజాపరాయణః = ఆరాధించుట యందాసక్తి కలదానివి, భవ = అగుము.



## గూఢ చతుర్థ పాదము :-

నాల్గవ పాదము మూడు పాదముల గుప్తమగునది గూఢ చతుర్థపాదము

**పాతాతురాణాం బోధైక్యమయో ధుర్యాప్తి స్సూ స్సతామ్**
**దలితై నస్సముదయః పాతు వో మధుసూదనః 126**

ఆతురాణామ్ = ఆపన్నులను, పాతా = రక్షించువాడు, బోధైక్యమయః = నిత్యమైన జ్ఞానములకంటె వేరుకాని వాడు, (అద్వైతుల మతమున జ్ఞానబ్రహ్మలక భేధము) సతాం ధురి ఆప్తిసూః = వ్యావహారిక సత్తావత్తైన జగత్తు కంటె అధిక సత్తావంతుడగుటచే పారమార్థిక సత్తాశాలియైనవాడు, ('ప్రాణావై సత్యం తేషామేష ఏవ సత్యః' అని శ్రుతి) దలిత ఏన స్సదయః = పాపసంతానమును విదలించెడి, మధుసూదనః = నారాయణుడు, వః పాతు = మిమ్ము రక్షించుగాత.

పై గీతలు గల అక్షరములందు చతుర్థ పాదము గుప్తమైనది. వబయోరభేదః అను నియమప్రకారము 'బో' 'వో' అగును,

**జన్మాదికా దశా యస్మాత్ తిస్రోస్య స్మయవర్జితాః**
**రమ్యః శాస్తా సదా నస్స జయతి స్మరశాసనః 127**

యస్మాత్ = ఎవనివలన, జన్మాదికా దశాః = జగత్తునకు సృష్టి స్థితిలయ రూప దశలేర్పడుచున్నవో (జన్మాద్యస్య యతః అని వేదాంత సూత్రము)

యస్య = ఎవనికి, స్మయవర్జితాః = అవిద్యా శూన్యములైన, తిస్రః దశాః = నిత్య శుద్ధ బుద్ధములను మూడు స్వభావములున్నవో, రమ్యః = ఆనందమయుడు నః సదా శాస్తా = అస్మదాదుల నెల్లపుడు ప్రేరణ జేయువాడు (ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి ద్యావా పృథివీ విధృతే తిష్ఠతః అని శ్రుతి) సః స్మరశాసనః = అట్టి సదాశివుడు, జయతి = సర్వోత్కృష్టుడగుచున్నాడు.

**ప్రశ్నోత్తరము :-**

ప్రశ్నయందుత్తర మిమిడి యుండునది ప్రశ్నోత్తరము.

**పంపాసరసి రామేణ సస్నేహం సవిలాసయా**
**సీతయా కిం కృతం సార్ధమ్ అత్రైవోత్తరమీక్ష్యతామ్ 128**

పంపాసరసి = పంపా సరస్సునందు, రామేణ = రామునిచే,సవిలాసయా = విలాసవతియైన, సీతయా సార్ధమ్ = సీతాదేవితోగూడ, సస్నేహం = స్నేహపూర్వకముగా, కింకృతమ్ = ఏమి చేయబడెను, అత్రైవ = ఈశ్లోకముననే, ఉత్తరమ్ = ప్రశ్నకు జవాబు, ఈక్ష్యతామ్ = ఆలోకింపబడుగాక

రాముడు సీతతోగూడ పంపా సరోవరమున ఏమి యొనరించెను? అను ప్రశ్నకుత్తర మీశ్లోకముననే యున్నదని భావము.సస్నేహం సవిలాసయా అనినచో ప్రశ్న యగును. సస్నే హంస విలాసయా యనినచో ఉత్తరమగును.

హంసవిలాసయా సీతయా సార్ధమ్ = అంచయొయ్యారముగల జానకి తోగూడ, సస్నే = స్నానము చేయబడెను అను ఉత్తరము.

కాంతయో కాంతసంయోగే కిమకారి నవోఢయా
అత్రాపి చోత్త రం వక్తుమ్ అవధిర్ బ్రహ్మణో వయః 129

కాంత సంయోగే = ప్రియ సంగముకాలమందు, నవోఢయా కాంతయా = క్రొత్తగా పెండ్లాడిన అందగత్తెచే,కిమ్ అకారి = ఏమి యొనర్చబడెను, అత్రాపిచ = ఈ విషమయునను, ఉత్తరం వక్తుమ్ = జవాబీయ, బ్రహ్మణః వయః అవధిః = బ్రహ్మదేవుని ఆయుఃకాలము వ్యవధి.

అత్రాపి అనునది పై ప్రశ్నకు ఉత్తరము. సిగ్గు పొందబడెనని అర్థము.ప్రియసంగముకాలమున నవోఢ సిగ్గుపడెనని భావము.

కస్య మరౌ దురధిగమః కమలే కః కథయ విరచితావాసః
కైః స్తుష్యతి చాముండా రిపవస్తే కుతో భ్రష్టాః 130

ప్ర- కస్య మరౌ దురధిగమః = ఏది ఎడారిలో లభింపదు ?
ఉ-కస్య = జలము (ఎడారిలోలభింపదు)
ప్ర- కః కమలే విరచితావాసః = ఎవడు తామర యందు నివాస మేర్పరచు కొనెను?
ఉ-కః = బ్రహ్మ
ప్ర- చాముండా కైః తుష్యతి = కాళికాదేవి వేనిచే సంతసించును? కథయ = చెప్పుము
ఉ- కైః = మస్తకములచే
ప్ర- తే రిపవః కుతః భ్రష్టాః = నీ శత్రువులు దేని నుండి చ్యుతులైరి?
వద = ఉత్తరమిమ్ము
ఉ- కుతః = భూమి నుండి (భూరాజ్యము నుండి) 'క' శబ్దమునకు నీరు, బ్రహ్మ,శిరస్సు మున్నగు అర్థములున్నవి

**కం సంజఘాన కృష్ణః కా శీతలవాహినీగంగా**
**కేదారపోషణరతాః కం బలవంతం న బాధతే శీతమ్ 131**

ప్ర- కృష్ణః కం సంజఘాన = కృష్ణుడెవని సంహరించెను?
ఉ- కంసమ్ =కంసుని
ప్ర- శీతల వాహినీ గంగా కా = గంగానది ఏప్రదేశమున చల్లదనము వహించును?
ఉ- కాశీతలవాహినీ = కాశీప్రదేశమున చల్లదనము వహించును.
ప్ర- కే దారపోషణ రతాః = ఎవరు భార్యా పోషణ ప్రవీణులు?
ఉ- కేదారంపోషణ రతాః = వ్యవసాయ పోషణనిరతులు
ప్ర- శీతం కం బలవతం న బాధతే = చలి ఏ బలవంతుని బాధింపదు?
ఉ- కంబలవంతమ్ = గొంగడి కలవానిని

ఇందు విలంబముగా ఉచ్చరించినచో ప్రశ్న, అవిలంబముగా నుచ్చరించినచో ఉత్తరము వచ్చునట్లు పదము లల్లబడినవి.

**కః కుర్యా ద్భువనం సర్వం క స్సమున్మూలయే ద్ద్రుమాన్**
**కిం ప్రతీకే భవే న్ముఖ్యంముం కః పరత్రైతి పూజ్యతామ్ 132**

ప్ర- సర్వం భువనం కః కుర్యాత్ = సమస్త ప్రపంచము నెవడు సృజించును?
ఉ- కః = బ్రహ్మ
ప్ర- కః ద్రుమాన్ సమున్మూలయేత్ = ఎవడు వృక్షములను పెకలించును?
ఉ- కః = వాయువు
ప్ర- కిం ప్రతీకే ముఖ్యం భవేత్ = ఏది గాత్రమునందు ప్రధానమగును
ఉ- కిమ్ = శిరస్సు(సర్వస్య గాత్రస్య శిరః ప్రధానమ్ అని న్యాయము)
ప్ర- కః పరత్ర పూజ్యతామ్ ఏతి = ఎవడు పరలోకమున సత్కారము నందును

ఉ- కః = రాజు

సీమంతినీషు కా శాంతా రాజాఽ భూత్ కో గుణోత్తమః
విద్వద్భిః కా సదా వంద్యా అత్రైవోక్తం న బుధ్యతే 133

ఇందు ప్రశ్నలకిందే ఉత్తంమీయబడినది కాని గ్రహింపలేరు, మూడు పాదములలో ప్రతి పాదమున మొదటి అక్షరము చివరి అక్షరము కల్పినచో ఉత్తరము వచ్చును.

ప్ర- సీమంతినీషు కా కాంతా = స్త్రీలలో శాంతమూర్తి ఎవతె?
ఉ- సీతా = సీతాదేవి
ప్ర- విద్యా = విద్య
ప్ర- రాజా కః గుణోత్తమః అభూత్ = ఏ రాజు గుణ శ్రేష్ఠుడుగా నుండెను?
ఉ- రామః = శ్రీరాముడు

కో విదో నిధి రాఖ్యాతః కో పకృష్టో భవేత్ పుమాన్
ఇతి ప్రశ్నేఽ నురూపం యత్ ఉత్తరం తదుదీర్యతామ్ 134

ఇందు ప్రశ్నా నుగుణమైన ఉత్తర మీయుము.

ప్ర- కః విదః నిధిః ఆఖ్యాతః = ఎవడు జ్ఞానమునకు నిధిగా చెప్పబడును?
ఉ- కోవిదః = పండితుడు
ప్ర- కః పుమాన్ అపకృష్టః భవేత్ = ఎవడు నీచ పురుషుడగును?
ఉ- కోపకృష్ణః = కోపా విష్టుడు

వాస్తవముగా ఇందు ఉత్తరము స్ఫురించునట్లు ప్రశ్న స్ఫురించుట లేదు కావున ఇది ఉత్తరోచిత ప్రశ్న యనుట ఉచితము.

కింపాకంపాప్యవై రస్యం ఫల మాకలయ త్యలమ్
బ్రూహి కాంచన మాలాంచ కాంధత్తే నస్స్పృహం జనః 135

ప్ర- పాప్యం కింఫలం వై రస్యం అలమ్ ఆకలయితి = పండునపుడు విరసముగా నుండు ఫలమేది? బ్రూహి = చిప్పుము.

ఉ- కింపాకము = ఇంద్రవారుణీ ఫలము (ఇది పరిపక్వ మగునపుడు తిక్తముగా నుండును)

ప్ర- జనః కాంచన కాం మాలాం సప్ప్రహంధత్తే = ప్రజ ఏ మాలను మక్కువతో ధరించును?)

ఉ- కాంచనమాలామ్ = స్వర్ణమాలను

**అంతరాలాపము:-**

పలు ప్రశ్నలకు నొకే పదముత్తరముగా పద్యము నందే కూర్చ బడునది అంతరాలాప ప్రహేళిక. ఇది సందర్భానుసారముగా వ్యస్త - సమస్త- మిశ్ర రూపమున నుండును. ఉదాహరణములలో వైవిధ్యము గోచరించుట వలన పై విభాగము చేయబడినది.

**జ్ఞాయంతే కుత్ర విద్వాంసః తదాభాసాశ్చ కథ్యమ్**
**కీదృ గ్వీరకులం హంతిరిపూన్ 'సదసి' ధీనిధే! 136**

ఇట 'సదసి' యనునది ఇందలి రెండు ప్రశ్నలకు ఉత్తరము.

ప్ర- ధీనిధే = ఓ ప్రాజ్ఞ ః కుత్ర =ఏ ద్రేశమునః విద్వాంసః తత్ ఆభాసాశ్చ =పండితులు మరియు పండితమ్మన్యులు, జ్ఞాయన్తే = ఎరుగబడుదురు, కీదృక్ వీరకులం రిపూన్ హంతి = వీరవర్గమెట్టిదై శత్రువులను సంహరించును, కథ్యతామ్ = రెండు ప్రశ్నలకు ఉత్తరము నిచ్చు ఒకే పదము చెప్పుము.

ఉ- ధీనిధే = ఓ ప్రజానిధీ!, సదసి = సదసి యనునది ప్రశ్న ద్వయమున కుత్తరము.

1 సదసి = సభలో, (పండితులు పండితమ్మన్యులు ఎరుగబడుదురు) పండితా పండిత లక్షణము సభలో తెలియునని భావము.

2 సదసి = సత్ + అసి = దివ్యమగు ఖడ్గము గలదై (వీర వర్గము శత్రువుల సంహరించును)

సదసి యనునది మెదటి ప్రశ్న విషయమై వ్యస్తమగు సమాధానము, రెండవప్రశ్నకు సమస్త (సమాస యుక్త)మని గ్రహింపవలెను.

**గోకులే క్రీడతా భంగః కస్యా క్రియత చక్రిణా**
**ఖరాదయో వినేశు స్తే ప్రేషాం ప్రాప్య కుతోఽనసః 137**

ఇందు రెండు ప్రశ్నలకు 'అనసః' అనునది ఉత్తరము.

ప్ర- గోకులే క్రీడతా కృష్ణేన = గోకులము నందు క్రీడించుచున్న కృష్ణునిచే, కస్య భంగః అక్రియత = ఎవని యొక్క వినాశము చేయబడెను?

ఉ- అనసః = శకటాసురుని యొక్క

ప్ర- తేఖరాదయః కుతః ప్రేషాం ప్రాప్య వినేశుః = ఆఖందూషణాదులు ఎవతె నుండి ప్రేరణనంది నశించిరి?

ఉ- అనసః = శూర్పనఖ నుండి (ముక్కు లేనిది - లక్ష్మణచ్ఛిన్న నాసిక)

అనసః అనునది మొదటి పక్షమున వ్యస్తమున (సమాసరహితము) రెండవ పక్షమున సమస్తము(సమాస సహితమని గ్రహింపవలెను.)

**ఆద్యుత్తర ప్రహేళిక :-**

**ప్రహితః కీదృ గ్విహితో జగామ రామేణ మారుతి ర్లంకామ్**
**రజ్వాది వ్యతిరేకైః తోయం న ప్రాప్యతే కస్మాత్ 138**

ఇందు ఉత్తరము మొదట నుండును కావున ఇది ఆద్యుత్తర ప్రహేళిక. 'ప్రహితః' యనునది ఇందలి ప్రశ్నల కుత్తరము.

ప్ర- విహితః మారుతిః రామేణ కీదృక్ లంకాం జగామ = విధేయుడైన హనుమంతుడు రామునిచే నెట్టివాడై లంకా నగరమున కేగెను?

ఉ- ప్రహితః = పంపబడినవాడై

ప్ర- రజ్వాది వ్యతిరేకైః తోయం కస్మాత్ న ప్రాప్యతే=త్రాడుబొక్కెన మున్నగునవి లేక దేని నుండి నీరు గ్రహింపబడదు?

ఉ- ప్రహితః = నూతి నుండి

**కురవః కీదృక్ పరభృతతరుణ స్త్వయి భాతి జల్పంత్యామ్**
**భీమం ప్రాప్య విలీనాః సహోదరాః కే శతం బ్రూహి 139**

ఇదియు ఆద్యుత్తర ప్రహేళ్యికయే-

ఇందు 'కురవః' అనునది ప్రశ్నద్వయమునకు ఉత్తరము.

ప్ర- త్వయి జల్పంత్యాం పరభృతతరుణః కీదృక్ భాతి = నీవు మాటలాడు చుండ గండు కోయిల ఎట్టిదై యొప్పును?

ఉ- కురవః = నింద్యధ్వని కలదగును.

ప్ర- భీమం ప్రాప్య విలీనాః శతం సహోదరాః కే = భీముని పొంది (చూచి) దాగిన నూరుగురు సోదర లెవరు ?బ్రూహి = రెంటికి నొకే ఉత్తర పదము చెప్పుము

ఉ- కురవః = కౌరవులు

**మధ్యోత్తర ప్రహేళికః-**

**కీదృశం బిభర్తి స్వాంతం విబుధా వద విద్యుతమ్**
**కాంవా కనకలేఖాభాం కలయంతి బలాహకాః 140**

ఇందుత్తరము మధ్యలో నుండును.

ఇందు 'విద్యుతమ్' అనునది ఉత్తరము.

ప్ర- విబుధాః కీదృశంస్వాంతం బిభ్రతి = పండితులు ఏవిధమైన హృదయము భరింతురు?

ఉ- విద్యుతమ్ = జ్ఞానయుక్తమైన హృదయము (విత్ =జ్ఞానముతో, యుతమ్ = కూడుకొనినది)

ఉ- బలాహకాః కనక లేఖాభాం కాంవా కలయంతి = మేఘములు సువర్ణ రేఖా రుచిరమగు దేనిని పొందును?

ఉ- విద్యుతమ్ = మెఱపును (వద = రెంటికి సరిపోవు నుత్తరము చెప్పుము) (విద్యుతమ్ అనునది రెంటికి సరిపోవునది)

**పాపాత్ కా క్రియతే సద్భిః ఉదీరయత భీరవః**
**ఆకాశస్య గుణః కోవా వీరేభ్యః కేచ బిభ్యతి 141**

ఇది న్యస్తోత్తర ప్రహేళిక - ఇందు మూడు ప్రశ్నలకు 'భీరవః' అనునది ఉత్తరము.

ప్ర- సద్భిః పాపాత్ కా క్రియతే = సత్పురుషులచే పాపము వలన నేదవలం బింపబడును?

ఉ- భీః = భయము (సత్పురుషులు పాపమునకు వెరతురు)

ప్ర- ఆకాశస్య కోవా గుణః = ఆకాశమునకు ప్రధాన గుణమేది?

ఉ- రవః = శబ్దము (శబ్దగుణక మాకాశము)

ప్ర- వీరేభ్యః కేచ బిభ్యతి = వీరుల కెవరు భయపడుదురు?

ఉ- భీరవః = కాతరస్వభావులు (చావన్న వెరచువారే వీరులకు వెరతురు)

భీః రవః ,భీరవః అను మూడుత్తరములును న్యస్తములే, భీః + రవః = (రోరి, అను సూత్రముచే విసర్గ లోపింప) భీరవః అని యగును.

అంతోత్తర ప్రహేళికః-

**జనమేజయేన జుహవాంబభూవిరే జాతవేదసి ముఖే కే**
**ప్రభురపి కీదృగ్ జేతుం నై వోత్సహతే మహీ మహాయః 142**

ఇందు చివర ఉత్తరముండును. 'అహయః' అనునది ఉత్తరము

ప్ర- మఖే జనమేజయేన కే జాతవేదసి జుహవాం బభూవిరే =యాగము నందు జనమేజయునిచే ఏవి అగ్ని యందు వేల్చబడెను?

ఉ- అహయః = సర్పములు- (అహి శబ్ద బహువచన రూపము)

ప్ర- ప్రభురపి కీదృక్ మహీం జేతుం నైవోత్సహతే = ప్రభువైనను తాను ఎట్టివాడై భూమిని కైవసము జేసికొన నుత్సాహము జూపడు?

ఉ- అహయః = గుర్రములు లేనివాడై (యస్యాశ్వాస్తస్య మేదినీ =గుర్రము లెవని కుండునో, వానిదే భూమి యగునని న్యాయము.)

పృథ్వీసంబోధనం కీదృక్ కవినా పరికల్పితమ్
కేనేదం మోహితం విశ్వం ప్రాయః కేనాప్యతే యశః 143

ఇందుమూడు ప్రశ్నలకు 'కవినా' యనునది ఉత్తరము.

ప్ర- కవినా పృథ్వీసంబోధనం కీదృక్ పరికల్పితమ్ = కవి పృథివినెట్లు సంబోధించును?

ఉ- కో = కు శబ్దము యొక్క సంబోధన కోయగును కుః అనగా భూమి- ఓభూమి అని అర్థము

ప్ర- ఇదం విశ్వం కేన మోహితమ్ = ఈ ప్రపంచ మెవనిచే మోహింప జేయబడును?

ఉ- ఇనా = మన్మథునిచే, (ఇః = మన్మథుడు తృతీయా విభక్తి- ఇనా)

ప్ర- ప్రాయః కేన యశః ఆప్యతే = తరచుగా నెవనిచే కీర్తి పొందబడును;

ఉ-కవినా = కావ్యకర్తచే,

కో+ ఇనా(అవా దేశమున) కవినా యనిసంధియగును.

**కేభూషయంతి స్తనమండలాని**
**కీదృ క్ప్రియా చంద్రమసః కుత శ్రీః**
**కిమాహ సీతా దశకంఠనీతా**
**హారామహాదేవరతాతమాతః** 144

ప్ర- స్తనమండలాని కే భూషయంతి = స్తనమండలమునెయ్యవి భూషించును?
ఉ- హారాః = ముక్తా సరములు,
ప్ర- ఉమా కీదృశీ = పార్వతిఎటువంటిది?
ఉ- మహాదేవరతా = శివుని యందు ప్రేమ గలది
ప్ర- కుతః చంద్రమసః శ్రీః = దేనివలన చంద్రునకు కాంతి చేకూరును?
ఉ- తమాతః = రాత్రి వలన,(ఆకారాన్తము - తసిలంతము)
ప్ర- దశకంఠనీతా సీతా కిమ్ అహ = రావణుచే గొంపోబడిన సీత ఏమనెను?
ఉ- హారామ = అయ్యో రామ, హాదేవర = అయ్యో మరదీ లక్ష్మణా, హాతాత = అయ్యో తండ్రీ, హా మాతః=అయ్యో తల్లీ,అనిఆక్రోశించెను.

రవేః కవేః కిం సమరస్య సారం
కృషే ర్భయం కిం కిముశంతి భృంగాః
ఖిలా ద్భయం విష్ణుపదంచ కేషాం
'భాగీరథీతీర సమాశ్రితానామ్' 145

ప్ర- రవేః కిం సారమ్ = సూర్యునకు సారభూతమేమి?
ఉ- భా = తేజస్సు
ప్ర- కవేః కిం సారమ్ = కవికి సారభూతమైన దేది?
ఉ- గీః = రసమయి వాక్కు
ప్ర- సమరస్య కిం సారమ్ = యుద్ధమునకు సారభూతమేమి?
ఉ-రథీ = రథికుడు,
ప్ర- కృషేః భయం కిమ్ = కృషి కర్మకు భయము కలిగించునదేది?
ఉ- ఈతిః = అతివృష్టి అనావృష్టి మున్నగునవి (అతివృష్టి రనావృష్టిః మూషకా శ్శలభా శ్శుకాః)
ప్ర- భృంగాః కిమ్ ఉశంతి = తుమ్మెదలు దేనిని గోరును?
ఉ-రసమ్ = పూదేనియను

ప్ర- ఖలాత్ కేషాం భయమ్ = దుర్జనుని వలన నెవరికి భయము కలుగును?
ఉ- ఆఃశ్రితానామ్ = ఆశ్రయించిన వారిక
ప్ర- కేషాంచ విష్ణు పదమ్ = ఎవరికి విష్ణులోక మబ్బును?
ఉ- భాగీరథీతీర సమాశ్రితానామ్ = గంగ యొద్ద నాశ్రయించు వారికి (గంగా స్నాన మొనర్చువారు విష్ణులోకమున కేగుదురనితాత్పర్యము)
భాః+గీః+రథీ+ఈతీః+రసమ్+ఆశ్రితానామ్ = భాగీరథీ తీరసమాశ్రితా-నామ్ అని సంధి

సంతశ్చ లుబ్ధాశ్చ మహర్షిసంఘాః
విప్రాః కృషిష్ఠాః ఖలు మాననీయాః
కింకిం సమిచ్ఛంతి తథైవ సర్వే
నేచ్ఛంతి కిం 'మాధవదాఘుయానమ్ 146

ఇందు ప్రశ్నం కన్నిటికి 'మాధవదాఘుయానమ్' అనునది ఉత్తరము మొదటి అక్షరమునను వరుసగా చివరి అక్షరముతో చేర్చిన యెడం అయా ప్రశ్నలకు ఉత్తరము వచ్చును.

మా
ద
వ
దా
ఘు
యా } నమ్ అని ఊహించుకొనవలయును

ప్ర- సంతః కిం సమిచ్ఛంతి = సత్పురుషులేమి కోరుదురు?
ఉ- మానమ్ = అభిమానమును
ప్ర- లుబ్ధాః కిం సమిచ్ఛంతి = లోభులేమి కోరుదురు?
ఉ- ధనమ్ = విత్తమును

ప్ర- మహర్షి సంఘాః కిమ్ సమిచ్ఛంతి = మహర్షుల బృందము దేనిని బాగుగా కోరును

ఉ- వనమ్= అరణ్యమును (ప్రశాంత వాతావరణ మట నుండును కావున వనము వారికభిలషణీయము)

ప్ర-విప్రాః కిం సమిచ్ఛంతి = బ్రాహ్మణు లేది బాగుగా కోరుదురు?

ఉ- దానమ్ =ఈవిని.

ప్ర- కృషిష్ఠాః కిం సమిచ్ఛంతి = కర్షకులేది బాగుగా నభిలషింతురు?

ఉ- ఘనమ్= మేఘమును (సస్యోచితవర్షమునని భావము)

ప్ర- మాననీయాః కిం సమిచ్ఛంతిఖలు = పూజనీయులుదేనిని బాగుగా కాంక్షింతురు?

ఉ- యానమ్ = యాత్రను (పూజనీయ వ్యక్తులు దేశ సంచారము చేయుదురని సమన్వయము)

ప్ర- తథైవ సర్వేకిం సేచ్ఛంతి = ఆ విధముగానే అందరు (సత్పురుషాది భేధము లేక నెల్లరు) దేని నభిలషింపరు?

ఉ- మాధవదాఘు యానమ్ - మాధవ = వైశాఖ మాసమునందు, దాఘ= మండు టెండలో, యానమ్ = ప్రయాణమును(అభిలషింపరని తాత్పర్యము)

**కస్మిన్ వసంతి వద మీనగణా వికల్పం**
**కింవా పదం వదతి కిం కురుతే వివస్వాన్**
**విద్యుల్లతావలయవాన్ పథికాంగనానామ్**
**ఉద్వేజకో భవతి కః ఖలు 'వారివాహః'** **147**

ఇందు 'వారివాహః' అనునది ఉత్తరము.

వద = అన్ని ప్రశ్నలకు సరిపోవు నుత్తర పదము చెప్పుము.

ప్ర- కస్మిన్ మీనగణా వసంతి = ఎందు చేపగుంపులు నివసించును?

ఉ- వారి = నీటి యందు ( 'వేకారాంతవాచ్యబ్దము యొక్క సప్తమీ విభక్తి రూపము 'వారి' యనునది)

ప్ర- కింవా పదం వికల్పం వదతి = ఏపదము వికల్పమును (అదియా ఇదియా యను దానిని ) పేర్కొనును?

ఉ- వా= వాయను పదము (సూతోవా సూతపుత్రోవా యోవా కోవా భవామ్యహమ్ ఇత్యాద్యర్థమున 'వా' యనునది వచ్చును)

ప్ర- వివస్వాన్ కిం కురుతే = సూర్యుడు దేనిని జేయును?

ఉ- అహః = దినమును (సూర్యు డహస్కరుడు కదా!)

ప్ర- విద్యుల్లతా వలయవాన్ కః పథికాంగనానామ్ ఉద్వేజకః భవతి = ఎవడు విద్యున్మాలాలాలితుడై విరహిణుల బెదరగొట్టును?

ఉ- వారివాహః = మేఘుడు (వారి = నీటిని, వాహః = మోయువాడు, వారి యనునది ఇక్కడ ఇకారాన్తపదము) వారి+వా+అహః= వారివాహ

**కః ప్రార్థ్యతే మదనవిహ్వలయా యువత్యా**
**భాతి క్వ పుండ్రిక మపైతి కథం బతాయుః**
**క్వానాదరో భవతి కేనచ రజ్యతేఽబ్జమ్**
**బాహ్యోస్తి కిం ఫల ముదాహర 'నాలికేరమ్'** 148

ఇందునులోను విలోమముగా నుత్తరపదము గ్రహించవలయును. 'నాలికేరమ్' అనునది ఉత్తరము.

ఉదాహర=అన్ని ప్రశ్నలకు సరిపోవు నుత్తరమునుదాహరించుము (పేర్కొనుము).

ప్ర- మదన విహ్వలయా యువత్యాకః ప్రార్థ్యతే = కామ వివశురాలైన యువతిచే నెవడు కోరబడును?

ఉ- నా=పురుషుడు

ప్ర- పుండ్రకం క్వ భాతి = తిలకమెట ప్రకాశించును?

ఉ- అలికే = ఫాలమునందు నొసట

ప్ర-ఆయుః కథంబత అపైతి = ఆయువు ఎట్లు తొలిగిపోవును(గడచును)?

ఉ- అరమ్= త్వరగా (ఆయుష్యము క్షీణించును.)

(ఇక విలోమముగా పై పదమును గ్రహింపవలయును)
ప్ర- అనాదరః క్వ భవతి = అనాదరమెవని యందేర్పడును?
ఉ- రంకే = నీచునియందు(నాలికేరం అనునది క్రిందినుండి పైకి చదివినచో ఉత్తరము వచ్చును.)
ప్ర- కేన చ అబ్జం రజ్యతే = దేనిచే తామర ప్రేమింపబడును?
ఉ- అలినా = తుమ్మెదచే,
ప్ర- కిం ఫలం బాహ్యేస్థి భవతి = వెలుపల పెంకుగల కాయయేది?
ఉ- నాలికేరమ్ = కొబ్బరికాయ,

అనులోమముగా నా+అలికే+అరమ్ =నాలికేరమ్,

విలోమముగా- రంకే+అలినా = నాలికేరమ్, అని గ్రహించవలయును.

**కో నిర్దగ్ధ స్త్రి పురరిపుణా, కశ్చ కర్ణ స్య హంతా,**
**నద్యాః కూలం విఘటయతి కః కః పరస్త్రీరతశ్చ,**
**కస్సన్నద్ధో భవతి సమరే, భూషణం కిం కుచానామ్**
**కిం దుస్సంగా ద్భవతి మహతాం 'మానపూజాపహారః 149**

ఇట 'మానపూజాపహారః' అనునది ప్రశ్నంకన్నింటికి ఉత్తరము ముందటి అక్షరముంను వరుసగా చేర్చిన ఆయా ప్రశ్నంకు నాయా ఉత్తరములు లభించును.

మా న పూ జా ప హా

రః మారః, నరః, పూరః, జారః, పరః, హారః, అని గ్రహింపవలయును.

ప్ర- త్రిపురరిపుణా కః నిర్దగ్ధః = శివునిచే నెవడు భస్మీకృతుడయ్యెను?
ఉ- మారః = మన్మథుడు.
ప్ర- కర్ణస్య హంతా కః = కర్ణుని సంహరించిన వాడెవడు?
ఉ- నరః = అర్జునుడు.
ప్ర- కః నద్యాఃకూలం విఘటయతి = ఏటియొడ్డును కూల్చి వేయునదేది?

ఉ- పూరః = ప్రవాహము.
ప్ర-కశ్చ పరస్త్రీరతః = పర స్త్రీనిరతుడెవడు?
ఉ- జారః = వ్యభిచారి
ప్ర- కః సమరే సన్నద్ధో భవతి పోరునకు సిద్ధపడువాడెవడు?
ఉ- పరః = శత్రువు.
ప్ర- కిం కుచానాం భూషణమ్ = వక్షోజములకేది భూషణము?
ఉ- హారః = ముక్తాదామము,
ప్ర- దుస్సంగాత్ మహతాం కిః భవతి = చెడువారితో కలియుటవలన మహాపురుషులకేది చేకూరును?
ఉ- మానపూజాపహారః- మాన = గౌరవముయొక్క, పూజా = సత్కారము యొక్కయు, అపహారః = లోపము సంభవించును. (నీచ సాంగత్యమున మహానీయుల గౌరవ మర్యాదలు మట్టికలియునని భావము)

కస్మిన్ శేతే మురారిః క్వనుఖలు వసతి
ర్వాయసీ, కో నిషేధః,
స్త్రీణాంరాగస్తు కస్మిన్, క్వనుఖలు సితిమా,
వైరిసంబోధనం కిమ్,
సంబుద్ధిః కాఽహిమాంశోః,విధిహరనయసాం
చాపి సంబుద్ధయః , కాః,
బ్రూతే లుబ్ధః కథం వా కురుకులహననం
కేన,తత్ 'కేశవేన' 150

ఇందు 'కేశవేన' యనునది ఉత్తరము ........ అనులోమ-ప్రతిలోమముగా గ్రహించినచో ఆయా ఉత్తరము లభించును,
ప్ర- మురారిః కస్మిన్ శేతే= విష్ణు వెందు నిదురించును?
ఉ-కే = నీటియందు (క్షీరసాగరమునందు)

ప్ర- వాయసీ వసతిః క్వనుఖలు (భవతి) = కాకము దేనియందుండును?
ఉ- శవే- మృతకళేబరమునందు (పీనుగునందు)
ప్ర- కః నిషేధః = నిషేధార్థక (లేదు, వద్దు)పదమెయ్యది?
ఉ- న= 'న' యనునది (న పరదారాన్ గచ్ఛేత్, నానృతం వదేత్, అహం న పిబామి, రామః గృహే నాస్తి ఇత్యాద్యర్థమున వచ్చును)

ప్రతిలోమముగా నుత్తరము.

ప్ర- స్త్రీణాం రాగః కస్మిన్ (భవతి)స్త్రీం కెవనియందు మోహమేర్పడును;
ఉ- నవే = క్రొత్త వాని యందు (లేక నవయువకుని యందు)
ప్ర- క్వను ఖలు సితిమా = ఎవని యందు తెల్లదన ముండును?
శకే = శక జాతీయునియందు (హూణులు మున్నగువారు తెల్లగానుందురు)
తిరిగి అనులోమముగా-
ప్ర- శౌరి సంభోధనం కిమ్ = విష్ణుమూర్తి సంభోధన మెట్లుండును?
ఉ- కేశవ- ఒకేశవా! (యని)
ప్ర- అహిమాంశోః సంబుద్ధిః కా = సూర్యుని నెట్లు సంభోదింతువు?
ఉ- ఇన ! = ఓ సూర్య (యని)
ప్ర- విధి, హర, వయసాంచాపి సంబుద్ధయః కాః = బ్రహ్మ సంబుద్ధి - శివుని సంబుద్ధి -పక్షి సంబుద్ధి నెట్లు తెల్పుదువు?
ఉ- క = ఓ బ్రహ్మ! ఈశ =ఓశివా!, వే = ఓ పక్షియని, బ్రహ్మను శివుని మరియు పక్షిని సంభోధింతును- ('వి' శబ్దము సంబోధనలో 'వే'యని అగును)
ప్ర- లుబ్ధః కథంవా బ్రూతే = లోభి దానాది విషయమై ఏమనును?
ఉ- న =లేదు లేదనును.
ప్ర- కేన కురుకుంహననం (జాతమ్) =ఎవనిచే కౌరవవంశము నశించెను?
ఉ- కేశవేన = కృష్ణునిచే-

అనులోమముగా కే, శవే, న, విలోమముగా నవే,శకే, అనులోమముగ కేశవ, ఇన, క, ఈశ, వే, న, యని, 'కేశవేన'యనునది ఉత్తరమగును.

లంకాభూపనిశాచరో రఘుపతిం

యుద్ధే కథం దృష్టవాన్
దీనం పాతి పితేవ యః పశుపతిః
క స్తస్య వాహః ప్రియః
కేనా పూర్వఫలం నరై స్సుకృతిభిః
కస్మిన్ స్థలే భుజ్యతే
జారా యే భువి తాన్ ప్రశా స్తి కతమో
హ్యేషా మిహైవోత్తరమ్ 151

ఇందు ప్రతి పాదమున ప్రశ్నకు ఉత్తరమున్నది. ప్రతి పాదమునందు మొదటి రెండక్షరముల తారుమారు జేసినచో ఉత్తరము వచ్చును.

ప్ర- లంకాభూపనిశాచరః రఘుపతిం యుద్ధే కథం దృష్టవాన్= రావణుడు యుద్ధమునందు రామునెట్లు చూచెను?

ఉ- కాలమ్= మృత్యువునుగా (లంకా యనునది వ్యత్యస్తమైనచో కాలమ్ అని యగును. శ్లేషాదులలో అనుస్వారము సందర్భోచితముగా మారును. కావున మధ్యనున్న సున్న చివరజేర కాలమ్ అని అయ్యెను)

ప్ర- యః పశుపతిః పితేవ దీనం పాతి తస్య కః ప్రియః వాహః= ఏశివుడు తండ్రి వలె దీనుని బ్రోచునో - ఆశివునకు ప్రియవాహన మెయ్యది? (శివుని వాహనమెయ్యది యనిప్రశ్న)

ఉ- నందీ = వృషభము (దీనం అనునది వ్యత్యస్తమైనచో 'నందీ' యగును)

ప్ర- సుకృతిభిః నరైః అపూర్వఫలం కేన కస్మిన్ స్థలే భుజ్యతే = పుణ్యాత్ములచే యాగాది ఫలము సుఖముగా నే తావున అనుభవించబడును?

ఉ- నాకే = స్వర్గమునందు (కేన = సుఖముగా) ("కేనా పూర్వఫలమ్" అనుచోటనున్న కేనా యనునది వ్యత్యయమంద"నాకే " యని అగును)

ప్ర-భువి యేజారాః,తాన్ కతమః ప్రశాస్తి= లోకమున నెవరు వ్యభిచారులో, వారి నెవడు శాసించును?(జారులను శిక్షించువాడెవడనునది ప్రశ్న)

ఉ- రాజా = రాజు (జారాయను పదమును మార్చినచో రాజాయని అగును)

గచ్ఛంతి క్వాజివహ్నౌ హుతనిజతనవః
కా భినత్తి స్వకూలమ్,
కింస్యాద్యోజ్యం వికల్పే. క్రకచనిభనఖైః
కిం నృసింహేన భిన్నమ్
కీదృగ్ దిత్యాఃప్రసూతిఃకిమనలశమనం,
కా నృపైః పాలనీయా,
కో వంద్యః, కః ప్రమార్ష్టి త్రి భువనకలుషం
'స్వర్ధునీవారిపూరః 152

ఇందు 'స్వర్ధునీవారిపూరః'అనునది ఉత్తరము.

ప్ర- ఆజివహ్నౌ హుతనిజతనవః క్వ గచ్ఛంతి = సంగ్రామాగ్ని యందు తమశరీరముం వేల్చినవారెట కేగుదురు?

ఉ- స్వః = స్వర్గలోకమునకు.

ప్ర- కా స్వకూలం భినత్తి = ఏది తన యొడ్డును పెళ్లగించును?

ఉ- ధునీ = నది.

ప్ర- కిం వికల్పే యోజ్యం స్యాత్ = వికల్పార్థమున నేది ఉపయోగింపబడును?

ఉ- వా = 'వా' అను అవ్యయము.

ప్ర- నృసింహేన క్రకచనిభనఖైః కిం భిన్నమ్ = నరసింహస్వామిచే రంపము వంటి తన గోళ్లతో చీల్చబడినదేది?

ఉ- రిపూరః రిపు = శత్రువైన హిరణ్యకశిపుని యొక్క,ఉరః = వక్షస్థలము

ప్ర-దిత్యాః ప్రసూతిః కా = దితియొక్క (రాక్షసమాత) సంతతి ఎటువంటిది?

ఉ-స్వర్ధునీ = స్వర్గలోకమును గడగడ లాడించునట్టిది(స్వః స్వర్గం ధూనయతి కంపయతీతి స్వర్ధునీ అని విగ్రహము)

ప్ర- అనలశమనం కిమ్ = అగ్నిని చల్లార్చునదేది?

ఉ- వారి =నీరు.

ప్ర- నృపైః కా పాలనీయా =రాజులు రక్షింపదగినదేది?
ఉ- పూః = పట్టణము (దుర్గము)
ప్ర-కః వంద్యః =నమస్కరింపదగిన వాడెవడు?
ఉ- అః = విష్ణువు
ప్ర- కః త్రిభువన కలుషం ప్రమార్ష్టి = ముల్లోకములయందు పాపమును తుడిచి వేయున దెయ్యది?
ఉ- స్వర్ధునీవారి పూరః= వియన్నదీ జల ప్రవాహము-
స్వః, ధునీ, వా, రిపూరః, స్వర్ధునీ, వారి , పూః, అః = స్వర్ధునీవారి పూరః అని 9 ప్రశ్నలకు ఉత్తరము.

**పూంపుః సంభోధనం కిం, విదధతి కరిణాం**
**కేరుచోఽగ్నే ర్ద్విషత్ కిమ్**
**కా శూన్యా తే రిపూణాం నరవర, నరకం**
**కోఽ వధీత్ రోచకం కిమ్,**
**కేవా వర్ణానునస్యు, ర్విసమివ హరిణా**
**కిం నఖాగ్రై ర్విభిన్నమ్**
**కోవా మార్గం విసర్పన్ విఘటయతి తరూన్**
**'నర్మదా వారిపూరః'** 153

ఇందు'నర్మదావారిపూరః' అనునది ఉత్తరము
ప్ర- పుంసః సంభోదనం కిమ్ =నరుని నెట్లు సంభోదింతువు?
ఉ- నః = (నృ)శబ్దము యొక్క సంబోధన 'నః.' ) ఓ నరుడా.
ప్ర- కరిణాం కేరుచః విదధతి = ఏనుగులకుశోభలను గూర్చినవేవి?
ఉ- మదాః = మదరేఖలు-
ప్ర- ఆగ్నేః ద్విషత్ కిమ్= అగ్నికి వైరి యేది?
ఉ- వారి = జలము-
ప్ర- నరవర తే రిపూణాం కా శూన్యా = ఓరాజా! నీ శత్రువులకు సంబధించిన దెయ్యది రిత్తపోయినది?

ఉ- పూః =పట్టణము (శత్రువులు పారిపోవుటచే వారి పురములు శూన్యములైనవని భావము)
ప్ర- కః నరకమ్ అవధీత్ = నరకాసురు నెవడు చంపెను?
ఉ- అః = కృష్ణుడు (విష్ణువు)
ప్ర- రోచకంకిమ్=చమత్కారకమైన దేమి?
ఉ-నర్మ = హాస్యము.
ప్ర- వర్షాసు కేవానస్యుః = వర్షాకాలములందేవి (వనములందు) సంభవింపవు?
ఉ- దావాః = కార్చిచ్చులు-
ప్ర- సఖాగ్రైః హారిణా కిం బిసమివ విభిన్నమ్ = గోటికొనంతో విష్ణువుచే (నరసింహునిచే) తామరతూడువలె నేది త్రెంచబడెను?
ఉ- రిపూరః = హిరణ్యకశిపుని వక్షము-
ప్ర-కోవా మార్గం విసర్పన్ తరూన్ విఘటయతి = త్రోవనంటి పారుచు చెట్లను గూల్చునదేది?
ఉ- నర్మదావారి పూరః= నర్మదానదీ జల ప్రవాహము-
నః, ముదా, వారి,పూః, అః, నర్మ, దావాః, రిపూరః, 'నర్మదావారి పూరః' అని 9 ప్రశ్నలకు ఉత్తరములు

కిం తృష్ణాకారి, కీదృగ్ రథచరణ, మహో
రౌతి కః, కాఽబ్ధికాంచిః,
కోఽపస్మారీ, భుజంగే కిము, కలిశమనం,
త్వార్యసంబోధనం కిమ్
కా సుందర్యా, మపీందుఃకథ, మవని భృతః
కాచ సంబుద్ధిరగ్నేః
బీజం కిం, కావనీజారమణ మతి హరా
'హేమసారంగలీలా' 154

'హేమసారంగలీలా'యనునది ఉత్తరము. ఇందు అనులోమ విలోమముగా ఆయా ప్రశ్నలకు ఉత్తరములు లభించును.

ప్ర- కిం తృష్ణాకారి = ఆశగొల్పునదేది?
ఉ- హేమ =బంగారము.
ప్ర- రథచరణం కీదృక్ = చక్రమే విధముగా నుండును?
ఉ-సారమ్ = ఆకుంతో కూడియుండును(అరైఃసహవర్తతే ఇతి సారమ్)
ప్ర- అహో కః రౌతి = చక్కగా నెవడు పాడును?(చక్కగా నేది కూయును)
ఉ- గలీ= మంచికంఠము కలవాడు (మంచి గొంతుకలది కోయిల మున్నగునది)
ప్ర- కా అబ్ధికాంచిః = సాగరము మొలనూలుగా గలదేది?
ఉ-ఇలా =భూమి
ప్ర- కః అపస్మారీ = అపస్మారరోగముకలవాడెట్లుండును?
ఉ- లాలీ = లాల (నోటిచొంగ) కలిగియుండును, (విలోమముగా)
ప్ర- భుజంగే కిము = సర్పమునందేమి యుండును?
ఉ- గరమ్ =విషము(ఉండును)
ప్ర-కలిశమనం కిము = యుద్ధము నణచునదేది? (పాపమును తొలగించునదేదనియు చెప్పవచ్చు)
ఉ- సామ =సామోపాయము (లేక సామవేదము)
ప్ర- ఆర్య సంభోధనం కిమ్ = ఆర్యు నే పదముతో సంబోధింతువు? (సంబోధన వాచకమేమి)
ఉ-హే =ఓ- (హే రామ ఇత్యాది)
ప్ర- కా సుందర్యాం (భవతి)= అందగత్తె యందుండునదేది?
ఉ- హేలా = శృంగారచేష్ట ('హేమసారంగలీలా' అను 'పదమునుండి మొదటి దగు 'హే' చివరిదగు 'లా' తో చేర్చిన'హేలా' అగును)
ప్ర- ఇందుఃఅపి కథమ్ = చంద్రుడును ఎటులుండును?
ఉ- మలీ =కళంకము కలిగియుండును(హేమసారంగలీలా అను పదమునమొదటిదగు'హే' చివరిదగు'లా' తొలగినచో మసారంగలీ మిగులును

అపుడు 'మ' అక్షరమును చివరి 'లీ' తో చేర్చినచో 'మలీ' అగుమ నుంము కలవాడు. మలమనగా మచ్చ.

ప్ర- అవని భృతః సంబుద్ధిశ్చ కా = పర్వతముయొక్క సంబోధన ఎట్లుండును?

ఉ-సాగ = వృక్షములతో కూడిన ఓ పర్వతమా,- అగైః వృక్షైఃసహవర్తత ఇతి సాగః తస్య సంబుద్ధిః సాగ) (హేమసారంగ లీలా అను పదమునుండి మొదటి రెండు చివరి రెండు అక్షరములు తొలగినచో 'సారంగ' మిగులును, అప్పుడు 'సా'తో 'గ' యనునది చేరినచో 'సాగ' అని యేర్పడును)

ప్ర- అగ్నేః బీజం కిమ్ =అగ్ని యొక్క బీజాక్షర మేమి?

ఉ- రమ్ = రమ్ అనునది అగ్ని బీజము (హేమసారంగలీలా పదమున మొదటి మూడు చివరి మూడుక్షరములు తొలగినందున ఇక మిగిలినది 'రమ్' కదా)

ప్ర- కా అవనీజారమణమతి హరా = శ్రీరామ చంద్రుని యొక్క బుద్ధిని హరించినదేది?(అవనీజా = భూమియందు పుట్టినది సీతాదేవి)

ఉ- హేమసారంగ లీలా = బంగారు లేడి యొక్క విలాసము.

హేమసారంగ లీలా పదమున-

అను లోమముగా - హేమ, సారం, గలీ, ఇలా, అని, విలోమముగా- లాలీగరం, సామ,హే, యని అద్యంతాక్షరయోజనచే- హేలా, మలీ, సాగ, రం, అని ఉత్తరముం రాబట్టవలయును-

కీదృక్ మత్తమతంగజః కముభినత్ పాదేన నందాత్మజః,
శబ్దః కుత్రహి జాయతే, యువతయః కస్మిన్ సతి వ్యాకులాః.
విక్రేతుం దధి గోకులాత్ ప్రచలితా కృష్ణేన మార్గే ధృతా
గోపీ కాచన తం కిమాహ కరుణం, 'దానీ అనోఖే భయే' 155

ఇందు 'దానీ అనోఖేభయే' అను హిందీ పదమును గ్రహించి

సంస్కృత హిందీ పరముగా ఉత్తరము కూర్చబడినది.

ప్ర- మత్తమదంగజః కీదృక్ = మదపుటేనుగే విధముగా నుండును?

ఉ- దానీ = మదోదకముకలదై యుండును (దానమనగా మదోదకము అది కలది 'దానీ')

ప్ర- నందాత్మజః పాదేన కమ్ అభినత్ =కృష్ణుడు కాలితో దేనిని విరగదన్నెను?

ఉ- అనః = శకటమును (శకటాసురుని)

ప్ర-శబ్దః కుత్ర హి జాయతే = శబ్ద మెక్కడ పుట్టును?

ఉ- ఖే = ఆకాశమునందు.

ప్ర- కస్మిన్ సతి యువతయః వ్యాకులాః (భవంతి) = ఏదేర్పడగా యువతులు కంపింతురు?

ఉ- భయే = భయము కలుగునప్పుడు

ప్ర- దధి విక్రేతుమ్ = పెరుగునమ్ముకొన, గోకులాత్ ప్రచలితా = గొల్లపల్లె నుండి బయలుదేరిన,కాచన గోపీ, ఒక గొల్లపడుచు, మార్గే కృష్ణేన ధృతా = త్రోవయందు కృష్ణునిచే పట్టుకొనబడినదై,తం కరుణం కిమ్ అహ= అతనితో దీనముగా నేమనెను?

ఉ- దానీ అనోఖే భయే =ఎంత విచిత్ర నాగరికుడవై తివి. (పిల్లవాడవు కదా అని ఊరకున్న నీధూర్తత మితి మీరి పోవుచున్నదేయని అమె యన్నదని భావము- దానీ,అనః, ఖే, భయే= దానీ అనోఖే భయే.

అన్యస్త్రీస్పృహయాలవో జగతి కే, పద్భ్యామ్ అగమ్యాచ కా,
కో ధాతు ర్దశనే,సమస్త మనుజైః కా ప్రార్థ్యతేఽ హర్నిశమ్,
దృష్ట్వైకాం యువనేశ్వరో నిజపురే ఎద్మానసాం కామినీం
మిత్రం ప్రాహ కిమాదరేణ సహసా' యారానదీ దంశమా' 156
ఇదియు పై శ్లోకము వంటిదే.

ప్ర- జగతి కే అన్యస్త్రీస్పృహయాలవః = లోకమున పరస్త్రీ లంపటులెవరు?

ఉ-యారాః = జారులు (సంస్కృతమున యకార జకారములకు భేదము పాటింపబడదు)
ప్ర-కాచ పద్భ్యామ్ అగమ్యా = పాదములతో నడువరానిదేది?
ఉ- నదీ = ఏరు (ప్రవాహము)
ప్ర-దశనే కః ధాతుః = నములుట యందు ఏ ధాతువుపయోగింపబడును?
ఉ- దంశ = ధంశధాతువు-
ప్ర- సమస్తమనుజైః అహర్నిశం కా ప్రార్థ్యతే = రేయింబవలు మానవులెల్లరచే నేది కోరబడును
ఉ- మా= లక్ష్మి (సంపద)
ప్ర- నిజపురే = తన పట్టణమున, యవనేశ్వరః = యవనరాజు, పద్మాననామ్= తామరవంటి మోముగల, ఏకాం కామినీమ్ = ఒక విలాసినిని, దృష్ట్వా =చూచి, ఆదరేణ =అదరమున, సహసా= త్వరగా (వెంటనే) మిత్రం కిం ప్రాహ= మిత్రునితో నేమి అనెను?
ఉ- యారానదీ దంశమా= ఈ యువతి ఎంత అనాఘ్రాత పుష్పము (ఏ జారుని అధరక్షతమునకును గురి కాలేదు.)

**కః ఖే చరతి, కా రమ్యా, కా జప్యా, కిం విభూషణమ్,**
**కో వంద్యః, కీదృశీ లంకా, 'వీరమర్కటకంపితా'   157**

ఇందు- వీరమమర్కటకంపితా' యనునది ఉత్తరము.

ఉ-కః ఖే చరతి = ఆకాశమున చరించునదేది?
ఉ- విః - పక్షి (వీరమా అనుచోట విః+రమా ='రోరి' అను సూత్రముచే వీరమా అని అగును)
ప్ర- కారమ్యా = రమణీయురాలెవరు?
ఉ- రమా = లక్ష్మీదేవి-
ప్ర- కా జప్యా = జపింపదగినదేది?
ఉ- ఋక్ = ఋగ్వేద సూక్తము, (వీరమా+ఋక్ = వీరమర్క్ అని అగును)

ప్ర-కిం విభూషణమ్ =ఏది భూషణమగును?
ఉ- కటకమ్ = కంకణమ్ (వీరమర్క్+కటకమ్ = వీరమర్కటకమ్ అని అగును. శ్లేషాదులలో ద్విత్వము లేకున్నను అంగీకార్యమే)
ప్ర- కః వంద్యః ఎవడు నమస్కరింపదగినవాడు?
ఉ- పితా = తండ్రి-
ప్ర- లంకా కీదృశీ (జాతా) లంకానగరి ఏ విధముగా నయ్యెను?
ఉ- వీరమర్కట కంపితా =వీరులైన వానరులవలన కంపముజెందిన దాయెను-

వి:+రమా+బుక్+ కటకం+పితా=వీరమర్కట కంపితా యని ఊహించుకొనవలయును.

**బహిరాలాపము:-**

శ్లోకముననే ప్రశ్నోత్తరములుకలది అంతరాలాపము కేవల ప్రశ్నలు గలది బహిరాలాపము .శ్లోకమునందలి ప్రశ్నలకు సరిపోవు ఉత్తరములు పాఠకుడే స్వయముగా ఏరుకొనవలసి యుండును. ఇది పలురకములు నుండును. ఇందు ముఖ్యములగు వాని నుదాహరింతును.

**తరుణ ప్రథమలకారాదేశనజాతయః కథం వాచ్యాః**
**వికసితసరోజతతయో మనాంసి మదయంతి కీదృశ్యః 158**

ఇందు 'యువతి వదనా కృతయః' అనునది ఉత్తర పదము.
ప్ర- తరుణ = యువకుడు, ప్రథమ లకారాదేశ =లట్ లకార ప్రథమ పురుషైక వచనము, అదన = ఆహరము. అకృతయః = జాతి అనునవి. కథం వాచ్యాః = ఎట్లు పేర్కొనదగినవి?
ఉ- యువ = తరుణుడు, ప్రథమ లకారాదేశ =లట్ ప్రథమ పురుషైక వచనమునకు 'తి' (తిప్ తస్ ఝి,ఇత్యాదులలో మొదటి ప్రత్యయము తిప్ యనునది. 'ప్' ఇత్తు కావున ధాతువునకు 'తి' ని జేర్చగా భవతి గచ్ఛతి పిబతి అని అగును- వకార బకారములకు భేదము లేనందున 'వ్' 'బ్' గా

పరిగణింపబడెను) అదన = ఆహారము,ఆకృతయః=జాతి, – 'యువ' యని తరుణుడు, 'తి' యని ప్రథమ లకారాదేశము, అదనము, ఆహారమని, ఆకృతి జాతియని పేర్కొనబడును–

ప్ర- కీదృశ్యఃవికసితసరోజతతయః మనాంసి మదయంతి = వికసించిన తామరలెట్టివై మనస్సుల నాకర్షించును?

ఉ- యువతి = యౌవన వతులయొక్క, వదన = మోముల మొక్క, ఆకృతయః =స్వరూపమువంటి స్వరూపముకలవై (మనస్సుల నాకర్షించును)

ఇదు రెండు పర్యాయములు సమస్తముగా 'యువతి వదనాకృతయః' యనునది ఉత్తరవాచకమగుటచే నిది ద్విస్సమస్త బహిర్లాప ప్రహేళిక ఆకృతిస్తు క్రియార్థత్వాత్ అను జైమిని సూత్రానుసారము ఆకృతి జాతి పరముగా పరిగణింపబడినది. మీమాంసకమతమున జాత్యాకృతులకు భేదము లేదు, కాని నైయాయికులు పార్థక్యము నంగీకరింతురు. 'వ్యక్త్యాకృతిజాతయస్తు పదార్థః' వ్యక్తి, ఆకృతి జాతి యనునవి పరస్పర సంబద్ధములై పదార్థమగును. మనస్సు భావనేచ్ఛా క్రియారూపమై ఏక విధముగా గోచరించునని మనోవైజ్ఞానికు లంగీకరించునట్లు నైయాయికులును వ్యక్త్యాది త్రయము పదార్థమని యూరీకరింతురు వివక్ష వలన భావనాదులు ప్రాముఖ్యము ప్రాశస్త్యము వహించునట్లు వివక్షాభేధము వలనవ్యక్త్యాదులలో భేధము సంభవించును. భావనేచ్ఛాక్రియలకు వలె వ్యక్త్యాకృతి జాతులకును విడదీయరాని సంబంధమున్నను వివక్షా వ్యవహారాదుల పురస్కరించుకొని భేధము చెప్పక తప్పదని నైయాయికులందురు. భేద మీ క్రింది యుదాహరణములో స్ఫుటమగును

గోవు మేయుచున్నదను నప్పుడు వ్యక్తియే వివక్షితమగుటచే వ్యక ప్రధానత వహించును.

పిండితో గోవును జేయుమనునప్పుడు అకృతియే వివక్షావిషయమగుటచే ఆకృతి ప్రధానమగును.

గోవును తన్నరాదను నప్పుడు గోసామాన్యము వివక్షితమగుటవలన గోత్వసామాన్యము ప్రధానమగును. స్ఫుటప్రతీతి కొరకు వీనిలక్షణము లీయబడుచున్నవి.

వ్యక్తిర్గుణ విశేషాశ్రయోమూర్తిః వ్యాపక పరిమాణరహితము రూపాది గుణ విశేషాశ్రయమునగునది వ్యక్తి (ఇంద్రియములచే గ్రహింపబడునది వ్యక్తియని భావము)

ఆకృతిర్జాతిలింగాఖ్యా- జాతిని మరియు దాని లింగములను తెలియజేయు నియతావయవ సన్నివేశము ఆకృతి యనబడును. అవయవ సంస్థాన విశేషము ఆకృతి దీనివలనజాతి గ్రహింపబడును.

సమాన ప్రసవాత్మికాజాతిః-సమాన ప్రసవావగమకము జాతి.ఏకాకారముగా గోచరించు పదార్థములందు ఏకవిధప్రతీతి కలిగించునదిజాతియని తాత్పర్యము.

ఆకృతిగ్రహణాఖ్యాజాతిః అని పతంజలియు 'ఆకృతియే గ్రహణసాధనముగాగలది అనగా అవయవ సన్నివేశ రూపమైన ఆకృతిచే తెలియునది జాతియని పేర్కొనెను.

కావున ఆకృతి జాతి కాదు. జాతిప్రతీతికి హేతువని తేలినది. జాతియన సామాన్యము. ప్రతి పదార్థమునందు ధర్మములు రెండుండును. ఒకటి వ్యక్తి ధర్మము, రెండవది సామాన్య ధర్మము. రాముడు సోముడు ఇత్యాదులు వ్యక్తులు వీరియందుండు రామత్వ సోమత్వాదులు వ్యక్తిధర్మములు. వీరు మానవు లగుట వలన వీరియందుండు మానవత్వమనునది సామాన్య ధర్మము. వ్యక్తిధర్మము విశేషధర్మము సామాన్యధర్మము జాతియనిపేర్కొనబడును, సామాన్య విశేషములలో విశేషధర్మము ప్రత్యక్షగ్రాహ్యము. ఏకాకారముగానుండు ఘటాదుల యందలి ఘటత్వాది సామాన్య ధర్మ మనుమేయమగును. సామాన్య విశేషాత్మనోఽర్థస్య విశేషావధారణ ప్రధానావృత్తిః ప్రత్యక్షమ్'అని ప్రత్యక్షమునకు వ్యాసుడు యోగదర్శన భాష్యమున నిర్వచన మొసగెను.

మనోవైజ్ఞానికులు సైతము విశేషప్రత్యయము ప్రత్యక్షమువలననే కల్గునందురు, అనేక ఘటములందు ఇదిఘటమను ఏకాకార ప్రత్యయము దేనివలన కలుగునో అది సామాన్యము. 'సోమోఽయం మానవః అనుగత ప్రత్యయత్వాత్ యత్రానుగతప్రత్యయః తత్రసామాన్యం యథా రామః' అని సామాన్యమనుమానింపబడునందురు. సంయుక్త సమవాయ సన్నికర్ష ద్వారా ఘటత్వ పటత్వాది సామాన్యము గ్రహింపబడునని నైయాయికు లందురు. ఘటాది విశేషావధారణాత్మక ప్రత్యయమునకు పర్సెప్షన్ అని, ఘటత్వాది సామాన్య ప్రత్యయమునకు కన్సెప్షన్ అనిఅధునిక వ్యవహారము, అయా విశిష్ట ప్రత్యయముల వలన సామాన్య ప్రత్యయ మేర్పడును. నిరీక్షణము, తులన, పార్థక్యము, జాతి నిర్దేశము, పరిభాషయను సోపాన పంచకము సామాన్య జ్ఞానము నందపేక్షితములగునని నైయాయికులు మనోవైజ్ఞానికులు నంగీకరింతురు.

కాని సామాన్య విషయమున భారతీయ దార్శనికులలో విసంవాదములున్నట్లే పాశ్చాత్య దార్శనికులలో సైతము విప్రతిపత్తులు కలవు. భారతీయులలో ప్రధానముగా బౌద్ధులు సామాన్యము నంగీకరింపరు. అనువృత్తి పత్యయహేతు స్సామాన్యమ్- సామాన్యమనుగత ప్రత్యయహేతువని వైశేషికులు నిర్వచింతురు. అపోహ మనువృత్తి ప్రత్యయహేతునని బౌద్ధులు పరిభాషింతురు. అపోహమనగా సాసాదృశ్యము. లేక తద్భిన్నభిన్నత్వము. ఘటభిన్న పటాది భిన్నత్వము ఘటము లందుండునను. ఇట్టి అపోహయేతత్శద్దట ప్రత్యయహేతువగునని వారి ఆశయము, కాని ఆకల్పన క్లిష్టమైనది. మరియు అపోహ మభావాత్మకము సామాన్యము భావాత్మకము. అనేక ఘటములయందు స్వేతరవ్యావృత్తి ద్వారా అనుగత ప్రత్యయకల్పనాపేక్షయా సామాన్యము ద్వారా కల్పించుట లాఘవము సుగమమునగును. ఇక పాశ్చాత్యులలో సామాన్య విషయకముగా ఆదర్శవాదము నామాత్మవాదము ధారణాత్మవాదమను మూడు వాదములు కలవు. అందు మొదటి వాదమునకువిరాట్పురుషుడు ప్లేటో

మహోదయుడు. ఇతడుతన యథార్థవాదమందు (రియలిజమ్) సామాన్య మాదర్శమైనదని నుడివెను. ఏనిర్మాతయైనను సామాన్య రూపముగానుండు దానినే ఆదర్శముగా కల్పించుకొని తదనుగుణముగ వస్తు నిర్మాణమునకు పూనుకొనును. ఆదర్శ సిద్ధాంతమునందు (థియరీ అఫ్ ఐడియాస్) అతడు సామాన్యమును సోపపత్తికముగా స్థాపించెను. కొందరు ఆతని ఆదర్శవాదమును ప్రత్యాఖ్యానించి నామాత్మవాదమును స్థాపించిరి. నామాత్మవాది మతమున సామాన్యము వాస్తవికము కాదు కాని వ్యవహారసౌలభ్యముకొరకు నామమాత్ర నిర్దేశ మొందును. వస్తువు స్వరూపతః లేకున్నను నామ్నావ్యవహృతమగును. వీరి నామాత్మవాదమునకు యోగదర్శమున పేర్కొనబడిన వికల్పవృత్తికిని భేద మేమియు లేదు- 'శబ్దజ్ఞానాను పాతీ వస్తు శూన్యఃవికల్పః' అనునది వికల్ప వృత్తి లక్షణము. ఏవస్తువు వాస్తవికముగా నుండదో ఐనను నామమాత్ర వ్యవహారము పొందునో అది వికల్పమని తాత్పర్యము, సామాన్యము సైతము స్వరూపతః లేకున్నను నామ వ్యవహారముపొందుచున్నది. కావున ఇదియు వికల్పమేయగును, ఇక మూడవ వాదము ధారణాత్మక వాదము(కన్ సెప్ఛ్యులిజం) సోక్రటీస్ ఈవాద ప్రతిష్ఠాపయిత ప్లేటోమతమునందు సామాన్య మాదర్శస్థితి నొంది అతని కల్పనాహేవాకనాకమున విహరించును. సోక్రటీస్ మతమున సామాన్య మీలోకముననే మానవ బుద్ధిగతమై ప్రకాశించును. ఇదియే ఆదర్శవాద ధారణ్మాతక వాదములకు గల భేదము. ఇట్లు సామాన్య విషయకముగా వెక్కువాదములు ప్రాచ్యపాశ్చాత్య పండితులలో నేర్పబడినవి. విశేషపరిచయము తార్కతాంత్ర ప్రహేళికలలో చేయబడును.

వైదేహ స్సమబోధయత్ వద కథం గార్గ్యం, విహీనో భవేత్
కేనాదాదిగణోఽతిపాతకరుచి స్స్యాత్ కేన ముక్తోజనః
మేధావిన్ శిశుదుఃఖదుః ప్రభురవీన్ సంబోధయస్వ స్వయమ్

ఇందుః 'బాలా కేశపాశేన' యనునది ఉత్తర పదము

మేధావిన్=ఓ మేధావంతుడా! స్వయం వద=ఈ క్రింది ప్రశ్నలకు స్వయముగా నుత్తరములఁ జెప్పుము.

ప్ర.– వైదేహః గార్గ్యం కథం సమభోదయత్=జనకమహరాజు గ్గార్యుని ఎట్లు సంబోధించెను?

ఉ.– బాలాకే=బాలాకీ యని సంబోధించెను ('దృప్తబాలాకీ ర్హానూ చానో గార్గ్య ఆస' ఇతి ప్రక్రమే 'క్వైష తద్బాలాకే పురుషోఽశయిష్ట' బృహదారణ్యకోపనిషత్)

ప్ర.– అదాదిగణః కేన విహీనః భవేత్=అదాదిగణమున జేర్చబడిన ధాతువు ఏది లేక యుండును.

ఉ. శపా='శప్' అననది అదాదిగణమున లోపించును (అది ప్రభృతిభ్యః శపః అను సూత్రము అదాదులకు శబ్ లోపము విధించెను. శప్ '(అ) భ్వాదులకు వచ్చును., భవతి తిష్ఠతి ఇత్యాదులలో శప్ కలదు, అత్తి హంతి, ఇత్యాదులలో శప్ ఉండదని భావము.

ప్ర.– అతిపాతకరుచిః జనః కేన ముక్తః స్యాత్=అతి పాపనిరతుడైన వ్యక్తి దేనిచే విడువబడును (అతి పాపాత్ముడు దేనిని గోల్పోవునని ప్రశ్న?)

ఉ.– శేన=సుఖముచే (విడువబడును) పాపము దుఃఖహేతువు కావున పాపాత్మునకు సుఖముండదని భావము) ఇది మొదటి వ్యస్త పదవిభాగము.

ప్ర.– శిశు, దుఃఖ, దుఃప్రభు, రవిన్, సంబోధయస్వ=శిశువును, దుఃఖమును, చెడురాజును, సూర్యుని సంబోధించుము?

ఉ.– బాల=ఓ బాలకాయని శిశు సంబోధన, అక=ఓదుఃఖమాయని దుఃఖ సంబోధన, ఈశపాశ=ఓ దుష్టప్రభూ యని దుఃప్రభు సంబోధన ('యాప్యే పాశప్' అను సూత్ర ప్రకారము కుత్సితార్థమున పాశప్ ప్రత్యయమురాగా ఈ శపాశః అని యగును. కుత్సితః ఈశః – ఈశపాశః అని విగ్రహము) ఇన=ఓ సూర్యాయని సూర్య సంబోధన ఇది రెండవ వ్యస్త పదవిభాగము.

ప్ర.– గగనే ఇయం ధారాధరాణాం తతిః కేన సదృశీ విభాతి=ఆకసము నందు ఈ సూత్నమేఘమాల దేనితో తులదూగును.

ఉ.– బాలా కేశ పాశేన=యువతి యొక్క కేశపాశముతో తులదూగునని భావము

కా మేఘా దుపయాతి కృష్ణదయితా కావా సభా కీదృశీ
కాం రక్ష త్యహి హా శర ద్వికచయేత్ కం ధైర్యహంత్రీచ కా
కం ధత్తే గణనాయకః కరతలే కా చంచలా కథ్యతామ్
ఆరోహా దవరోహతశ్చ నిపుణై రేకం ద్వయో రుత్తరమ్ 160

ఆరోహత్ అవరోహత శ్చ ద్వయోః ఏకమ్ ఉత్తరం నిపుణైః కథ్యతామ్=చతురులారా ఇందలి రెండేసి ప్రశ్నలకు అనులోను విలోమముగా నుత్తర బోధకమగు నొకే పదమును తెల్పుడు.

ప్ర.– మేఘాత్ కా ఉపయాతి=మేఘము నుండి ఏది ఆరుదెంచును (పడును).

ఉ.– ధారా=జలధార.

ప్ర.జ– కావా కృష్ణదయితా=కృష్ణుని ప్రేయసి ఎవరు?

ఉ.– (ధారా పదమును క్రిందు మీదు జేసినచో) రాధా=రాధిక

ప్ర. సభా కీదృశీ=సభ ఏ విధమైనది?

ఉ.– వంద్యా= నమస్కరింపదగినది.

ప్ర. అహి హా కాం రక్షతి=ఇంద్రుడు దేనిని రక్షించుపను? (అహి హా=వృత్రాసురుని జంపినవాడు)

జ.– (వంద్యా పదము వ్యత్యస్తము జేసినచో) ద్యాన్వమ్=స్వర్గమును.

ప్ర.– శరత్ కం వికచయేత్=శరదృతువు ఏపుష్పమును వికసింపజేయును?

ఉ.– కాశమ్=రెల్లును.

ప్ర.– ధైర్యహంత్రీచ కా=ధైర్యమునేది తుడిచి వేయును?

ఉ.–(కాశమ్‌ను విలోమముగా మార్చినచో) శంకా=భయము. లేక సంశయము.

ప్ర.- గణనాయకః కరతలే కం ధత్తే=వినాయకుడు హస్తమున దాల్చునదేది?

ఉ.- పాశమ్=పాశమును.

ప్ర.- కా చంచలా=చపలముగా నుండుననేది ?

ఉ.- ('పాశం' పదమును క్రిందుమీదు జేసినచో) శంపా=మెరుపు తీగ

**విషమ ప్రహేళిక :-**

ప్రశ్నలు విపరీతముగా నుండునది విషమ ప్రహేళిక, దీనినే సమస్య యందురు. సాధారణముగా సమస్య యథాసంఖ్యముగా పూరింపబడును, ఇటముఖ్యములగువాని నుదాహరింతును.

**రామ శ్చుంబతి రావణస్య వదనం సీతావియోగాతురః**

అనునది సమస్య- (రాముడు సీతావిరహార్తుడై రావణుని మోము ముద్దిడు కొనెనని సమస్యార్థము.)

**కః కాంతార మగాత్ పితు ర్వచనతః సంశ్లిష్య కంఠస్థలీం**
**కామీ కిం కురుతే చ గృధ్రనఖత శ్ఛిన్నం ప్రరూఢంచ కిమ్**
**కా రక్షః కులకాలరాత్రి రభవత్ చంద్రాతపం ద్వేష్టి కః**
**రామ శ్చుంబతి రావణస్య వదనం సీతావియోగాతురః.** 161

నాల్గవ పాదము మూడు పాదములకు నుత్తరము

కః పితుః వచనతః కాంతారమ్ అగాత్?=రామః

తండ్రి మాటవలన అడవి కేగినవాడెవడు?=రాముడు

కామీ కంఠస్థలీం సంశ్లిష్య కిం కురుతే? = చుంబతి

కాముకుడు ప్రేయసీ కంఠమును కౌగిలించి ఏమి చేయును? = ముద్దిడు కొనును.

గృధ్రనఖతః ఛిన్నం ప్రరూఢం కిమ్?=రావణస్య వదనమ్

జటాయువు గోళ్లవలన తెగి తిరిగి మొలచిదేది?=రావణుని తల

కా రక్షః కులకాలరాత్రిః అభవత్?=సీతా

రాక్షస వంశమునకు కాలరాత్రియైన దెవరు?=సీతా

కః చంద్రాతపం ద్వేష్టి?=వియోగాతురః

వెన్నెలను ద్వేషించు వాడెవడు?=విరహార్తుడు.

**పాథోధి ర్జలధిః పయోధి రుదధి ర్వారాంనిధి ర్వారిదిః**

ఈ సమస్య గంగా కుమారస్వామి సంవాద రూపమున పూరింబడినది.

**అంబా కుప్యతి తాత మూర్ధ్ని విధృతా గంగేయ ముత్సృజ్యతామ్**
**విద్వన్ షణ్ముఖ కాగతి ర్మమ చిరం మూర్ధ్ని స్థితాయా వద**
**కోపా వేశవశా దశేషవదనైః ప్రత్యుత్తరం దత్త వాన్**
**పాథోధి ర్జలధిః పయోధి రుదధి ర్వారాంనిధి ర్వారిధిః 162**

మా యమ్మ రుసరుసలాడుచున్నది కావున నీ తలపైనున్న గంగమ్మను విడిచిపెట్టుమని కుమారుడు శివునితో జెప్పుచుండ విన్నదై ప్రాజ్ఞ కుమారా! ఎంతయో కాలమునుండి మీ తండ్రి తలపై నివసించుచున్న నన్ను మధ్యలో పొమ్మనెదవేల? నాకు గమ్య మీ జటాజూటము తప్ప వేరే లేదన్నది నీ వెరుగవా? యని గంగ పలికెను. అప్పుడు కుమారుడు కోపము నాపుకొనలేక నీ కన్యత్ర చోటులేనిచో సముద్రములో మునుగుము మా కేమి సంబంధమను అర్థమువచ్చు నట్లు ఆరు మోములతో,పాథోధి. జలధి,పయోధి, ఉదధి, వారాంనిధి, వారిధి, యని జవాబునిచ్చెనని సమస్యాభావము.

**పురః పత్యుః కామాత్ శ్వశుర మియ మాలింగతి సతీ**

భర్త కనులయెదుటనే ఈ సాధ్వి కామమువలన మామను కౌగలించు కొనుచున్నది అని సమస్యార్థము.

**తపాపాయే గోదాపరతటభువి స్థాతుమనసి**
**ప్రవిష్టే తత్పూరం భగవతి మునౌ కుంభజనుషి**
**ధృతం లోపాముద్రా స్వయ మవికలం గంతు ముదితా**
**పురః పత్యుః కామాత్ శ్వశుర మియ మాలింగతి సతీ 163**

గ్రీష్మావసానమున గోదావరీ ఆవలియొడ్డు నందలి తపో వనమున నివసింప దలచినవాడై కుంభసంభవుడైన అగస్త్యుడు గోదావరీ ప్రవాహము నీదుచుండగా నాతని భార్య లోపాముద్ర కోరికతో తన పతి ననుసరింపదలచి, వెంటనే దాటననువైన కుండను కౌగిలించుకొనెను, తన భర్త కుంభసంభవుడు కావున తనకు కుండ మామయగును., కుండ నూతగాగొని ఏరు దాటుదురు కదా! సమస్య వలెనే పురాణమును చమత్కారావహము (విషమ ప్రహేళికలు రెండవ భాగమున విస్తరింపబడును).

చిత్ర ప్రహేళిక – ఏకవ్యంజనము ః –

రరోరరే రరరురో రురూరూరు రురోరరే
రేరే రీరారారరరే రారేరారిరిరారిరా 164

**పదవిభాగము ః–** రరోః అరేః అరరురోః ఉః ఊరూరుః ఉరోరరే రేరే రీరారా అరరరేరారే రిరిః ఆరిరా

**అర్థముః–** రరోః–ర=రాముశబ్దరేఫ వలన. రోః=భయముగల వాడైన, అరరురోః–అర=త్వరగా పరుగిడునట్టిరురోః = హరిణరూపియైన మారీచునకు, అరేః=శత్రువైన శ్రీరాముని యొక్క; రేరే–ర=కౌస్తుభమణిని, ఈరే=పొందియున్న, ఉరోరరే–ఉరఃఅరరే=కవాటమువంటి వక్షస్థలము నందు, రీరారా=లీలనా పాదించునట్టిది(రలయోః అభేదః) ఊరూరుః=తొడలచే గొప్పనైన, ఉః=సీతా భూమిక దాల్చిన లక్ష్మి, అరరరేరారేరారిరిః–అరరర=తన నిలయమునకు తీసికొని వెళ్లిన, ఇరార=సముద్రద్వీపమును (లంకను) పొందియున్న, ఇరారి=భూవిరోధియైన రావణునకు, రిః=నాశనమును కల్గించిన దగుచు, ఆరిరా– ఆరి=చెలికత్తెలను–రా = పొందిన దాయెను.

మామామమామమేమామా మామూమామేమమేమమే
మామామేమిమిమేమా మమమోమామామమామమీ 165

**పద విభాగము:-** మామ్ ఆమ మా మమ ఇమాం అమామూమ అమే అం అమేం అమమమే మా అమాం ఏమి మిమే మామం అమః మా అమామ మాం అమీ.

**అర్థము:-** మమ=నా యొక్క, మా=బుద్ధి, ఇమాం మామ్=ఈ లక్ష్మిని, ఆమ=పొందెను (అమగతౌలిట్) అమేం-అమా =సహితురాలైన, ఈ=లక్ష్మిగల; అమ్=నీ పాదమును, ఆమామూమ=ఆశ్రయించితిమి, (ఆఙ్పూర్వకమవబంధన ఇతి ధాతోః యఙ్ లుగంతాత్ లఙ్ ఉత్తమపురుషః) అమే=ఓ దుర్బుద్ధీ జ్యేష్ఠాదేవీ, మే=నాకు, అమ=దూరముగా వెళ్లుము. అమామ్=లక్ష్మికంటె వేరైన దేవతను, మా ఏమి=పొందను, అమః=బంధ రహితుడనై, మామం- మా=లక్ష్మి యొక్క, అమమ్=ప్రాపును మిమే=అపేక్షింతును, అమీ=ఈ మేము, మామ్=ప్రమాణమైన శాస్త్రమును, మా అమామ=అతిక్రమింపము-

**కాకాననదేదేవివిపాపాహహభూభూ**
**రారాదదరా రామమనానామమ హేహే**
**యాయా మమ ఖేఖేదదనానాఘఘనానా**
**త్వంత్వంగగదాదావవనీనీతతమామా** 166

కాకాననదే-కాక =కాకాసురునకు, అననదే=రక్షణనిచ్చినదానా, భూభూః=భూమినుండి పుట్టినదానా, నామమహేహే-నామ = నమస్కారమందు,మహా=గొప్పనైన, ఈ హే=అభిలాషగలదానా, అంగ దేవి=ఓ సీతాదేవీ,విపాపా=నిర్దోషురాలవు, అదరా=భయము లేనిదానవు. రామ మనాః = రాముని యందే మనస్సుగలదానవు, ఖే=అంతఃకరణమందు, భేదద = దుఃఖముగలిగించు, నానా అఘ=పలుపాపములచే, ఘన = దుర్భరులైనవారిని. అనా=రక్షించుదానవు, గద ఆదౌ=రోగాదులయందు,అవనీ=జనులగాపాడు దానవు నీత=తొలగింపబడిన. తమాః=తమోగుణముగలదానవై, త్వంతు=నీవు

మాత్రము, మమ ఆరాత్=నాకుదూరము, మాయాయాః=వెళ్లకుమా.

**కాలేకిలాలౌకికైకకోలకాలాలకేలల**
**కలికాకోలకల్లోలాకులలోకాలిలాలికా 167**

అలౌకిక=లోకవిలక్షణమైన, ఏక=ముఖ్యమైన, కోల=ఆది వరాహస్వామియొక్క, కాలాలకే=భార్యవైన, ఓ లక్ష్మీ, (కాల=నల్లని, అలకే= ముంగురులుగలదానా) కలి=కలికాలమనే, కాకోల=విషముయొక్క, కల్లోల=అభివృద్ధిచే,
ఆకుల=బాదవడుచున్న, లోక అలి=ప్రజాన మూహమును, లాలికా=రక్షించుచున్న, (త్వమ్) నీవు, కాలేకిల=అపాయసమయమున మాత్రము, లల=సాక్షాత్కరించి ప్రకాశించుము.

అర్ధపాదానులోను ప్రతిలోమము - ప్రతి పాదము యొక్క సగము పాదము పై నుండి క్రిందికి క్రింది నుండి పైకి చదివినను ఒకే తీరుండునది.

**కాళీనాననవాళీకా రాధితాహి హితాధిరా**
**మాయాసామమసాయామా కాపిదీప్రప్రదీపికా 168**

కాళీనాననవాళీకారాధితా - కాళీ=పార్వతీ యొక్క, ఇన=భర్తయగు శంకరుని, ఆననవాళీక=వదనారవిందముచే, ఆరాధితా=స్తుతింపబడినది. హిత=భక్తుల యొక్క, అధి=మనోవ్యధను, రా=తొలగించు నట్టి, యా మా=ఏ లక్ష్మి దేవి, సాయామా - సా=(భక్తుల యందు) దయ యొక్క, ఆయామా=దీర్ఘతకలదై ఒప్పుచున్నదో, సా=అట్టి లక్ష్మి దేవి, మమ=నాకు కాపి=అనిర్వచనీయమైన, దీప్రప్రదీపికా=ఎప్పుడు ప్రకాశించు దీపిక యగుగాక.

కాళిదాసళిదాయోమా చంద్రంతేరిపురంజకమ్
కంజరంపురితేంద్రంచ మాయోదాళిసదాళికా 169

ఇందు పూర్వార్ధము విలోమముగా గ్రహించినచో ఉత్తరార్ధము వచ్చును.దాసళి=దాసులను పుత్రులనుగా స్వీకరించుదానా, దాయో = (దాయః అవిభక్తః ఉః శివః యస్యాస్సాదాయో, అని విగ్రహము) వేరుగానుండని శివుడు గలదానా,మామో=(మాయాచసా ఊశ్చ మాయో అని విగ్రహము) మాయారూపిణివైన ఓ దేవతా, దాళి=దాంతిగలదానా (దాం క్షాంతిం లాతి గృహ్ణాతీతి దాళీ) సదాళి -సత్ = దేవతా స్త్రీలే ఆళి=చెలికత్తెలుకల దానా, పురి=దగ్గరకుదీయు విషయమై. తే=నీ యొక్క, తా=దయ చంద్రం=చంద్రుని,కంజరం=సూర్యుని, ఇంద్రంచ=దేవేంద్రుని, రిపు రంజకమ్=అరిషడ్వర్గముగలవానిగా జేయుదువుగాత, మా=నన్నుగూర్చి, కా=సుఖమునకు స్థానమగుదువుగాత (కస్య=సుఖస్య, ఆ=స్థానమ్, కా అని విగ్రహము.

ముఖంచ చంద్రప్రతిమంథిమంథినౌ, స్తనౌచ పీనౌ కఠినౌ ఠినౌఠినౌ
కటిర్విశాలా రభసాభసాభసాలహో విచిత్రం తరుణీ రుణీరుణీ 170

మంథినౌ=సౌందర్య విషయమున (మంథిని స్సుందరే మంథే అను నిఘంటు ప్రకారము, మంథిని పదము సుందరవాచకమైనను లక్షణయా సౌందర్య పరముగా నర్థమును స్వీకరింపవలెను.) ముఖంచ = మోము , చంద్ర ప్రతిమంథి=చంద్రుని తిరస్కరించునది, పీనౌ = బలిసినవి, కఠినౌ=కర్కశములైనవి. ఠినౌ=సామ్యముగల, (ఠశ్శూన్యే వర్తులే హారే సామ్యేచ పరికీర్తితః ఇతి విశ్వే) స్తనౌచ=స్తనములును, ఠినౌ=హారముగలవి, విశాలా=విపులమైన కటిః=కటిప్రదేశము, రభస=సంభ్రమమున అభస=సైకతమును. అభసా=పరిహసించునది,

తరుణి=ఇట్టి యువతి, రుణీరుణీ=రుణి=కుంభ స్థలముగల ఏనుగు యొక్క, ఈః=గమనవిలాసమును; రుణీ= తిరస్క రించునది, అహో విచిత్రమ్=ఔరా ఎంత ఆశ్చర్యము.

యావత్తోయధరాధరాధరధరాధారాధర శ్రీధరా
యావచ్చారుచచారుచారుచమరం చామీకరం చామరమ్
యావద్రావణరామరామరమణం రామాయణం శ్రూయతే
తావద్భోభువిభోగభోగభువనం భోగాయ భూయా ద్విభో 171

తోయధరాః=సముద్రములు,ధరా=భూమి, ధర = హిమాలయాది పర్వతములు, ధరాధర=భూమి నవలంబమైన అధర=అధోలోకమునుండు శ్రీ ధరాః=విషధరుడైన ఆదిశేషుడు, లేక కూర్మము యావత్=ఎంతవరకు నుందురో, చ=మరియు, చారు=మనోజ్ఞమైన, చచా=చచయును, రు=ధ్వనిగల, చారు=సుందరములైన, చమరమ్=చమరమృగములుగల, అమరం=దేవతలకు సంబంధించిన, చామీకరమ్=సువర్ణనిలయమైన మేరు పర్వతము, యావత్=ఎంతవరకు నుండునో, రావణరామ=రామ రావణులు, రామ=జగత్తు నాకర్షించు, రమణమ్=నాయక ప్రతినాయకులుగల, రామాయణమ్=రామాయణము, భూమి=ప్రపంచమున, యావత్=ఎంతవరకు శ్రూయతే=వినబడునో తావత్=అంతదాక, భోగభోగ=భోగమునకు భోగభూతుడమైన, భోవిభో=ఓ రాజా, భువనమ్==భూమండలము, తే భోగాయ= నీ యనుభవము కొరకు, భూయాత్=అగుగాత.

యోవ్యోమాడినగోహరీడుడుపగోయుగ్మః క్వగద్రోపటీ
ర్భీమభ్వర్యసుకీరమారతరసో నాభ్యబ్జదాసీనకః
ద్యోసచ్ఛమ్మవన స్సపత్సలిలజో వార్ధిస్వపోష్టార్ధదో
రాద్యో గద్యసివా డఘాడమ్బతదః పాయా త్ససః కందభాః 172

యః=ఏ విష్ణువు – వ్యోమాడినగః – వ్యోమఅట్=ఆకాశమునచరించు

పక్షులకు, ఇన=ప్రభువైన గరుత్మంతునితో, గః=వెళ్లువాడో, హరీడుడుపగ హరి ఈట్=కిరణములకు రాజైన సూర్యుడు, ఉడుప=నక్షత్రపతియైన చంద్రుడు, గోయుగ్మః=కనుల జంటగలవాడో, క్ష్వగధ్రః-కు=భూమిని, అగ=మందర పర్వతమును, వరాహరూపమున కూర్మ రూపమునను ధరించినవాడో, అపభీః=దేనివలనను భయములేనివాడో, భీమభ్వర్యసుకీః- భీమ=భీకరులైన, భూ అరి = భూవిరోధులైన రాక్షసుల యొక్క, అసు=ప్రాణములను, కీః=తొలగించినవాడో, రమారతరసః=లక్ష్మి సంసక్త ప్రేమగలవాడో, నాభ్యబ్రుడా సీనకః- నాభి అబ్రుట్=నాభికమలమందు, ఆసీన=నివసించిన, కః=బ్రహ్మగలవాడో, ద్యోసచ్చమ్వవనః- ద్యోసత్=స్వర్గము ననుండు దేవతలయొక్క చమూ=సేనలను, అవనః=రక్షించువాడో, సుప్రత్సలిలజః=అరవిందముల వంటి చరణములు గల వాడో, వార్ధిస్వపః=సాగరమున శయనించువాడో అష్టార్ధదో=నాల్గుచేతులుగలవాడో, ఆద్యః=సమస్తమునకు మూలపురుషుడో, గదా=గదాయుధముగలవాడో, అసివాట్=ఖడ్గమును వహించినవాడో, లేక అశివ=అమంగళములను, అట్=తొలగించినవాడో, అఘూట్=పాపములను నశింపజేయువాడో, అమృతదః=ముక్తి నొసగువాడో, సః=అట్టి, కందభాః- కంద=మేఘుని యొక్క, భాః=కాంతి వంటి కాంతిగల నివ్వను, నః=మమ్ముపాయాత్=రక్షించుగాత.

శ్రీట్ఖాడ్వ్రిడాణ్మునీంద్రేఢ్భ్రమఘనవనధగ్భాస్వదుడ్వ్యట్సృఖాష్టః
ఖాడ్భ్రట్బ్రేడ్భక్ష్య యోరుడ్వరుడమరనదీడ్యోజ్జ్వలత్పాదపీఠః
ఖాడ్వ్రడ్భిడ్భూషణార్చిర్భుగభుగితహవిర్భుజ్మఖోభూనిభుఃఖో
ట్పావృణ్మేఘప్రభాఢ్యః ఫలభరితపదఃపాతుకృత్స్నోహరిర్వః 173

శ్రీట్ - శ్రీ=లక్ష్మీదేవికి ఈట్=పతియైనవాడు, ఖాట్=ఆకాశమున చరించుదేవతల, వి=పక్షుల, ఈట్=ప్రభువులైన ఇంద్రగరుత్మంతులకు, లాట్=రాజైనవాడు, మునీంద్ర ఈట్=తాపసోత్తములకు ప్రభువు, భ్రమ=భ్రమయనే. ఘనవన=మహావనమును, ధక్=దహించువాడు,

భాస్వత్=ప్రకాశించు, ఉడు ఈట్=నక్షత్రపతియైన చంద్రుడు, శిఖ=జటాజూటమునందుగల శివునకు ఆప్తః=మిత్రుడు, గ్రహాట్=గ్రహములకును, భ=నక్షత్రములకు, ఈట్=ప్రభువులైన సూర్య చంద్రులే,ఖఈట్=ఇంద్రియరాజములైన, దృక్పయోరుట్=తామరలవంటి కన్నులుగలవాడు, పరుట్=పరివహమను వాయు మండలమున నా నిర్వహించిన, అమరనదీ=ఆకాశగంగచే ఈడ్యా=కొని యాడదగిన, ఉజ్జ్వలత్=ప్రకాశించు, పాదపీఠః=చరణ పీఠముగలవాడు, ఖాట్=దేవతల యొక్క,ద్విట్=శత్రువులైనరాక్షసులకు, ద్విట్=వైరియైనవాడు, భీషణార్చిః=భీతిగొల్పుమంటలచే, భుగ భుగిత జ్వలిత=భుగభుగ మండెడి, హవిర్భుక్=అగ్నియే, ముఖః=మోముగలవాడు, భూవిభుః=భూదేవికి భర్త యగువాడు, ఖ=వైకుంఠమునకు, ఈట్=అధిపతియైనవాడు. ప్రావృణ్మేఘ ప్రభాఢ్యః=వర్షాకాల జలదసుషమను నొప్పువాడు,ఫలభరితపదః=నిత్యఫలములచే నిండిన స్థానము గల వాడు, కృత్=జగత్కర్తయైనవాడు, యః=జగన్నియామకుడునైన, హరిః=విష్ణు భగవానుడు, వః=మిమ్ము, పాతు=పాలించుగాతః

> సాయా ద్వః కరణోరణో రణరణో రాణోరణోవారణో
> దత్తా యేన రమారమారమరమా రామారమా సా రమా
> స శ్రీమానుదయోదయో దయదయో దాయోదయోదేదయో
> విష్ణుర్జిష్ణు రభీరభీరభిరభీరాభీరభీసారభీః 174

(యం)=ఏ విష్ణువు, కరణః (కం జలం రణతిగచ్ఛతీతి కరణః) జలమును పొందియున్నవాడో,(మత్స్య కూర్మ రూపముల దాల్చినవాడని భావము) అరణః=యుద్ధవ్యాపారము లేనివాడో, (యుద్ధము జేయకయే వామన రూపియై) బలి నణచినవాడు) (యస్య=ఎవనియొక్క) రాణః=రణసంబంధియైన రణ రణః- రణరణధ్వని, రణోవారణః- రణ=యుద్ధమువలన కలుగు, ఉ=వ్రణాదిచిహ్నములుగల వీరులను,

వారణః=నివారించినవాడో, (దేవభటులయువనరము లేకయే నృసింహరూపమున హిరణ్యకశిపుని జంపినవాడు) ఆరమా - (అరీణాంసమూహః ఆరమ్, ఆరం మినోతిహినస్తీతి ఆరమాః తేన ఆరమా) ఆర=శత్రు క్షత్రియ బృందమును, మా=పరుశురామరూపమునజంపిన, రమారమారమరమా - రమా=లక్ష్మితో, రమ=రమించు విష్ణువు యందు, ఆరమ=మిక్కిలి రమించు తాపసులను, రమా=రమింపజేయు,యేన, ఏ విష్ణువుచే, రామా=రమణీయమైన, సా=అట్టి, రమా=భూరాజ్య లక్ష్మి దత్తా=బ్రాహ్మణుల కొసగబడెనో, ఉదయోదయః - ఉత్=ఉద్ధరింపబడిన అయ ఉదయః=జలనిమగ్నమైన ఉదయాచలాది భూమిగలవాడు - వరాహరూపము ధార్చినవాడని భావము, (యాతీతి యః, న యః అయః, అయః అప్రాప్తః ఉదయః యేనతత్ అయోదయమ్ భూధరాధి, ఉత్ ఉద్ధృతం అయోదయం యేనసః ఉదయోదయః అని విగ్రహము) అదయదయః- అదక్రూరులయందును, దయః=కృపగలవాడు - బుద్ధరూపమున క్రూరుల నుద్ధరించినావాడని భావము, దాయోదయోదేదయః - దాయ=రాజ్య భాగము కొరకు, ఉత్=ఎత్తబడిన, అయః=లోహనిర్మితశస్త్రములుగల ధార్త రాష్ట్రులను, దే=చీల్చిన అర్జునునియందు, దయః=కృపారసముగలవాడు, (కృష్ణమూర్తియని భావము) ఆభీరభీరభిః- అభీర=పరదారాపహరణాది పాపములకు వెరవని రావణాదులందు, భీ - భయావహమైన, రభిః యుద్ధారాభ్యస్యముగలవాడు, శ్రీ రాముడని తాత్పర్యము) ఆభీరాభీరభీసారభీః :- ఆభీర=శూరులయందు, అభీర=భీరువుల యందును, భీ=సమానముగా భయమును, సార=ప్రసరింపజేసిన దుష్టమేచ్ఛులకును, భీః=ప్రాణభయము గల్పించినవాడు (కల్కిమూర్తి), శ్రీమాన్=నిత్యలక్ష్మిగలవాడు, జిష్ణుః=జయనశీలుడైన, సః విష్ణుః=సర్వవ్యాపి యగు ఆ నారాయణుడు, వః -పాయాత్=మిమ్ము బ్రోచుగాత-

గాంభీర్యాతిశయేన యస్య జగతాం నే(త్రాణిమానం గతా
ప(త్రం యస్య నవీనతాం భజతి యత్పద్మేయ మాసీ జ్జగత్
రాజత్కేసరితాం సము(ద్రమమలం యద్వత్స మవ్యబ్జగు
శ్శేతే యస్సవిభావరీశరుచిరః కుర్యాన్యాచ్ఛమ(భంశివః 175

యస్య=ఏ విష్ణువు యొక్క, శయేన జగతాం నే(త్రా=హస్తము భువనములకు శరణమగుచుండగా అణిమానం=అణుస్వరూపమును, గతా=పొందిన దగుచు, బీః=భయము, గామ్=భూమిని, నయాతి=పొందలేదో, (ఇంచు కేనియు భీతి కలుగలేదని భావము) యస్య= ఏ విష్ణువు యొక్క, ప(త్రమ్=వాహనము, వీనతాం భజతి=విహంగాధిపత్యమును పొంది యున్నదో,జగత్=సమస్త(ప్రపంచము, యత్=ఏ విష్ణువు యొక్క. పత్=పాదముచే,మేయమ్=పరిమాణింపదగినదో, యత్=ఏ విష్ణువు యొక్క, వత్సమ్=వక్షస్థ్సలము, అలమ్=మిక్కిలి, సము(ద్రమమ్-సముత్= సానందయైన, రమమ్=లక్ష్మిగలదో, రాజత్ కే=(ప్రకాశించు జలముగల, సరితాం విభౌ=నదీపతియైన సాగరమందు, యః=ఏ విష్ణువు, శేతే=పవ్వళించునో,యః=ఏ విష్ణువు అవిఅబ్జగుః=సూర్యచం(ద లోచనుడో, అరిఈశ రుచిః=అంచులుగల ఆయుధములకు రాజైన సుదర్శము నందుఆసక్తిగల, సః=అట్టి, అః=విష్ణువు, అ(భంశి, స్థిరమైన;=శమ్, సౌఖ్యమును, వః=మీకు, కుర్యాత్=కూర్చుగాత - (అవిః= సూర్యుడు)

తిగ్మత్విడ్ఢిమరుక్సుదృగ్యుగళధృ(ద్క్షోధృగబ్జాక్షియు
క్పక్ష్యారుట్పణిరాట్ప యేడ్పృతమహీభృద్భ్రాణ్మహాచ(క్రవాట్
పాయాద్వోఘధగంబుముగ్ఘనరుచిర్ద్యోద్విడ్ఢ్విడబ్జోష్ఠలి
డ్భక్తాభీష్టదకామధుగ్భువనసృ(డ్బహ్మాండరట్ఛ్రీవిరాట్ 176

తిగ్మత్విట్=వేడికిరణములుగల సూర్యుడు, హిమరుక్ =మంచు కిరణములుగల చం(ద్రుడు అను, సుదృక్ యుగళధృత్=మంచి కనులజంట

దాల్చినవాడు రక్షోధ్రుక్ =రాక్షసులం
సంహరించువాడు; అబ్జాక్షియుక్ =తామరలవంటి కనులతోనొప్పుచున్నవాడు,
పక్షిఆరుట్ =గరుడపక్షినధిష్ఠించువాడు, ఫణిరాట్ శయ ఈట్ =శేషశాయియగు
ప్రభువు, ధృత మహీ భృత్ భ్రాట్ = వీపుపై దాల్చబడిన మందరపర్వతముతో
బాసిల్లువాడు, మహాచక్రవాట్ =సుదర్శన మహాస్త్రమును ధరించువాడు,
అఘధక్ =పాపముల దహించువాడు, అంబుముక్ ఘనరుచిః=మేఘముం
యొక్క పరమశోభవంటి పరమ శోభ గలవాడు, ద్యోద్విట్ =స్వర్గద్వేషులైన
రావణాదులకు, ద్విట్ =శత్రువు, అబ్జాఓష్ఠలిట్ =లక్ష్మీదేవి అధరము
గ్రోలువాడు, భక్త అభీష్టద కామధుక్ =భక్తుల కోరికలుపూరించుటయందు
కామధేనువైనవాడు, భువనసృట్ =సకలజగత్తును నిర్మించు వాడు,
బ్రహ్మాండరట్ =బ్రహ్మాండనియామకుడైన, శ్రీ విరాట్ = విరాట్
స్వరూపుడైన వాసుదేవుడు (మిమ్ము రక్షించుగాత).

**శుండాలేడ్ద్విడనీలకాండవినుతో వీట్కాండకాండో వృషే**
**ట్కాండః కాండజకాండకాండధరజిద్భేట్ఖండచూడామణిః**
**శుండాలాస్యషడాస్యసేవ్యచరణ స్స్వాఖ్యం శివ స్సాదరం**
**దద్యాదద్యసకాండకాండదగళత్విట్కుండలీట్కుండలీ** 177

శుండాల ఈట్ ద్విట్ =గజాసురునకు శత్రువు, అనీల కాండ=తెలిగుర్రముగం
ఇంద్రునిచే, వినుతః=స్తుతింపబడినవాడు,, వి ఈట్ కాండ= విహంగ
రాజవాహనుడైన విష్ణువు,కాండః=బాణముగాగలవాడు, వృష ఈట్ కాండ
ః=వృషభరాజవాహనుడైన విషువు కాండ= నీటియందు పుట్టి పద్మములను,
కాండ = బాణములయొక్క, కాండ = సమూహమును, ధర =ధరించు
మన్మథుని, జిత్ = జయించినవాడు, భ ఈట్ ఖండ చూడామణిః =
నక్షత్రపతియగు చంద్రునియొక్క రేఖయే శిరోభూషణముగలవాడు,
శుండాలాస్యషడాస్య సేవ్యచరణః = వినాయక కుమారస్వాములచే సేవింపదగిన
పాదములుగలవాడు, సకాండ = నీటితో గూడిన కాండద = మేఘమువంటి,
గళద్విట్ =కంఠకాంతి గలవాడు, కుండలి ఈట్, కుండలీ = సర్పరాజైన

వాసుకియే కుండలముగాగల, శివః=శివుడు, సాదరమ్ =ఆదరమున, అద్య
సౌఖ్యం దద్యాత్ = ఈకలికాలమున సుఖము నొసగుగాత(కాండో స్త్రీ
దండబాణార్వ వర్గావసరవారిషు ఇత్యమరః-

యై స్స్వల్పోపి నదీయతే ద్విజనుషే రాజానతే జానతే
కస్మైచి త్త్వ మితశ్చ సంతత మస(ద్రాజానతే జానతే
త్తైః కిం స్వాంత పదంబుజే దివిషదాం రాజానతే జానతే
కీనాశేద్ధతిహృత్యకిన్నజగతాం రాజానతే జానతే 178

యైః ప్రభుభిః = ఏ ప్రభువులచే,జానతే =విద్వాంసుడైన, ద్విజనుషే = బ్రాహ్మణుని కొరకు, స్వల్పోపి = ఇంచు కేనియు, రాః = ధనము, నదీయతే =దానము చేయబడదో, యైశ్చ = ఎవరిచేతను, అజాన తేతు = విద్వత్తలేని వానికి మాత్రము (అపండితునకు,) అమితః రాః=బహుధనము, సంతతమ్ = అవిచ్ఛిన్నముగా, దీయతే = ఈయబడునో, తే = అట్టి, (పాత్రతా పాత్రతల నెరుగని) అస(ద్రాజాః = అసత్ప్రభువులు, నజానతే = నీ మహిమనెరుగజాలరు, తైః కిమ్ =ఆదుష్టరాజులతో నేమి (వారి నాశ్రయించుటవలన నేమియు ప్రయోజనము లేదు), స్వాంత = ఓ` తృతీయైకవచనము) నతే = నమస్కరింపబడినది, అజ ఆనతే = బ్రహ్మచే నమస్కరింపబడినది, జగతాంరాజా = విశ్వనాథునిచే, నతే = నమస్కరింపబడినది, అజానతే-అజా =మూలప్రకృతిచే నతే = నమస్కరింపబడిన, పదాంబుజే , పరమాత్మ పాదారవిందమునందు, అకిత్ న = నివాసములేనిదానవు కాకుమా(కిత నివాసే ధాతుః)సర్వులకు సర్వసౌఖ్యముల నొసగువాడు, బ్రహ్మేంద్ర రుద్రాదులకును వందనీయుడు అగు పరమ పురుషుడుండగా యోగ్యతాయోగ్యతల నెరుగని క్షుద్రప్రభువుల నాశ్రయింపనేల? వారు సన్మానింపలేదని కుందనేల; కావున ఆ పరంధాముని ఆపర వాసుదేవుని ధ్యానింపుము, ఆతడే సర్వసంపదల నొసగును అని ఒక దుః ప్రభువు వలన సత్కారము నొరిందని పండితుడు బాధపడుచున్న తన

మనస్సును సమాధానపరచెను,

కీనాశ పదమునకు యముడు, జగతాంరాట్ పదమునకు విష్ణువని చెప్పినచో, శివపరముగా నర్థము వచ్చును.

వాశ్చారేడ్ధ్వజధగ్ధృతోడ్వధిపతిః కుధ్రేడ్జజానిర్గణే
డ్గోరాడారుడురస్సరేడురుతరగ్రై వేయకభ్రాడరమ్
ఉడ్వీడ్రుఙ్నరకాస్థిధృత్త్రిదృగిభేడార్ద్రాజినాచ్ఛచ్ఛద
స్స్తాదంబుమదంబుదాళిగళరుగ్దేవోముదేవోమృడః 179

వాః= నీటియందు, చార =సంచారముగల జలజంతువు యొక్క, ఈట్ ప్రభువైన మొసలియేధ్వజ = టెక్కెముగాగల మన్మథుని, ధక్ = దహించిన వాడు, ధృత =తలపై దాల్చబడిన, ఉడు అధిపతిః = నక్షత్రేశుడు (చంద్రుడు) కలవాడు,కు = భూమిని, ధ్ర= ధరించు హిమవంతుని యొక్క, జ =స్త్రీ అపత్యమే, జానిః =భార్యగలవాడు (జం కటీభూషణే పత్న్యాం తేజస్యంబుని జన్మని) గణ ఈట్ = గణాధినాయకుడు, గోరాట్ అరుట్ = వృషభేశ్వరు నారోహించువాడు ఉరస్సర = ఉరగములకు, ఈట్ = ప్రభువైన వాసుకియే, ఉరుతరగ్రై వేయక = గొప్ప కంఠహారముచే, భ్రాట్ = ప్రకాశించువాడు, ఉడు = నక్షత్రములకు, ఈట్ = నాయకుడైన చంద్రునియొక్క, రుక్ =కాంతివంటి కాంతిగలవాడు, నర = బ్రహ్మయొక్క, క అస్థి = తలపుర్రెను, ధృత్ = చేత దాల్చువాడు, త్రిదృక్ = చంద్రసూర్యాగ్ని రూపములైన మూడు కనులుగలవాడు, ఇభ ఈట్ =గజాసురునియొక్క, ఆర్ద్ర = రక్తసిక్తమైన, ఆజిన= చర్మమే, అచ్ఛ =స్వచ్ఛమైన ఛదః = వస్త్రముగాగలవాడు, అంబుమత్ =నీరుగలిన, అంబుద అళి =మేఘమాలవంటి, గళ =గొంతుయొక్క, రుక్ =కాంతిగలవాడు, దేవః =సర్వదా ప్రకాశించుచున్న, సః =అట్టి,మృడః =సదాశివుడు, వః ముదే =మీ సంతోషముకొరకు, అరం = త్వరగా, స్తాత్ =ఉండుగాత, మీకు సంతసము జేకూర్చుగాతయని భావము.

**కాచాయ నీచం కమనీయవాచా మోచాఫలస్వాదుముచా న యాచే**
**దయాకుచేలే ధనదత్కుచేలే స్థితే కుచేలే శ్రితమాకుచేలే 180**

దయాకుచేలే = దయానమున్ద్రుడు (భూమికి వస్త్రముగనుండుటవలన సముద్రుడు కుచేలుడు)ధనదత్ కుచేఇలే = కుచేలుని కుబేరునిగా నొనరించినవాడు (ధనం దదాతీతి ధనదః =కుబేరః, ధనద ఇవ ఆచరన్ ధనదత్, ధనదత్ కుబేరః యస్మాత్ సః ధనదత్కుబేరః) శ్రిత = ఆశ్రయింపబడిన, మా =లక్ష్మీ దేవి యొక్క, కుచలే = స్తనప్రదేశముగలవాడైన, అకుచేలే = పీతాంబరుడగు విష్ణుభగవానుడు(కుత్సితం చేలం వస్త్రం యస్య సః కుచేలః సన భవతీతి అకుచేలః) స్థితే = రక్షకుడై యుండగా, మోచాఫల = అరటిపండుయొక్క, స్వాదు = మాధుర్యమును , ముచా = వర్షించునట్టి, వాచా =అనవద్యము హృద్యమునైన వాక్కుతో, నీచం = అల్పుని, కాచాయ = గవ్వకొరకు, నయాచే =యాచింపను.

**ఆంధ్రభాషాభాసము:-**

**అంబలిద్వేషిణం వందే చింతకాయశుభప్రదమ్**
**కూరగాయకృతత్రాసం పాలనేతిగవాంప్రియమ్ 181**

బలి ద్వేషిణమ్= బలిచక్రవర్తికి వైరి, చింతకాయ = తనను ధ్యానించువానికి, శుభప్రదమ్ = శుభముల నొసగువాడు, కు ఉరగాయ = కుత్సితుడైన కాళియునకు, కృతత్రాసమ్ = భయముగలిగించినవాడు,గవాం పాలనే అతిప్రియమ్ = గో పరిపాలనమునందు మిక్కిలి ప్రీతిగల, అమ్= విష్ణువును, వందే = నమస్కరించుచున్నాను, (ఇందు అంబలి కూరగాయ చింతకాయ పాలనేతియనునవి ఆంధ్రపదములవలె స్ఫురించును.)

**నాదాని పాపం నాకేన యేమేనా మనవిందతే**
**తేషా మితి రమానాథో బభాషే మధురాం గిరమ్ 182**

నాకేన =ఓదేవేంద్రా ,యే =ఏ మనుజులు, మే నామ = నాపేరును

న విందతే = ఎరుగరో, తేషాం పాపమ్ =వారి పాపమును, నాదాని తొలగింపను, ఇతి =అని, రమానాథః = రమాపతి, మధురాంగిరమ్ బభా = తీయని మాట బలికెను. (ఇందు నాదాని నాకేన యేమేన, మన అనునవి తెలుగు పదములవలె నున్నవి.)

**చేతులే గోతులే బాలే కాకులే వానముక్కులే**

**రుచిం పశ్యామి సుశ్యామే కచానాం తవ మంజులామ్ 183**

(చ ఈతులే = లక్ష్మీ సమానురాలవైన,గోతులే = సరస్వ సమానురాలవైన, సుశ్యామే = యౌవనవతివైన, బాలే = ఓ ముగ్ధా, తవ కచానాం = నీ వెండ్రుకలయొక్క,మంజులాం = సుందరమైన,రుచిం కాంతిని, వానముక్కులే = జలదమాలయందు ( వనానాం సమూహాఃవానం వానం ముంచతీతి వానముచః, వానముచాం కులం వానముక్కులమ్ అ విగ్రహము.) కాకులేచ, కాకులయందును, (జాతావేకవచనమ్) పశ్యామి =చూచుచున్నాను.

**హిందీభాషాభాసముః-**

**ఉత్సరంగకలితోరుకటారీభాజిరాఉతభయంకరభాలాః**

**సంతుపాయకగణా జయతైస్త్వం గాముగోహర మిలావఇలావీ 184**

(ఓరాజా) తవ =నీయొక్క, పాయకగణాః = భటుల గుంపులు, భయంకర భాలాః =భీతిగొల్పు నిటలముగలవారై, ఉత్సరంగ = మిక్కిలి మదించిన, కలిత = అలకృతములైన, ఉరు = ఎత్తైన, కట =కుంభములుగల, అరి ఇభ= శత్రు గజములను, అజి = యుద్ధములందు, రాః = వశము చేసికొనువారు, సంతు = అగుదురుగాత, త్వమ్ = నీవు, తైః = అట్టి వీరసైనికులతో, (గూడిన వాడవై.) ఉత = మరియు ఇలావః - ఇలా = భూమిని, అవః = రక్షించుచున్న వాడవగుచు, ఇలావీ- ఇ = కామమును, లావీ = త్రుంచివేసినవాడవై,అగోహరమ్ = గవాపహరణము జేయక, గామ్ = భూమిని, జయ = వశపరుచుకొనుము.

అస్యపగారం యుధ్యచ్ఛంబరసురశత్రురాత్తభయవికలః
ప్రద్యుమ్నహరివిభిన్నోనేకపనాశం వినష్టోఽభూత్ 184

అసి అపగారమ్ = ఖడ్గమునెత్తి( కత్తిలేబట్టి) ( అపపూర్వక, ఉద్యమనార్థక గురీధాతువు ణముల్ ప్రత్యయాంతము) యుధ్యత్ = యుద్ధసన్నద్ధుడైన, శంబర = శంబరుడను, సురశత్రుః రాక్షసుడు, ఆత్త = పొందబడిన, భయ =భీతిచే, వికలః = చిత్త విభ్రమకలవాడగుచు, ప్రద్యుమ్నహరి = సింహము వంటి ప్రద్యుమ్నునిచే, భిన్నః =భేధింపబడినవాడై, అనేకపనాశమ్ = ఏనుగు చచ్చినట్లు, (అనేకప ఇవ నంక్ష్వా = అనేకపపనాశమ్ ఉపమానేణముల్) వినష్టః అభూత్ = నశించెను.

లక్ష్మీవన్ కృతకూరసూ, రణదహిన్దూధక్షమఃపాపడీ-
లాడూఢోకంఫీబఢాంచనబడీఖజాంబుదాలీరుచిః
మద్ధాశాకరఖండనోవివిభునాక్షీరావసాతుల్యమాం
పాసుంహోలితడిన్నిభాంగవసనోఽవ్యాస్స్వకంసారవాన్ 185

క్షీరావస–క్షీర = క్షీరసాగరమునందు, (నామైక దేశేనామగ్రహణమ్- అనున్యాయానుసారము క్షీరపదము క్షీరసాగరపరము) ఆవస = నివసించువాడా. అతుల్య = ఎందునూ తుల్యవస్తువు లేనివాడా, బడాంచన =పొందబడిన చక్రాది చిహ్నములు గలవాడా, ('లడయోరభేధః' అను నియమానుసారము 'వలాంచన' బడాంచనయైనది, అవాప్యోరుపసర్గయోర్లోపః అనుటవలన – అవ అపి అను ఉపసర్గలలోని అకారము లోపించును, అవధానము వధానము. అపిధానము పిధానము, ఇత్యాదులూహ్యములు) లక్ష్మీవన్ = సర్వదా లక్ష్మిగల ఓ విష్ణుమూర్తీ,కృతకూః। కృత=చేయబడిన, కు =భూమియొక్క,ఊః = రక్షణకల వాడవు, అసూః = పుట్టుకలేనివాడవు, రణదహిన్ –రణ = యుద్ధమును, ద = కలిగించుశత్రువులను, హిన్ = హింసించువాడవు, దూధక్ – దూ = సకల దుఃఖములను, ధక్ దహించువాడవు, క్షమః =సర్వసమర్థుడవు, పాపడీ = సకల పాపములను తొలగించువాడవు, (పాపం

లునాతి యనికాని, పాపం లీయతే అస్మాదితి యని కాని విగ్రహము)
ఇలాట్‌- ఇలా = మూడడుగుల భూమికై,అట్‌ =భిక్షాటన జేసినవాడవు,
అకలఘీ-అక = సకల ఃదుఃఖములను,లఘీ = లంఘించినవాడవు, బడీ =
గొప్పబలముగలవాడవు ( లకారడకారముల కభేధము)ఖాజాంబుదాలీరుచిః-
ఖ = ఆకాఃమునందు,అజ = వెళ్లెడి (ఖే అజంతి గచ్ఛంతీతి ఖాజాః) అంబుద
అలీ = మేఘమాలయొక్క ,రుచిః = కాంతివంటి కాంతిగలవాడవు,
మడ్డాశాకర ఖండనః-మడ్డ = చాణూర ముష్టి కాది మల్లులయొక్క, ఆశా =
తనను జయించుట మున్నగు ఆశలయొక్క, ఆకర = సముదాయములను
(విజయావకాశములను) ఖండనః = త్రుంచివేసిన వాడవు,వివిభునా =
పక్షిరాజైన గరుడునిచే,ఊఢః = వహింపబడువాడవు, అలి తడిన్ని భాంగ
వసనః -అలి = తుమ్మెదలతో, తటిత్‌ =మెరుపుతీగలతో, నిభ = సరిదూగు
, అంగ = శరీరము, వసనః = వస్త్రములుగలవాడవు, సారవాన్‌ =
సారవంతుడవైన, త్వమ్‌ = నీవు, పాసుమ్‌ =ప్రాణా వశిష్టుడనైన, మామ్‌ =
నన్ను, అవ్యాః = రక్షించుదువుగాత.

ఖాటీచ్ఛాశిపలేహపాపడవడీర్ష్యారోడభాజీగణో
యద్భక్తోనిమిషీవవాకులచణా ధ్యాయంతి యాం యోగినః
కాలాభీలకరాలభూఖలమహోద్దైత్యేంద్రమాథార్థినీ
సాసానూయరసాతవాఘుటతయేస్తాత్కూర్ణమోటీచిరమ్- 186

కులచణాః = సప్తమ్నామార్గమునందు సంచారసమర్థులైన, యోగినః =
తాపసులు, యామ్‌ = ఏచాముండను, ధ్యాయంతి = ధ్యానింతురో,
యద్భక్తః = ఏచాముండను భజించు,గణః =సేవకగణము, ఖాటీ = ఆకసమున
చరించు ప్రేయసులతో గూడ, ఇచ్ఛాశి = స్వేచ్ఛగాతినెడి, వల ఈహ =
మాంసాభిలాషగలిగిన పాపడ = పాపములజేయు, (పాపంలాతీతి పాపలః)
వడీ = బలముగల (లడయోః వబయోశ్చ అభేధః) ఈర్ష్యా = అసూయచే,
రోడ = చపలముగా, భాజీ = పొందినదైనను, అనిమిషీవ = దేవతవలె,
(రాజతి = ప్రకాశించునో) కాల = నల్లనైన,ఆభీల = క్రూరులైన, కరాల =

భయంకరులైన, భూఖం = భూమి ద్రోహులైన, మహాదైత్యేంద్ర = పెనురక్కసి దొరల యొక్క ,మాథ = సంహారమును , అర్థినీ = అభిలషించునట్టిది, సాసూయరసా = అసూయాయుక్త ప్రేమరసముగల. సా= అట్టి, కర్ణమోటీ = చాముండ, తవ = నీ యొక్క, అఘటతయే = పాప నివారణకొరకు, చిరమ్ = పెక్కు సమయము, స్తాత్ = ప్రాదుర్భవించుగాత

**సూదాలాత్యుడపాడిమేఖడతటీ కచ్ఛోటజావిభ్రతీ**
**పూతాలేభలడీన నీలజసభానాగీవ పాతాడగా**
**ఖాధోసావజకాడియాలిహలిణవ్యాధైస్సమం పీలితాౖ**
**మామోఘౌఘలవాఘవాలణపదం మందాకినీ వః క్రియాత్ 187**

అత్యుడపాడిమేఖడతటీ- అత్యుడవ =మిక్కిలి పచ్చని గడ్డియొక్క, అడి = సంతతియే, మేఖడ = మొలనూలుగాగల, తటీ = ఒడ్డుగలది, ( లకార డకారముల కభేధము) కచ్ఛోటజా విభ్రతీ- కచ్ఛ =జల ప్రాయదేశములందు, ఉటజ = పర్ణ కుటీరముల, అ= శోభను, విభ్రతీ = మిక్కిలి భరించునది, పూతా = పవిత్రురాలు, రేభలడీననీలజసభా-రేభల ధ్వని జేయు( రలయో రభేధః -) రేభం శబ్దం రాంతితీ రేభరాః) డీన = ఒకచో నిలీనమైన, నీలజ= హంస చక్రవాకాదినీడజముల యొక్క( లడయోారభేధః) సభా = సముదాయముగలది.నాగీవ = నాగాంగనవలె, పాతాడగా = పాతాళము ప్రవేశించునది, ఖ అధః = ఆకాశతలమున, అజకాడియాలిహలిణవ్యాధైః- అజ = బ్రహ్మచే, కాడియ =కాలియ సర్పమునకు, అలి = శత్రువైన విష్ణువుచే - ( లడయోః రలయోఃఅభేధః) హలిణవ్యాధ =హరిణవ్యాధుడైన శివునిచే, సమమ్ = తుల్యముగా , పీలితా = పీడింపబడినది, ( బ్రహ్మచే కమండలువునందు, విష్ణువుచే పాదమునందు, శివునిచే జటాజూటమునందు బంధింపబడినదని భావము) అమా = పరిమాణము లేనిది, అమోఘ = వ్యర్థముగానట్టి, ఓఘ = ప్రవాహము యొక్క, లవా = రవము( ధ్వని) గలది, అపి = మరియు, సూదాల్గా = మిక్కిలి ఉదారురాలైన, అసౌ మందాకినీ = ఈ భాగీరథీ, వః = మీకు, అఘవాలణ = పాప నివారణ పూర్వకముగా, పదమ్

= రక్షణను, క్లియాత్ = చేయుగాత.

దిదేవిషతిమానుష స్సచ తితద్వ్రిభూష త్యసౌ
శిశర్విషతి సర్వధా వివిధయిష్యతే తేన చ
ముము క్షిషతి తత్త్వగత్యవగతే స్సనిస్సంశయం
నినిత్యిషతిసోప్యహో సచ రిరంగభిక్షూషతి 188

మానుషః = మనుజుడు, సర్వదా =అన్ని విధముల, (ఇది అంతట అన్వయించును) దిదేవిషతి = తాను అమరుడను కావలయుననిగోరును (దేవో భవితుమ్ ఇచ్ఛతి = దిదేవిషతి, సన్నంతము) సచ = ఆ అమరుడును, తితద్వి భూషతి = దేవేంద్రుడను కావలయునని కోరుకొనును, (తద్విభుః భవితు మిచ్ఛతి, తితద్విభూషతి) అసౌ = ఈదేవేంద్రుడు, శిశర్విషతి =తాను శివుడు కావలయునని కోరుకొనును ; (శర్వో భవతు మిచ్ఛతి = శిశర్విషతి) తేన చ = ఆ శివునిచే తను, వివిధయిష్యతే =తాను బ్రహ్మకావలయునని కోరబడును, ( ఆత్మనా విధినా భవితుమ్ ఇష్యతే = వివిధయిష్యతే - భావే) సః = ఆ బ్రహ్మయు, తత్త్వగతి అవగతేః = యాథార్థ్యము తెలిసికొనుటవలన, నిస్సంశయమ్ = నిస్సందేహము గా,ముముక్షిషతి = తాను సంసారముక్తుడనుకావలయునని కోరును, స చ = ఆ నిత్యుడును, రిరంగభిక్షూషతి =శ్రీరంగ భిక్షుకుడ కావలయునని కోరును, అహో = ఔరా ఎంత విస్మయము.

మందం నిక్షిపతే పదాని పరిత శ్శబ్దం సముద్వీక్షతే
నానార్థాహరణంచ కాంక్షతి ముదాఽ లంకారమాకర్షతి
ఆదత్తే సకలం సువర్ణనిచయం ధత్తే రసాంతర్గతం
దోషాన్వేషణజాగరూక హృదయ శ్చో రోపమ స్సత్కవిః
వాగర్థవృత్తి సంబంధ సంపరిస్పందతుందిలా
నాదబిందుకలా హేలా లాలసీతు ప్రహేళికా



# ప్రహేళికలు

## ద్వితీయభాగము

✻✻❀✻✻

## బహిర్లాపికలు

శ్లోకముననే ప్రశ్నోత్తరములు గలవి అంతర్లాపికలు, కేవల ప్రశ్నలు గలవి బహిర్లాపికలు, శ్లోకమునందలి ప్రశ్నకు సరిపోవు ఉత్తరములు పాఠకుడే స్వయముగా ఏరుకొనవలసి యుండును, ఇవి పలువిధముల నుండును.

**కేవలవ్యస్తముః-**

ప్రశ్నలకు పదవిభాగరూపమున (సమాధాన రహితముగా) తెలుపుదానిని వ్యస్తమందురు.

**పూజాయాం కిం పదం ప్రోక్తమ్ అస్తనం కో బిభ ర్త్యరః**

**క ఆయుధతయా ఖ్యాతః ప్రలంబాసురవిద్విషః** 1

ఇందు 'సునాసీరః' అను పదము విడివిడిగా ఉత్తర వాచకముగుచున్నది,

ప్ర- పూజాయాం కిం పదం ప్రోక్తం = పూజార్థమున నే పదముఉపయోగింపబడును

ఉ- 'సు' అనునది మంచియను నర్థమున (పూజార్థమున) నుపయోగింపబడును.

(ఉదాః సుజనుడు, సుమతి మొదలగునవి)

# అనుసంహిత

*****

ప్రహేళికాస్వరూపస్వభావములు ప్రథమభాగమునందు సామాన్యముగా పరిచయము జేయబడెను. ఈ భాగమునందు బహిర్లాపికల విషయము మాత్ర ముగ్గడించబడగును. బహిర్లాపికలుప్రశ్నోత్తర ప్రహేళికా జాతికి జెందినవి ప్రాచీన కాలమున వీనికి బహిః ప్రశ్నలను వ్యవహార ముండెను. ప్రశ్నోత్తర పద్ధతి క్రొత్తది కాదు.వేదములలో ఉపనిషత్తులలో శాస్త్రేతి హాస పురాణములలో కావ్య నాటకములలో నిది అగుపడును.

కోహగ్ం స్యా మిత్యబ్రవీత్ ఏతత్ప్రిదాయేతి

ఏతత్స్యా ఇత్యబ్రవీత్ యదేతత్ బ్రవీషీతి (ఋగ్వేదము.

ఇది బ్రహ్మకు మరియు ఇంద్రునకు జరిగిన సంవాదము, 'కః" అనునది ప్రశ్నోత్తర సమముగా స్వీకరించబడినది. 'కః' అను శబ్దము 'ఎవడు బ్రహ్మ'యను అర్థము వచ్చునట్లు వాడబడినది. తనకు సర్వాధికారము నొసగుమని ఇంద్రుడు బ్రహ్మను కోరగా ' కోహగ్ంస్యామిత్యబ్రవీత్ ఏతత్ప్రిదాయేతి' ఇది నీకిచ్చి నేనేమి కావలయునని బ్రహ్మ 'యనెను అప్పుడు 'ఏతత్స్యా ఇత్యబ్రవీత్ యదే తత్ బ్రవీషీతి' నీ వేది పలికితివో అదియే కావలయును, అనగా 'కః' యే కావలయును. నీవు బ్రహ్మ పదవాచ్యుడవు కావలయునని బ్రహ్మ ప్రశ్నగా ఉపయోగించిన 'కః' అను దానిని ఇంద్రుడు ఉత్తరముగా గ్రహించెను.

ప్రశ్నోత్తర సమతలేకున్నను బృహదారణ్యాకాది ఉపనిషత్తులలో

పలుచోట్ల ప్రశ్నోత్తర పద్ధతి అవలంబించబడెను.

త్రయాః ప్రాజాపత్యాః ప్రజాపతౌ పితరి బ్రహ్మచర్యమూషు ర్దేవా మనుష్యా అసురా ఉషిత్వా బ్రహ్మచర్యం దేవాఊచు ర్బ్రవీతు నో భవానితి తేభ్యో హైదతక్షర మువాచ ద ఇతి వ్యజ్ఞాసిష్టా ఇతి వ్యజ్ఞాసిష్మేతి హెూచు ర్దత్తేతి అథ హైనం మనుష్యా ఊచు ర్బ్రవీతు నోభవానితి తేభ్యో హైతదేవాక్షర మువాచ ద ఇతి వ్యజ్ఞాసిష్టా ఇతి వ్యజ్ఞాసిష్మేతి హెూచు ర్దయధ్వమితి ................ తదేతదేవైషా దైవీ వాగను వదతి స్తనయిత్నుర్ద ద ద ఇతి దామ్యతదత్తదయధ్వమితి తదేతత్ త్రయగ్ం శిక్షే ద్దమం దానం దయామితి, బృహదారణ్యకము ద్వితీయ బ్రాహ్మణము ద్వితీయాధ్యాయము. 1 2 3

బ్రహ్మచర్య వ్రతానుష్ఠాన పూర్వకముగా ప్రజాపతి సన్నిధిని శిష్యత్వము నవలంబించిన దివిజాలు మనుజులు దితిజులను కుమారులు అయ్యా మా కుపదేశము జేయుడని ప్రజాపతినికోరగా అతడు ముప్వురకు 'ద' అను అక్షరమునుపదేశించి దీని అర్థము మీకు తెలియునా యని ఆ ముప్వురనడిగెను. అపుడు దేవతలు ఇంద్రియ లోలతను విడిచి దమనము (ఇంద్రియ నిగ్రహము) నవలంబించ వలయునను అర్థము ద య ను అక్షరమునకు గైకొంటిమని చెప్పిరి. మానవులు స్వాభావికమగు లోభమును త్యజించి దానము చేయవలయునని అర్థ మా అక్షరమునకు గైకొంటమని నుడివిరి. దానవులు సహజమగు క్రూరతను విడనాడి దయ నవ లంబించ వలయునను అర్థము ఆ అక్షరమునకు గ్రహించితిమని తెల్పిరి. దాన దయలు తమ జాతి కనుకూలముగా గైకొనిరని ప్రజాపతియు వారి తలంపు యుక్తముగా నున్నదని అంగీకరించెను. ఇందు ప్రశ్నోత్తర పద్ధతియే గాక ని గూఢత కూడ కలదు

మహాభారతము నందరణ్య పర్వమున సర్ప యుధిష్ఠర సంవాదమందు ప్రశ్నోత్తర పద్ధతి కలదు.

బ్రాహ్మణఃకో భవే ద్రాజన్ వేద్యం కించ యుదిష్ఠిర
బ్రవీహ్యతిమతిం త్వాం హి వాక్యై రనుమిమీమహే
సత్యం దానం క్షమా శీల మానృశంస్యం తపో ఘృణా
దృశ్యంతే యత్ర నాగేంద్ర స బ్రాహ్మణ ఇతి స్మృతః
వేద్యం సర్వ పరంబ్రహ్మ నిర్దుఃఖ మసుఖంచ యత్
యత్ర గత్వా నశోచంతి భవతశ్చ వివక్షితమ్

(అరణ్య పర్వము180 సర్గ)

సర్పరూపమున భీముని మ్రింగదలచు నహుషుని జేరిధర్మరాజు అతనిని ప్రార్థింపగా నా ప్రశ్నలకు ఉత్తర మొసగినచో విడిచెదనని నహుషుడు పలుకెను.ధర్మరాజు ప్రశ్నించుము యథామతి సమాధాన మొసగెదనని అనును. అపుడు సర్పరూపమున నున్న అతడు బ్రాహ్మణుడన నెట్టివాడు? తెలిసికొనదగిన దేది యని ప్రశ్నించగా , సత్యదాన శీలాదులుగల వాడే బ్రాహ్మణుడనబడును. సుఖ దుఃఖాది వికారముల కతీతమగు బ్రహ్మపదార్థమే తెలిసికొనదగినదని ఇత్యాది రూపమున సర్పము వేయు ప్రశ్నలకు ధర్మరాజు సమాధాన మొసగెను.

మహాభారతమునందు యక్ష ప్రశ్నలు ధర్మ రాజ సమాధానములు మన మెరిగియే యున్నాము. యక్ష ప్రశ్నలలోని నిగూఢత ప్రశ్నోత్తర ప్రహేళికా జాతిని స్ఫురింపజేయును.

దేశ సంచారము జేయు కిరాత రాజమంత్రులకు మరియు రాక్షసికి జరిగిన సంవాదము యోగవాసిష్ఠమునందు 79,80 సర్గలలో కలదు.

ఏకస్యానేకసంఖ్యస్య కస్యాణో రంబుధేరివ
అంతర్బ్రహ్మాండలక్షాణి లీయంతే బుద్బుదా ఇవ

కిమాకాశ మనాకాశం నకించిత్కించిదేవ కిమ్

కోఽహమేవాస్మి సంపన్నః కోభవా నస్యహంస్థితః (79సం

భవత్యాత్మా పరాత్మైష కథితః కమలేక్షణే

అనయైవ వచోభంగ్యా ప్రశ్నవిద్భోధయోగ్యయా (80సర్గ

ఓ రాక్షసీ! నీ ప్రశ్నలకు నే సమాధాన మిచ్చెద అడుగుమని మంత్రియన రాక్షసి ఇట్లు ప్రశ్నించును. యథార్ధముగా నొకటేయైనను పాధి భేధము వలన అనేకముగా గన్పట్టునదేది? శూన్యముగాని ఆకాశమేది? నీ దైనను ఉనికిగల దేది? నే నెవరను? మీ యందహంభావము రిగియున్నదేది? అనగా ఓ అరవిందలోచనా! యుక్త వాక్యములచే నీవు రమాత్మను గూర్చియే తెల్పినా వని రాక్షసి వేసిన 70 ప్రశ్నలకు మంత్రి మాధాన మొసగును.

శాస్త్రాదులలో ప్రశ్నలు ఉత్తరము లుండుట సర్వవిదితము. కాళిదాసు క్రమోర్వశీయ త్రోటకమునందు చతుర్థాంకమున పురూరవుడు పర్వత జమునుగూర్చి ప్రశ్నించిన శ్లోకమున ప్రశ్నోత్తర పద్ధతి నవలంబించెను.

సర్వక్షితిభృతాం నాథ! దృష్టా సర్వాంగసుందరీ

రామా రమ్యే వనాంతేఽస్మిన్ మయా విరహితా త్వయా

ఓ పర్వతరాజమా! నన్నెడబాసిన సర్వాంగ సుందరియగు నా ప్రేయసిని వనమున చూచితివా? అను పురూరవుని ప్రశ్న కొండగుహలో ప్రతిధ్వనించిపురూరవునకుకొండయే సమాధాన మిచ్చినట్లుభ్రమింపజేసెను. కలరాజా ధినరాజా ని న్నెడబాసిన నీ ప్రేయసిని నే జూచితిని సుమాయని ర్వతమే తన ప్రశ్నకు సమాధాన మొసగెనని పురూరవుడు భావించెను. ర్వక్షిభృతాం నాథ ఆస్మిన్ రమ్యే వనాంతే మయా విరహితా సర్వాంగసుందరీ

రామా త్వయా దృష్టా అని పురూరవుని ప్రశ్న. సర్వక్షితిభృతాం నాథ త్వయా విరహితా రామా మయా దృష్టా అని పర్వతము సమాధానము. (రామాయణము నందలి శ్లోకమును కాళిదాసు గ్రహించెను) మరియు లీలావతీ గణితమందు ప్రశ్నోత్తర పద్ధతియే అవలంబించబడినది.

షడ్భాగః పాటలీషు భ్రమరనికరత స్స్వాత్ త్రిభాగః కదంబే
పాద శ్చా త్రద్రుమేషు ప్రదలితకుసుమే చంపకే పంచమాంశః
ప్రోత్ఫుల్లాంభోజషండే రవికరదళితే త్రింశదంశోభిరమ్యే
తత్రైకోమత్తభృంగోభ్రమతివదసఖేకాభవేత్ భృంగ సంఖ్యా
(3వఅధ్యా:

తుమ్మెద గుంపునందు 1/6 1/3 1/4 1/5 1/30 భాగములు క్రమముగా పాటలికడిమి సంపెంగపూలు విచ్చిన తామరలు అను వానిపై ప్రసరించెను. అందొకటిమాత్రమిట తిరుగుచున్నది. అట్టులేని తుమ్మెద సంఖ్య యెంత ఉండునో తెల్పుము. లబ్ద సంఖ్య 60 అని తేలును. కళాపూర్ణోదయమునందును ప్రశ్నోత్తరపద్ధతి ఈ పద్యమునందు కలదు.

అపరిమితాను రాగ సుమనోలసమై చిగురాకు చేతులం
దపసిని గౌగిలించె వనితా యిదె రంభ దలంప రంభ తా
నపరిమితానురాగ సుమనోలసయై చిగురాకు చేతులం
దపసిని గౌగిలించు టుచితం బెగదా యని నవ్వె రంభయున్

ఇందు ప్రశ్నోత్తరరూపముననే శ్లేష వక్రోక్తి నిర్వహించబడెను.

ఆలంకారికులు ప్రశ్నోత్తర సమయమును స్వీకరించిరి. కేదార పోషణరతాః అను ప్రశ్నోత్తరమును చిత్రాలంకారముగా దీక్షితాదులు స్వీకరించిరి. మరియు ప్రశ్నోత్తరచ్ఛాయ ఉత్తర ప్రశ్నోత్తర వక్రోక్త్యాదులలో నగుపడును

**వీక్షితుం నక్షమా శ్వశ్రూః స్వామీ దూరతరం గతః**

**అహ మేకాకినీ బాలా తవేహ వసతిః కుతః ( సాహిత్య దర్పణము**

ఇదిఉత్తరోన్నేయ ప్రశ్న ఇందు పృష్ట ప్రశ్నచ్ఛాయ ఉన్నది. బాలా సమాధానమువలన ఇట ఇంచుక విశ్రమింప వీలున్నదా అను పథికుని ప్రశ్న వ్యక్త మగుచున్నది.

**కా విషమా దైవగతిః కిం లబ్ధవ్యం జనో గుణగ్రాహీ**

**కిం సౌఖ్యం సుకలత్రంకిం దుర్గ్రాహ్యం ఖలో లోకః**

**(సాహిత్యదర్పణము)**

ఇందు ప్రశ్నోత్తరమాల కలదు.

**కిమారాధ్యం సదా పుణ్యం కశ్చ సేవ్యః సదాగమః**

**కో ధ్యేయో భగవాన్ విష్ణుః కిం కామ్యం పరమంపదమ్**

ఇది అర్థవర్జనీయ ప్రశ్నపూర్వ్కావర సంఖ్య. దీక్షితుడుకువలయానందమున వికృత శ్లేషవక్రోక్తికి నుదాహరించిన ఈ

క్రింది శ్లోకమునందు అంతర్లాపిక కలదు. హానోపాదాన రూపమున అర్థాంత
మేర్పడుట ప్రశ్నోత్తర జాతియందు క్రొత్త కాదు

భవిత్రీ రంభోరు త్రిదశవదనగ్లాని రధునా
నతే రామ స్థాతా న యుధి పురతో లక్ష్మణ సఖః
ఇయం యాస్య త్యుచ్చై ర్విపద మధునా వానరచమూః
లఘిష్ఠేదం షష్ఠాక్షరపదవిలోపాత్ పఠ పునః

ఓ జానకీః ఏల ఉబ్బెదవు నీ రాముడు యుద్ధమున నా ముందు
నిలువలేడు వానర సైన్యము విపత్తు జెందును దేవతలకు ముఖ భంగము
సంభవించునని పలుకుచుండ సీతాదేవి రావణా నీవన్న మాటలలో ఏడ
అక్షరమును విసర్జించి సరిశీలింపుము జరుగునది నీకే తెలియుననెను
మొదటి పాదమున "త్రి" రెండవ పాదమున "న" మూడవ పాదము
"వి"అను అక్షరములను తీసినచో రావణునకు హాని రామునకు విజయము
వానరులకౌన్నత్యము సంభవించునను అర్థము వచ్చును. ఇందు అక్ష
హానమువలన అర్థాంతర మేర్పడినది ఇది యొక అంతర్లాపియే.

అలంకార శాస్త్రమున ప్రశ్నోత్తరసమము బహిరంతర్లాపికల
చిత్రోత్తరాలంకార నామమున ప్రవేశించినవి. శ్రీకృష్ణ బ్రహ్మతంత్ర
పరకాలయతీంద్రపాదులు అలంకారమణిహారమున చిత్రోత్తరాలంకారమునక
లక్ష్యలక్షణముల నీ విధముగా నొసగిరి-

చిత్రోత్తర మలంకారః ప్రశ్నాభిన్నోత్తరం భవేత్
యచ్ఛోత్తరాంతరాభిన్న ముత్తరం తదపీష్యతే.

ప్రశ్నాభిన్నోత్తరము:-

కమలం కరోతి హస్తే కమలా కమలాలయా పరిష్కారమ్

ఇత్యనుయుక్తా కాచన సఖ్యా చిత్రోత్తరం తదేవాహ

ఇందు కమలా హస్తేకమ్ అలంకరోతి అను ప్రశ్నకు కమలం కరోతి అనునది ఉత్తరము. ఇందు ప్రశ్నయే ఉత్తరము.

ఉత్తరాంతరా భిన్నము:-

స్వారాజ్యే కీదృక్షః పున రస్థాపి శ్రియా సహస్రాక్షః

అథ పర్యభవన్ దైత్యాన్ తద్విముఖాన్ నిగద్యతాం విపదః

ఇందు విపదః అనునది రెండు ప్రశ్న లకు ఉత్తరము. ఫణిగిరి పతిః కిం వితరతి అను ప్రశ్నకు శమ్ అని, అంగద్యుతివైభవేన కిం జయతి అను ప్రశ్నకు ఖమ్ అని, రిపువిజయే కంధ్వనయతి, కంధరయా కంధునోతి అను ప్రశ్నలకు శంఖమ్ అను ఉత్తరము ఇవి అంతర్లాపికలు.

ఫణిశిఖరిణి కో నివసతి కో ధూపో ఘ్రూణతర్పణ స్తస్య

కిమహార్రి రహసి హరిణా విద్య న్నుత్తర మిహైక మేవవద

శ్రీ వాసః అనునది మూడు ప్రశ్నలకు ఉత్తరము. ఇది బహిర్లాపిక. శ్రీ వేంకటార్య విరచిత అలంకార కౌస్తుభమునచిత్ర ప్రశ్నయనునది కలదు.

ప్రశ్నోత్తర పద్ధతి మానవుని జిజ్ఞాసా స్వభావమును వెల్లడించును